




రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్ వారి తరఫున ఇండియాలో తయారుచేయబడినది

# విషయానుక్రమ

## అక్టోబరు 1954



గంగిరెద్దు

చిత్రకారుడు: క. సుల్తానాలీ



జయ
ఆశ్వయుజము

# భారతి

సంపుటము 31
సంచిక 10

## * పూజ *

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

ఆసేతుస్థగిత శీతపర్వత సమస్తాశాంత రాశంబులన్
శ్రీ సర్వేశ్వరి ! పెక్కునామములతో సేవింతు రత్యంత వాం
ఛా సంసిద్ధికి భారతీయులు కృపా సర్వస్వమా నిన్ను న
త్యాసక్తిం గరుణించుచుందువుగదమ్మా ! నీవు కాత్యాయనీ !

పరమానందముతోడ భక్తి నిను నంబా ! యన్న నామంబుతో
వరణీయంబుగఁ గొల్చుచుండి శుభముల్ వర్ధిల్ల శ్రద్ధాత్మ లీ
శ్వరి ! కాశ్మీరజనుల్ మహోత్సవములన్ సంతృప్తి సల్పంగ స
త్కరుణా వార్నిధి వారిఁ దేల్చెదవుగా కల్యాణి! శ్రీ శాంభవీ !

కొమరుగ నీపదాబ్జములు ఘూర్జరవాసులు కొల్చుచుంద్రు నీ
యమలిన సత్కృపామృతము నందలి మక్కువఁజేసి హింగుళా
సుమహిత నామముగ్ధులయి చొక్కుదురమ్మ ! త్వదీయసేవలన్
భ్రమలు నశించు; భాగ్యములు పండును నీదుకటాక్ష దృష్టులన్

కల్యాణాత్మక దివ్యరూప వగుటన్ కల్యాణి యన్ పేరు సా
కల్యం బౌనటు కాన్యకుబ్జజులు నిన్ గల్యాణకాంక్షాత్ములై
కల్యాణీ! కడుఁ బ్రస్తుతించెదరు; త్వత్కారుణ్య సంపాదనా
మూల్యం బెయ్యది భక్తిగాక కరుణాంభోరాశి; నారాయణీ!

దక్కను భూ ప్రజల్ నిను ముదంబునఁ గొల్చెద రంబికాఖ్యచే
మిక్కిలి ప్రీతి చెంది యుపమింపఁగరాని కటాక్షవీక్షణన్
జొక్కఁగఁ జేసి సంపదలు చుబ్బన చూఱఁగ నిచ్చుచుందు వెం
పెక్కిన నీకటాక్షమున కెయ్యది సాటి? జగత్కుటుంబిని!

ఉమ యను ముద్దుపేర నిను నొప్పుగఁ గొల్చి సమస్త వాంఛ లం
తముఁ గనుదాఁకఁ గాంతురఁట తత్పరులై మిథిలాపురీ ప్రజల్
విమల మనస్కులై నిను వివేకముతోఁ గొలువంగ నెట్టి లో
పము కలుగున్ త్వదీయు లగు భక్తుల కెన్నఁటికైన? భార్గవీ!

దుర్గానామముతో స్తుతించి నిను నాంధ్రుల్ వంగదేశీయు లో
భర్గప్రాణసఖీ! భజించెదరు; సంభావించి నీభక్త స
ద్వర్గంబున్ గృపచూచుచుందు వది యబ్రంబౌనె? తల్లీ! భవ
న్మార్గం బెన్నఁడు భక్తరక్షణ కళానందాఢ్యమేగా! సతీ!

ఇతరుల్ నిన్ను "మహేశ్వరీ!" యనుచు "గౌరీ!" యంచు "కాత్యాయనీ!"
"సతి!" "నారాయణి!" "మోహినీ!" యని యశేషంబైన నామాళితోఁ
గృతపుణ్యుల్ బహుభంగులం గొలువ భక్తిన్ శక్తి యుక్తిన్ గృపా
వ్రతసంపన్నవు ప్రోతువెల్లరిని శర్వప్రాణ దేహార్ధమా!

అమ్మా! తావక సత్కటాక్షమున కత్యంతంబు సత్పాత్రులన్
మమ్ముం జేయఁగదమ్మ! ఏలుకొనుమమ్మా! మమ్ము నీ బిడ్డలన్.
కొమ్మా! తావక పాదపూజలను నీకున్ భ నందించు డెం
దమ్మల్ పూలును పండ్లు దేవి! కృప మోదమ్మంది కాత్యాయనీ!

నాటిక:

# * తుమ్మెద *

## 'బాలకృష్ణ'

### : పాత్రలు :

గిరిజ : బి. ఏ. చదువుకుంది.
నిర్మల : గిరిజ స్నేహితురాలు. బి. ఏ.
గిరిజతల్లి : కొంచెం పూర్వకాలపు మనిషి.
శారద : ప్రసాదరావుగారి భార్య.

★ ★ ఒకగది; గదిలో—ఒక పడకకుర్చీ, సోఫా, డ్రాయరు—డ్రాయరుమీద అలారం గడియారం, చుట్టూ ఫొటోలు వగైరా; పడకకుర్చీలో రెండు జడల అమ్మాయి కూర్చుని వుంటుంది. కొద్దిగా పువ్వులు పొద్దుట పెట్టుకున్నవి, కొద్దిగా నలిగివుంటుంది చీర ప్రొద్దుట కట్టుకుని ఉండటంవల్ల. ఒకచేతిని గాజులు వుండవు. ఆ చేతిని 'వాచి' ఉండి ఉండవలసింది అది ఏ బజారో బీచో అయివుంటే. కొద్దిగా ఊగుతూ నవల ఏదో చేత్తో పట్టుకుని చదువుతూవుంటుంది. ఈ అమ్మాయి పేరు గిరిజ. పదునెనిమిది పందొమ్మిది ఏళ్లు ఉంటాయి. ముఖాన పౌడరు బాగానే వుంటుంది. తాంబూలం నములుతూ వుంటుంది. ★ ★

గిరిజ : (చదువుతోంది) అసలు కొందరు ఈ విధంగానే అవకాశాలు చేజార్చుకుని తరువాత విచారిస్తారు. అవకాశాలు అస్తమానూ రావు. ఏదో నలుగురూ అనుకుంటారని ఒదిగి, బూజుపట్టిన సంఘపు నీతుల జాబితా చూసి తమ జీవితాల్ని పాడుచేసుకుంటారు యిటువంటి వ్యక్తులు. తన సుఖానికి అడ్డురానంతవరకు యితరులకు సహాయం చెయ్యాలి. కాని తన సుఖానికి యితరు లడ్డంవస్తూంటే, తన సుఖంకోసం వారికి బాధకలిగించినా హృదయం పశ్చాత్తాపపడవలసిన అవసరం లేదు...

[నవల చదువుతూవుండగా గిరిజతల్లి లోపలికి వస్తుంది; గిరిజ తల్లి—కొంచెం పూర్వకాలపు మనిషి. ఆ యింట్లో యీావిడ మాట అంతగా చెల్లకపోయినా, పోయిందేముందని సలహాలు మాత్రం యధాశక్తిగా యిస్తూనేవుంటుంది. తమలపాకులు ఈనెలు తీసూ వస్తుంది, నుదుట రూపాయంతబొట్టు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆంధ్రభాషాసమితి జరిపిన ఏకాంకిల పోటీలో ద్వితీయ బహుమానము పొందిన నాటిక.

ఒక యీానెతీసి పడేస్తుంది. పడేసి కూతురంత దర్జాగా కాకపోయినా, కూర్చుంటుంది కొంచెం విశ్రాంతి తీసుకుందుకు ఉద్యమించినట్టు]

త : అమ్మాయ్..నాన్న ఆఫీసుకు వెళ్ళారా...

గి : వెళ్ళారమ్మా...(నిశ్శబ్దం)

త : ఏమీ తోచటంలేదు...అల్లా నువ్వే చదువుకోపోతే కాస్త ఆకథ యేవో నాకూ చెప్పకూడదూ?...

కథకేంగాని నాన్నగారు అదోః ఉన్నారేం యీావాళ?

: ఏమోనమ్మా మీ ఆవోలా ఉండడాలు నాకేం అర్థంకావు...ఇద్దరిమధ్యా చస్తున్నా సమాధానాలు చెప్పకోలేక...

గి : ఇప్పు డేమయిం దేమమ్మా...

త : ఏదో క్రొత్తగా అవాలా ఎప్పుడూ ఉన్న భాగోతమే కదమ్మా...అయినా నాగోడ వెవరికొక్కాలి నామాట ఎవరు పట్టించుకుంటారు...ఆయనకి చిలక్కి చెప్పినట్టు చెప్పాను, పొయ్యిదగ్గిర బ్రతికే ఆడదానికి బియ్యేలు ఎమ్మేలు ఎందుకండీ అని, వింటేనా...

గి : [తల్లిధోరణి వెఱ్ఱిధోరణిక్రింద కట్టి ఆనందిస్తూ వుంటుంది.]

త : ఈవిడ చిలకలా చేరి నాన్నా చదువుకుంటాను అనడం. తల్లీ చదువుకో అమ్మా మనకేం వంద మంది ఉన్నారు కనకనా, కొడుకువయినా కూతురువయినా నువ్వే అనడం...(ఈసడింపుగా) అయింది సంబడం... తెలిసొచ్చింది...ఇప్పుడు చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుని ఏం లాభం? అనుభవిస్తున్నారు...

గి : ఇంతకీ ఏమంటావు...

త : మీ నాన్నగారు ఆ చేత చేసింది...ఈ చేత అనుభవిస్తున్నారు అంటాను...

గి : ఆ చేత్తో ఏం చేశారంటావు? ఈ చేత్తో ఏం అనుభవిస్తున్నారంటావు?...

త : ఆ చేత్తో గాలికిపోయే కొరివిని తెచ్చుకున్నారు......యీా చేత్తో అనుభవిస్తున్నారు. మా అమ్మాయి బియ్యే వెలిగిస్తోంది అని ఎగిరారు. ఇప్పుడు మా అమ్మాయి పెళ్ళికాక యింట్లో కూర్చునుంది అని ఏడుస్తున్నారు...

గి : అయితే నేను పెళ్ళిచేసుకోకుండా ఇంట్లో కూర్చోడం చాలా ప్రమాదకరమయిన విషయం అంటావు.

త : అబ్బే ఎందు కవుతుందీ యిదంతా సంస్కారం...

గి అయితే నీకుకూడ వచ్చేశాయి యీా మాటలు యికనేం

త చాల్లే ఎగతాళి చేశావులే ఊరుకో. నిన్ను గుండెమీద నిప్పులా భరిస్తున్నాం నీకేం తెలుస్తుంది? నీ క్లబ్బు లేమిటో నీ స్నేహితు లెమిటో నీ షైరేమిటో అంతే కాని నువ్వు యిల్లా యింట్లో వుండడం మాకెంత బాధో నీకు తెలియటల్లేదు.

గి : నే నింట్లో ఉండడం బాధ అంటావు...

త : అతురాలా.

గి : అయితే వెళ్లిపోతాను...

త : ఇంకా నయం. అటువంటి అప్రభంశపు మాట కలలోకూడా అనుకోకు. ఇల్లాగే నన్ను తలెత్తుకు బతకనీ...

గి : నే వేరూ మీరు వేరూ......నేను మీ కీర్తికి మచ్చ తెచ్చేదాన్ని అంతేగా...

త : ముమ్మాటి

గి : అమ్మా తెల్సునా తెలీదా...

త : ఏమిటి?

గి : శరీరంలో చెడ్డభాగముంటే వైద్యుడు అక్కడకు కొట్టిపడేస్తాడు. అల్లాగే నన్నూ బయటకు పొమ్మనండి...

త : ఇల్లా మొండివాదన చెయ్యకపోతే తీసుకు వచ్చిన సంబంధమేదో ఒకటి ఒప్పుకోరాదూ...

గి ఎందుకు?

త ఎందు కేమిటి నా తలకాయ. పెళ్ళిచేసుకుందుకు!

గి పెళ్లెందుకు?

ఏడవను

ఏం నవ్వుతూ ఉండకూడదా...

[ఉడుకుమోతుతనంగా] ఇల్లా చెప్తేనే ఒళ్లుమండేది. ఎంత తెలియనిదాన్నయినా పెద్దదాన్ని నేనా సరసంగా మాట్లాడొద్దూ.

గి : అదేమిటమ్మా అల్లా అంటావు నువ్వంటే నాకెంత గౌరవం అనుకున్నావు?...

త : [కొంచెం సంతోషించుతుంది]

గి : పెళ్ళిచేసుకోడం అంత అవసరమా అమ్మా.

కాదు మరీ.

ఎందుకు?

సుఖపడడం కోసం.

నువ్వు సుఖపడుతున్నావా...!

: ఇందులో వున్న సుఖం యిందులో వుంది.

పెళ్ళిచేసుకోకుండా ఉండడంలో వున్న సుఖం పెళ్ళిచేసుకోకుండా ఉండడంలో వుంది.

త : ఇలా వితండవాదన పెడ్తే నీకు చెప్పలే నమ్మా...

గి : అబ్బే అదికాదు చెప్పమ్మా మరి...నాకా సుఖం అక్కరలేదు అంటున్నా...అటువంటప్పుడు నన్ను బలవంత పెట్టి సుఖపెటడం దేనికి?

త : బియ్యే చదువుకుని నేర్చుకున్న తెలివితేట లివేగా, అమ్మా తల్లీ నీకు సమాధాన మెవరు చెప్ప గలరు...మీ నాన్నగారు వచ్చినతర్వాత ఆయన్నే అడుగు చెప్తారు ..

(చిరాలున లేస్తుంది)

గి : అమ్మా అమ్మా నువ్వు లేచివెళ్లావంటే నామీద ఒట్టే...[లేచివెళ్ళి బ్రతిమాలి కూర్చో

[తల్లి తిరిగి కూర్చుంటుంది]

గి : అమ్మా పోన్లే కాని...ఒకబాధ విదన్నా ఉందనుకో దాన్ని పోగొట్టాలంటే అదేమిటో తెలి యాలి కదూ...

గి. త : ఇది మరీ చిత్రంగా వుంది బాధ ఏమిటో తెలియకుండా పోగొట్టడ మెలా...

గి : అయితే బాధనుగురించి తెలుసుకోడం చాలా అవసరం అంటావు.

గి. త: ఉఁ.

గి : ఇప్పుడు నేను పెళ్లి చేసుకోకపోతే మీకేం బాధ ?

త : బాధకాదు టే తెలియనట్టు అడుగుతావు; ఈపాటికే అప్పుడే అమ్మలక్కలంతా బుగ్గలొడుచు కుంటున్నారు.

గి : వాళ్ల బుగ్గలే బాధపెడ్తాయి.

త : నీళ్లకు వెళ్తూంటే ఆవిడ కూతురే అంటు న్నారు నలుగురూ, అల్లా వేలెత్తి చూపించు కోడమూ?...

గి : అయితే నీళ్లకు వెళ్లడం మానెయ్యి...

త : ఇది మరీ అందంగావుంది...అయితే నీకు తోచిందే కాని సంప్రదాయం కట్టుబాటు అటు వంటివి లేవు అంటావు...

గి : లేవన్ను కాని అవసరాన్నిబట్టి మారుతూ వుంటాయి అంటాను.

త : అన్నీ అవసరముంటే చేస్తున్నామా... లోకంకోసం కొన్ని మనం చెయ్యాలి...

గి : నాకు లోకంతో సంబంధంలేదు. నేను అవసరముంటేనే చేస్తాను ఏ పనేనా...నాకు ఇప్పుడు అవసరం లేదు.

త : మరి నీ కవసరమొచ్చేరోజు వచ్చేసరికి ఎవరూ చేసుకోకపోతే?

గి : అసలు అవసరమే వుండదు...

త : పోనీ అల్లా అనుకున్నా పెళ్ళి లోకం కోసం చేసుకోకతప్పదు.

గి : మళ్లీ చెప్తున్నా నా కవసరం లేకుండా ఏపనీ చెయ్యనని.

త : అల్లాగా...మరి ఆ ముఖానికి స్నో, పౌడరు, నా ముఖం ఇవన్నీ అవసరం అనేనా నువ్వు రాస్తూవుంటు:

గి : అవును పరిశుభ్రంగా వుండేందుకు...

త : నీటుగా గోటుగా అందరకూ కనపడేం దుకు కాదన్నమాట.

గి : (అంతవరకూ తల్లిని ఉడికిస్తూ ఆనంది స్తూన్నా ఆవిడకు వచ్చిన ఈ క్రొత్త తెలివితేటలకు ఆశ్చర్యపోతుంది. మరి సమాధానం దొరకక మొండి తనానికి దిగింది.)

గి : కాదు.

త : ఇంటిదగ్గర జిడ్డుముఖంతో వుంటావు. వీధిలోకెళ్లినప్పుడే కాని ఇంట్లో నీటుగాఉండనవసరం లేదా? పోనీ వాటిమాట వదులు...ముందుకు వెళ్ళా డేసుకునే రెండు జడలమాట......చెడ్డ చిరాగ్గా వుండవూ?...

గి : (ఈమారు కోలుకుని తెలివి ఉపయోగి స్తోంది) అబ్బే అవి నీకు చిరాకు కావచ్చు. నాకు సర్దా......నాకు ఆనందాన్ని కలిగించేందుకు అవి అవసరం. అందుకు నేను వేసుకుంటాను.

త : కానియ్యి తల్లీ నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి, పెద్దవాళ్లు చెప్తే వినడం ఉందా ఏమ న్నా నా...అయినా నేచెప్పిం దొకరోజున విన్నారు కనక నా ఈవాళ వినటానికి. ఎల్లా జరిగేవి అల్లా జరు గుతాయి.

[ఇంకొక ఒంటి జడ అమ్మాయి తలుపు తోసు కుని ప్రవేశిస్తుంది. ఈమె పేరు నిర్మల. దగ్గర దగ్గర గిరిజ వయస్సే.]

ని : [వస్తూనే] 'కంగ్రాట్యులేషన్స్' గిరిజా! 'మిసెస్' కాబోతున్నావుటగా. 'వెరీ గ్లాడ్.'

గి : [నోరు నొక్కుకుని తల్లిని చూపించి సైగ చేస్తుంది.]

ని : [తాళం పడ్డట్టు ఆగిపోతుంది]

త : ఏమిటమ్మా ఏదో చెప్తూ ఆగిపోయావు.

గి : ఏమీ లేదు. 'మిసెస్' కాబోతున్నావని సంతోషిస్తున్నాను అంటోంది.

త : మిసెస్ కాబోవడ మంటే?

ని : పెళ్లి...

గి : [చురుగ్గా చూసి] పెళ్ళి చేసుకోకుండా వుండి వాళ్ళందరకూ మంచిదారి చూపించేదాన్ని కాబోతున్నాను అని అర్థం.

త : అయితే నువ్వు పెళ్లిచేసుకోవా ఏమిటమ్మా?

ని : తగ్గ సంబంధం దొరక్కగాని చేసుకోకేముండీ?

త : అల్లా చెప్పమ్మా పెళ్లిళ్లు చేసుకోకుండా ఉద్యోగాలు చేసి ఊళ్లేలుతారేమిటి? మా అమ్మాయికి కూడా చెప్పమ్మా...

ని : చేసుకోనంటోందా ఏమిటండీ?

త : ఆఁ. తనుపట్టినకుందేటికి మూడే కాళ్లట...

ని : ఏదో మొహమాటపడి అల్లా అనివుంటుంది. అదే యిదిగా తీసుకోకండి. చేసుకోక ఏం చేస్తుంది?

గి : నిర్మలా!

త : నేనూ మొదట అల్లాగే అనుకున్నాను... అయిదారుగుర్ని తీసుకువచ్చి చూపించినా అబ్బే ఎక్కడా కొరుకుడుపడందే...ఇంక ఈ వరసనఉంటే ...మన్లోమనమాట కొని నిర్మలా...ఇంక చూచుకుందుకేనా ఎవరన్నా వస్తారటమ్మా?

గి : రాకపోతే బతుకుతాం...

ని : అక్కడికి నిజంగా చేసుకోవాలని లేనట్టు...

గి : ఏయ్ నిర్మలా!

ని : ఏమమ్మా ఏం పెళ్లిచేసుకోక ఏం చేస్తావేమిటి?

గి : ఎందుకు చేసుకోవాలి ఏమిటి?

ని : అవసరం కనుక.

గి : నీ కవసరం అయితే తక్షణం చేసుకో...

ని : నే సిద్ధమే మరి మానాన్న కట్నాలు యివ్వలేడు కనుక వచ్చిన సంబంధాలన్నీ తిరిగి పోతున్నాయి...

త : నీ కడుపు చల్లగా ఉన్నమాట అన్నావు ...మా అమ్మాయి చూడు చేసుకుందుకు సిద్ధమయిన సంబంధాలు తిప్పిపంపించింది.

గి : [యిప్పుడు కొంచెం ఉడుకుమోతుతనం] అమ్మా చాలు అయిందా ఉపన్యాసం ఇంకా ఏమన్నా ఉందా?

త : నేను ఏమ్మాట్టాడినా అల్లాగే ఉంటుంది ...అయినా ఎల్లకాలం పోషిస్తూ యిల్లా ఉట్టికట్టుకు ఊరేగుతామా అనుభవిస్తావు.

గి : ఆమాటకొస్తే ఒకళ్లు నన్ను పోషించక్కర లేదు...వెధవ పోషణకోసం ఆశించి అడ్డమయిన వాళ్లు చెప్పిందానికి నే తలవంచ నక్కరలేదు.

త : అవున్లే అన్నదానికల్లా ఊకొట్టబట్టి ఈవాల్టికి మేము అడ్డమయినవాళ్లలా కనపడుతున్నాము కదూ...

ని : ఏమమ్మా గిరిజా! పోషణకోసం ఉద్యోగం వెలిగిస్తావా? వీధిలో వెళ్తావుంటే అంతా చూస్తూ వుంటారు నిన్ను ఏదో వాళ్లకు హక్కు ఉన్నట్టు. మాష్టారమ్మరోయ్ అంటారు. క్లార్కు చేస్తావా... టైపిస్టుమీద అందరకీ హక్కే...పెళ్లిచేసుకుంటే సమాన స్థానమిచ్చే భర్త కాని...

గి : నిర్మలా హద్దులు దాటుతున్నావ్.

త : హద్దులు దాటుతున్నట్టే వుంటుంది ఉండదు మరీ...నీ బీచిలో షికార్లకి తందాన అన్న వాళ్లు నీకు స్నేహితులు; మంచి చెప్పొచ్చేసరికి హద్దులు దాటటం...హద్దులు దాటనివ్వబట్టే నువ్వు ఎడ్డెమంటే తెడ్డెమంటూ తయారయ్యావు...

ని : పిన్నిగారూ ఊరికే అంటోంది కాని నిజంగా పెళ్లి చేసుకోదనా మీ ఉద్దేశ్యం....

త : [ఉద్రేకం తగ్గింది...ఆశగా] చేసుకుంటానని నీతో అందా అమ్మా?

ని : ఆ...ముహూర్తం యీవాళా రేపా అని కాని చేసుకోకేం చేస్తుంది.

త : మరి ఎందర్ని తీసుకువచ్చినా ఒప్పుకోదు..

ని : రహస్యమంతా అందులోనే వుంది...

గి : నిర్మలా నిన్ను నోరు ముయ్యమన్నాను...

ని : అవసరం లేదు ... అవసరం ఉంటేకాని నే నేపనీ చెయ్యను...నీ కవసరమయితే నువ్వు మూసుకో...

గి : నువ్వు ముందు బైటకు పో...(ఉక్రోషం వచ్చేస్తుంది).

త: గిరిజా మర్యాద అక్కర్లే...

గి : [గంభీరంగా] అమ్మా...

త : నోర్మూయ్...

గి : [ఇంక తన్నితను సంబాళించుకోలేక లోపలికి పోతుంది.]

త: ఏమనుకోకమ్మా అల్లా అందని...

ని : అల్లా అనుకునేదాన్నయితే యిల్లా మాట్లాడతానా...

త : ఏమిటమ్మా చెప్పబోయావు...

ని : ఇటువంటివి చెప్తే మీకు కొత్తగా కనిపించినా...అవేం కొత్తా కావు, పెద్ద సాంప్రదాయానికి విరుద్ధమయినవీ కావు...కొంచెం స్వతంత్రంగా ఆలోచించడం వచ్చింతర్వాత అల్లా అభిప్రాయపడడం కూడా సహజం...

త : నువ్వనేది ఏం అర్థం కావడం లేదు...

ని : మీ అమ్మాయిపెళ్ళి మీరు 'ఊ' అన్న మరుక్షణంలో నే జరుగుతుంది.

త : 'ఊ' అనక వద్దంటున్నామా? ఎన్ని విధాల చెప్తున్నా వినట్లేదు. గంటనుంచి వాదిస్తోంది. ఎందుకు చేసుకోవాలి పెళ్ళి? అంటుంది. ఎందుకని చెప్పేది నా ముఖం...

ని : ఊరికే వాదనకోసం కాని పెళ్లి చేసుకోకుండా వుండాలని ఏ ఆడది అనుకుంటుంది. చదువుకోనివాళ్లయితే సిగ్గుపడి ఊరుకుంటారు. మీఅమ్మాయి ఏ., చదువుకుంది కనుక మిమ్మల్ని వేళాకోళం పట్టిద్దామని చూసింది.

త : అంతేనమా ..ఆడదాని చదువు అమ్మని వేళాకోళం ప ంచేందుకే పనికివస్తుందంతే...

ని : బొత్తిగా ల్లా అనకండి...మీ అమ్మాయి ఒకతన్ని ప్రేమించింది...

త : [ఉలిక్కిపడి] అదికూడానా......ఇక పూర్తయింది...

ని : అతన్ని మీరు ఒప్పుకుంటే చేసుకుంటుంది...

త : పోనీ ప్రేమిస్తే ప్రేమించింది మన కులం వాడేనా? సాంప్రదాయమున్న కుటుంబమేనా?

ని : మనవాళ్ళేట. మంచి సాంప్రదాయమేట.

త : 'ట' అంటున్నావు. నీకు తెలియదా ఏమిటి?

ని : నేనంతగా ఎరగ ననుకోండి. మంచివాడని మీ అమ్మాయే చెప్పింది. అది చెప్పేస్తానేమో అనే సిగ్గువల్ల అల్లా కోప్పడింది...

త : ఏమోనమ్మా ఈ ప్రేమవ్యవహారాలు... ఇక్కడికే పెళ్ళికి ఎవర్నీ ఒప్పుకోటల్లేదని ఊరంతా పొక్కిపోయింది. ఇంక ప్రజల మొహాలు చూల్లేక, నిలువునా చావాల్సిందే...

ని : ఇందులో ఏం మీ రనుకున్నంత చెడ్డ లేదులెండి. ఆ మాటకొస్తే అసలు చెడ్డే లేదు. ఏదో చూసి నచ్చనివాణ్ణి చేసుకోడంకంటే అల్లా ప్రేమించి చేసుకోడం చాలా మంచిది.

త : ఇది అందరికీ తెలిసిపోయిందేమమ్మా...

ని : అబ్బే ఎవరికీ తెలియదండి పిన్ని గారూ. తెలిసినా ఇదేమన్నా దొంగతనమా...

త : అందుకు కాదమ్మా...అది చేసుకుంటాను అంటే మా కభ్యంతర మేముంది. ఏ కారణంచేత నన్నా...భగవంతుడు రక్షించి ఆ పిల్లాడు ఒప్పుకోవాలే కాని...ఒప్పుకోకపోతే ఇంకా ఏమన్నా ఉందా? ఎవళ్లేన్నా ఒప్పుకుంటారా దీని చేసుకుందుకు ఈ విషయం పొక్కితే...

బ్బ అలా ఎందుకు జరుగుతుందీ, అతను ఒప్పుకునే ఉంటాడు.

త : ఏం పని చేస్తూవుంటాడో...

ని : ఏమీ చెయ్యడు. ఆటల్లో మంచి పేరున్నవాడు. వాళ్లకేం బాగా డబ్బు ఉంది. మహారాజులా కాలుమీద కాలేసుకుని కూర్చోవచ్చు. ఉద్యోగమేం ఖర్మ...

త : ఇంట్లో ఏంచేస్తోందో...ఇం దా కా కోపంలో ఏదో అన్నాను కాని ఎప్పుడూ పల్లెత్తు మాట అని ఎరగను...[బిగ్గరగా] అమ్మాయీ అమ్మాయీ.

[లోపలినుంచి గిరిజ ఆఁ అని పలుకుతుంది]

ని: గిరిజా...ఇల్లా రావూ...గుమ్మంలోకి వస్తే ఇదేనా గౌరవించటం...

గి : [గిరిజ ప్రవేశిస్తుంది. చెప్పిందేమో అని అనుమానం; కేకలు వేస్తుందని అనుమానిస్తూ వస్తుంది]...

ని : పెళ్ళికూతురుకు స్వాగతం.

గి : [ఇంతముఖం చేసుకు కూర్చుంటుంది. సిగ్గు సిగ్గుగా]

త: ఏమమ్మా ఈమాట మీ నాన్న గారితో అనకపోతే మానె నాతో చెప్పేందు కేం? [లేచివచ్చి] నీ కసలు మేం కాదంటామనే అనుమానం ఎందుకు వచ్చిందంట...మేం ఏంచేసినా నీ సుఖం కోసం కదా...ఎవరబ్బాయో ఏమిటో తబిసీలుగా చెప్పమ్మా...మీ నాన్న గారితో చెప్తాను...

ని : ఆయన కోపపడతా రేమిటండీ?

త : ఇది మరీ బాగుంది కోపం దేనికీ? ఇందులో కోపపడవలసిందేముందీ?

గి : [నిర్మలవంక ఓరగా చూస్తూ వుంటుంది]

ని : పోనీ మరొక పని చెయ్యకూడదండీ...

త : ఏమిటమ్మా...

ని : మామూలుగా వాకబువల్ల తెలిసినట్లు... ఫలానాచోట ఫలానావాళ్లె అబ్బాయి ఉన్నాట్ట వెళిరమ్మని పంపండి...మిగితా తంతు మామూలుగా జరుగుతుంది ..

త : అవును అల్లాగే చేస్తానమ్మా...

ని : పిన్ని గారూ పెళ్ళికూతు రయానని మరి యిప్పుడే గుమ్మం దిగమందా మీ అమ్మాయి...ఇంక భర్తను చూసిందంటే మెడపట్టి గెంటుతుంది...

గి : ఏయ్ నిర్మలా...

ని : ఏమమ్మా గిరిజా...

గి : నోరుమూసుకో వాక్క.—

ని : అవును మరి. రేపు ప్రొద్దుట ఓ పిల్ల తల్లివి వినకపోతే ఎల్లా?

గి : నువ్వు బొత్తిగా అల్లరి పిల్లవయిపోతున్నావు...మీ నాన్నగారితో చెప్పి తొందరగా పెళ్లి చేయించాలి.

ని : ఏదో ఆమాత్రం ఉపకారం చేసివా నీ ధర్మమా అంటూ ఓ యింటిదాన్నవుతాను. ఆమాత్రం చేసిపెట్టాలి...మరి మీ అమ్మగారితో నేను సిఫారసు చేశానా మరి నీగురించి.

గి : చేశావులే రభస...

త : నిర్మలేం చేసిందే. చేసిందంతా నువ్వు చేసి...

ని : మాశారా పిన్నిగారూ, ఎంత సులువుగా ఒకళ్లమీద పెడ్తుందోను...మా పెద్ద గడుసుదమ్మా మీ అమ్మాయి...నా కేమమ్మ నే వెళ్ళి ఆయనతో చెప్పొస్తాను- చేసుకోకండి అన్నయ్యగారూ వట్టి గడుగ్గాయిపిల్ల అని,

త : మరి చెప్పేందుకు అడ్రసు తెలుసా...

ని : ఇప్పుడు మీతో చెప్తుంది గా...

గి (సిగ్గుసిగ్గుగా ఊరుకుంటుంది)

ని : అబ్బ అయ్యో...ఇదేం సిగ్గమ్మ...ఆలు లేదు చూలు లేదు...గుమ్మందగ్గర పేరు చెప్పేందుకు పడ్డంత సిగ్గుపడుతున్నావు...

త: నేనుంటే సిగ్గ కామోసు. నే నల్లా వెడతాలే మీ స్నేహితురా ళ్ళిద్దరూ మాట్లాడుకోండమ్మా...

ని : కూర్చుందురూ ఎందుకు చెప్పదో చూస్తాను...మనకేం నష్టం—చెప్పకపోతే... పెళ్లి చేసుకునేది తనా నేనా...

త : వస్తానమ్మా...కాఫీ పెట్టాలా మరి. (వెళ్లిపోతుంది.)

ని : ఇంక సిగ్గనటన చాల్లే...మీ అమ్మగారు లోపలికి వెళ్ళారు గా...

గి : నిజంగా నీమీద నాకు చాలా కోపం వచ్చింది.

ని: అల్లాగపో...ఆ...నే నిజంగా ఈమె కాళీ అవతారం ఎత్తిందనుకున్నాను సుమా...

గి : ఎంత సులువుగా తేల్చిపడేశావు! మా వాళ్ళకు చెప్పడం ఎలాగ అని కొట్టుకు చస్తున్నాను.

ని : మరి నాకు బహుమతి ఏమిస్తావు?

గి : మీ నాన్నగారికి సిఫారసుచేసి పెళ్లి తొందరగా చేయిస్తాను.

ని : మా నాన్నగారు ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. ఊరికేవచ్చే పెళ్లికొడుకెవడూ దొరకడం లేదు. అందులోనూ మనం బి. ఏ., కనీసం బి. ఏ. వాడేనా కావాలా?...

గి : వేళాకోళంగా విసిరిన మాటకి అంత యిదౌతా వెందుకు నిర్మలా?

ని : నే నేదో బాధపడ్తున్నానని అనుకున్నందుకు చెప్పాలి. అసలు పరిస్థితి చెప్పాను. నీ రహస్యాలు నాకు చెప్పావు కనుక నీపెళ్లి దగ్గరపడేట్టు చూస్తున్నా...నువ్వు పెళ్లి చేసుకుంటున్నావంటే నాకు అసూయగావుంది గిరిజా. తోటివాళ్లంతా కాపరాలు చేస్తూంటే నాకుమాత్రం పిల్లల తల్లినయి చక్కటి పాపణ్ణి ఎత్తుకుందామని ఉండదూ...?

గి : నిర్మలా మన మనసులో ఉన్న దుఃఖాలను వెళ్లబోసుకోడంవల్ల లాభం ఏముంది చెప్పు...

ని : ఏమిటో తృప్తి అంతే.

గి : మన స్త్రీజీవితాలే అల్లా ఉన్నాయి... మనది కాని తప్పుకోసం తీక్షణమైన సంఘదృష్టిలో మాడిపోడం.

ని : [మామూలు ధోరణికి మారిపోతూ] గిరిజ.. పెళ్ళికూతురు...చాలా బాగుంటా వేమమ్మా మీ ఆయన...

గి : [నవ్వుతుంది.[

ని: నువ్వే ప్రేమించావంటే ఎల్లా ఉండాలి. కోటేరు పోసినట్టు ముక్కు...ఎగు భుజంబులవాడు.. చక్కరవింటి...

గి : చాల్లే నేర్చుకుపోయావు...

ని : లేకపోతే [అసహ్యంగా ముఖంపెట్టి] యిల్లా ఉంటావేమమ్మా మీ ఆయన...

గి : [పకపకా నవ్వుతుంది.]

ని : (నవ్వుతుంది.)

గి : } (ఇద్దరూ నవ్వుతూ వుంటారు.)
ని :

[బయటనుంచి గిరిజగారూ! గిరిజగారూ! అని కేక. నిర్మలవెళ్లి తలుపు తీస్తుంది. నవ్యాతినవ్య కాక పోయినా ఒక మాదిరిగావున్న యువతి. అందంగా వుంటుంది. ఈమె పేరు శారద. ప్రసాదంగారి భార్య.]

శా : మీ రేనా గిరిజగారంటే [ఆశ్చర్యంగా] నమస్కారం...

గి : [షాక్ తిన్నట్టయి] నమస్కారం కూర్చోండి...[లేచివెళ్లి] ఈమె నిర్మల మా క్లాస్ మేట్, బి. ఏ.

శా : నమస్కారం.

ని : [ప్రతి నమస్కారం చేసి] మీరు...

శా: గిరిజగారికి తెలుసులెండి. మా యింటికి ఒకసారి వచ్చారు నా భర్తతో.

ని: [అర్థంకాక చూస్తూ వుంటుంది]

శా: గిరిజవైపు చూసి] మీతో ప్రత్యేకంగా మాట్లాడాలి...

గి: [కంగారై ఏమీతోచక ఇటూ అటూ చూస్తూ వుంటుంది]

ని: గిరిజా మీ అమ్మగారిని పలకరించి వస్తాను. ఏం చేస్తున్నారో...ఒట్టి కాఫీ అయితే ఏం బావుంటుంది చెప్పు టిఫిన్ లేకుండా...

గి: అక్కర్లేదు నిర్మలా నువ్వు ఉండు...

ని: ఆహా యిప్పుడే వస్తా...

గి: [న్యాయస్థానంలో, బోనులో ఉన్నట్టు చూస్తుంది. దీనంగా చూస్తుంది నిర్మలకేసి. నిర్మల అర్థం చేసుకోదు. వెళ్ళిపోతుంది]

శా: మీ స్వదస్తూరితో ఉన్న ఉత్తరం చూశాను...

గి: (ధైర్యం కూడదీసుకుంటూ వుంటుంది)

శా: మీరు నిజంగా ఆయన్ను ప్రేమించారా?...

గి: ఆ ప్రేమించాను...

శా: ఆయన వివాహితులని తెలుసుకదా... నా బ్రతుకేం చేద్దామని?

గి: నేను ( ప్రేమను అంగీకరించమని అర్థించాను అంతే...

శా: ఆయనహృదయం పాషాణం. ఆయన కాళ్లావేళ్లా పడ్డాను. నా బ్రతుకేం చేస్తారని అడిగాను. ససేమిరా అన్నారు. మీరేనా ఆలోచించండి ...నా పరిస్థితి చూడండి ఈ వయసులో నా భర్త నాకు కాకుండాపోతే నా గతేమవుతుంది? నా కష్టం మీరూ ఆడవారు కనుక మీకు తెలుస్తుంది...

గి: [చలనం లేకుండా కూర్చుంటుంది]

శా: మిమ్మల్ని బ్రతిమాలుకుంటున్నాను. ఇవి చేతులు కావు కాళ్లు. నా జీవితంలో విషం కలపకండి...

గి: [ఉన్నట్టుఉండి కోపంగా లేచి] ఛా అనవసరంగా అరవకు.

శా: అనవసరమా...అరవడమా...పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణపోకట. నేను మీకేం అపకారం చేశాను. రక్షించండమ్మా...

గి: [తల్లికీ అందరకూ తెలుస్తుందనే భయం ఆమెను కఠినను చేస్తుంది] ఛ నోర్మూయ్...

శా: [జీవితం కొలిక్కి వచ్చినప్పుడు ఎంత దైన్యానికయినా దిగివస్తారు—దీనాతి దీనంగా] నా పరిస్థితుల్లో మీరు ఉన్నారనుకోండి. ఇద్దరం ఆడవాళ్ళం. ఒకర్ల కష్టాలు ఒకర్లకు తెలుస్తాయి. జాగ్రత్తగా ఆలోచించండమ్మా...ఇప్పుడు మీరు చేసే పనికి—ఫలితం అనుభవించేది నేను. ఇంక ఏం చెయ్యగలను. మిమ్మల్ని ఆయన చేసుకుంటే నుయ్యో గొయ్యో చూసుకోవాలి.

గి: తొందరగా చూసుకో నుయ్యో గొయ్యో. మా సుఖానికి అడ్డురాకు. మాది అమరప్రేమ. ప్రేమ పరిపాలనకు ఇటువంటి అడ్డంకులు వస్తూనేవుంటాయి.

శా: [ముఖంలో నిరాశ నిస్పృహ]

గి: (గర్వంగా—తనేదో గొప్పదాన్ననే అహంతో—ఈ తమ ప్రేమ వ్యవహారంతో ఏదో ఘనకార్యం సాధిస్తున్నట్టు, ఆదర్శమూర్తులయినట్టు పోజు పెట్టి) ఇటువంటివి సరకుచేయక సాగిపోవడమే దివ్యప్రేమకు ఆదర్శం. రోమియో జూలియెట్, లైలా మజ్నూలు మాకు ఆదర్శమూర్తులు. ప్రేమ పూలబాటలో ముల్లులా అడ్డురాకు.

శా: ఆకాశంలో చూస్తున్నారు బాటని. మీ పాదాలకింద నలిగిపోతున్న ఈ జీవాన్ని చూడండి. (కాళ్ళమీద పడుతుంది) ఆజన్మాంతమూ మిమ్మల్ని దైవంలా పూజించుకుంటాను. నన్ను కన్న నా తల్లి చనిపోయింది. ప్రాణంపోసే మిమ్మల్ని తల్లిగా చూసుకుంటాను. నా భర్తని నాకు దక్కించండి...

గి: [కాళ్లు వెనక్కి తీసుకుంటూ—హృదయం దిటవు చేసుకుని]. నేను ప్రేమించాను. ఈ అవకాశం చేజార్చుకుంటే నేను యావజ్జీవం పశ్చాత్తాపపడవలసి వుంటుంది. ఏం లాభం లేదు. నా సుఖంకోసం నీకు కష్టంవచ్చినా నే లెఖ్ఖ చెయ్యను.

శా: [కోపంగా జీవన్మరణసమస్యను తేల్చే క్షణమయినప్పుడు తెగింపు వస్తుంది. మూలనున్న పిల్లి ధైర్యంచేసి మీదకు దూకుతుంది] నా సుఖానికి అడ్డువచ్చే నిన్ను నేనేం చెయ్యాలి!

గి: [సమాధానం దొరకదు] ఛా! ఫో! బయటికి. నా సుఖంకోసం నా యిష్టంవచ్చినట్టు నే చేసుకుంటాను...

శా: [పేపర్ వెయిట్ విసురుతుంది. అది గోడకు తగిలి చప్పుడు అవుతుంది.]

గి: [కెవ్వుమని కేక వేస్తుంది.]

శా: [పూలతొట్టె ఎత్తి విసరబోతూ వుంటుంది ]

[నిర్మల ప్రవేశించి శారదచెయ్యి పట్టుకుంటుంది.]

[శారద విడిపించుకుని దెబ్బతిన్న పులిలా చూస్తూ...తలుపు తోసుకుని వీధిలోకి పోతుంది—

గిరిజ తల్లి పెసరట్లు తయారు చేస్తున్న ఆవిడ అల్లాగే కేకవిని అట్లకాడతో ప్రవేశిస్తుంది కంగారుగా. గిరిజ భయంతో కోపంతో వణుకుతూ ఏడుస్తుంటూ వుంటుంది.]

త : ఏమిటమ్మా అది...

ని : అబ్బే ఏమీ లేదు ఎవరో ఒక పిచ్చిది...

త : ఎల్లా వచ్చిందమ్మా...

[గిరిజ, యింకా బొంకగలిగే స్థితిలో లేదు.]

ని : ఇందాకా నే నుంటగా నే వచ్చిండి. పెద్ద మనిషిలా ప్రవేశించి నేను ఒంటరిగా మాట్లాడా లంటే కాబోలనుకుని లోపలకు వచ్చాను ..ఎవరో ఏమన్నా గుర్తుఉందా గిరిజా పోలీసుకు రిపోర్టు చేద్దాం.

గి : అమ్మా ... [అని తల్లివైపు తిరిగి వెక్కి వెక్కి ఏడుస్తూవుంటుంది తన పరిస్థితి తలుచుకుని.]

త : అబ్బే వుండు; మరీ వెర్రిపిల్ల వయిపోతూ ఉన్నావేమిటి ? [చెంగుతో కళ్ళు తుడుస్తూ] మేమంతా ఉండగా ఇల్లా ఇదవుతావా...ముఖం తుడుచుకో...[చెంగుతో తుడుస్తుంది. ముఖంనిండా తాంబూలపు, ఎరుపు అవుతుంది]

ని : గిరిజా ఛా ! అదేమిటే ఆ యేడుపు చిన్న పిల్లలా? వెళ్ళి ముఖం కడుక్కురా చెప్తాను...

[గిరిజ అవకాశం దొరికిందికదా అన్నట్టు వెంటనే వెళ్ళిపోతుంది]

త : ఏమిటమ్మా నిర్మలా యిదంతా...నా తల్లికే బాధవచ్చింది. ఆ పిచ్చిముండ ఎవతో దీనిమీదే పడాలా దాని కళ్లు...

ని : పిచ్చిదికాదు పిన్నిగారూ అమాయకపుది. అంతా విన్నాను టున వుండి. ఇంత వివేకం ఉన్న గిరిజ ఈ బొందలో ఎల్లా పడిందో అర్థం కావటల్లేదు.

త : ఏం జరిగిందమ్మా...

ని : ఏమని చెప్పను...ఆ వచ్చి నావిడ భర్తనే గిరిజ ప్రేమించింది...ఆయన ఇప్పుడు ఆమెను వదలి గిరిజను చేసుకుందుకు సిద్ధపడ్డాడు.

త : ఆఁ...

ని : ఆమె బతిమాలినా...గిరిజ కఠినంగా ఉండిపోయింది...ఆమె ప్రాణాలకు తెగించి మాటల్నుంచి చేతల్లోకి దిగింది.

త : సంప్రదాయం ఉన్న పిల్ల చెయ్యవలసిన పనేనా ఇది...రానీ చెప్తాను...వెధవ బుద్ధులూ వీన్నూను... పెళ్లిళ్లు చేసుకోమంటే చేసుకోక కాపరాలకు చిచ్చు పెట్టడమా...భయమూ భక్తీ లేక మరీ పేట్రేగిపోయింది పం ఆ పిల్ల బ్రతుకేమవుతుందీ...

ని : పిన్నిగారూ.. పాపం ఇప్పటికే గిరిజ కుమిలిపోతూ వుంటుంది...అభిమానంతో...

త : మానాభిమానాలు ఉన్నపనేనా యిది అని...

ని : గిరిజ నేమనక అంటే నన్ను చంపుకు తిన్నట్టే. నెమ్మదిగా నే చెప్పిచూస్తా... మీరేమీ అనకండి...బతిమాలుకుంటున్నాను

త : అబ్బే తగని తలతిక్క. నువ్వు నెమ్మదిగా చెప్తే వింటుందా. దాన్నేమంటాములే అది ఆడిన ఆటకల్లా తందాన అని గంగిరెద్దులా తయారుచేసిన ఆయన్ననాలి...అది వినదమ్మా వినదు...

ని: మీరల్లా అనకండి. నే విడమర్చి చెప్తాగా... మీరేమీ అనకండి.

త : ఏం లాభం లేదు...పాపం ఆ పిల్ల బ్రతుకేమయిపోతుంది...

ని : గిరిజకు అభిమానం జాస్తి. మీరేమన్నా అంటే మనకు కాకుండాపోతుంది.

త : (ఆ మాటతో కోపం దిగజారి స్వార్థం ప్రవేశించి) అఁ. ఒక్కగా ఒక్కపిల్ల, నెమ్మదిగా చెప్పి చూడమ్మా... పెద్దతనంలో ఈ కష్టాలు చూడను. నెమ్మదిగా చెప్పి చూడమ్మా...(కొంచెం పస్తాయించి...మళ్లీ స్వార్థానికి సరితూగిన మానవత్వం ప్రవేశించి) ఏమయినా పిల్లమీద పిల్ల నివ్వడం జరగదు. ఇది శిలాక్షరంలాంటిది. ఎల్లాగో ఒకలాగ మనస్సు తిప్పమ్మా... ఈ విషమసంధి నా ప్రాణానికి వచ్చింది...

[గిరిజ జ్ఞాపకం వచ్చి...అశ్లీలాన్ని శంకించి కంగారుగా] చూడమ్మా గిరిజ యింకా రాలేదు... ఏ అఘాయిత్యం చెయ్యలేదుకదా...

[నిర్మల పరుగెత్తబోతుంది. గుమ్మంలో గిరిజ ఎదురౌతుంది]

ని : [గిరిజను పట్టుకుని] రా గిరిజా రా...

[గిరిజను తీసుకువచ్చి పడకకుర్చీలో కూలవేస్తుంది. తల్లి ముఖం చూడలేకో... లేక తన సిద్ధాంతాలు నెమరువేసుకుందుకో యిందాకటివనవల తీసి ముఖానికి అడ్డు పెట్టుకుంటుంది.]

త : అట్టు మాడిపోతూవుంటుంది వస్తా. [గది విడిచి వెళ్ళిపోతుంది]

ని : గిరిజా...

గి : [పుస్తకం చాటు ఉంచుకునే] ఉఁ...

ని : ఇందాకటి ఆవిడ ఎవరు గిరిజా?

గి : [హృదయం అర్థం చేసుకునే వ్యక్తిముందు దీనావస్థలో హృదయం విప్పిచెప్పేముందు,ముందుగా వచ్చేది కన్నీరు...పుస్తకం పక్కకి పడేసి ఒక్కసారిగా సోఫాలో నిర్మల ప్రక్కనవున్న స్థానానికి వస్తుంది— నిర్మల ఒళ్లో ముఖం దాచుకుంటుంది దీనంగా వెక్కి వెక్కి ఏడుస్తూ] నిర్మలా!

ని : అంతా అర్థం అయింది గిరిజా...అబ్బే చంటిపిల్లలా అదేమిటి ..

గి : [ఇంకా ఏడుస్తూనే వుంటుంది ]

ని : అంతే నేమిటి...ఇంత చదువూ సంస్కారమూ ఏ బూడిదలో పోశావు...లే...

గి : [బలవంతాన ముఖం ఎత్తుతుంది ]

ని : ధైర్యం తెచ్చుకోవాలి...మనం నేర్చుకోవలసింది జీవితంలో కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కోడం. ఒక సమస్యని రెండు కోణాల్నించి చూసి సారాంశం తేల్చుకోవాలి...

గి : [జాలి కొల్పేట్టు చూస్తూ వుంటుంది].

ని : ఇల్లా చూడు, నువ్వు ప్రేమించడం తప్పని ఎవరూ అనరు. ప్రేమపునాదిరాయిగా సంఘం నిర్మించబడాలి. నువ్వు యిప్పుడు చేయబోయేది నిర లంగా ఆలోచించి చూడు. నువ్వు ఒక వివాహితు ప్రేమించి పెళ్లాడబోతున్నావు.

గి : మనసారా ప్రేమించాను నిర్మలా...

ని : సంఘపు కట్టుబాట్లు స్వర్గం నరకం నియమాలూ యిటువంటి బూజుపట్టినవన్నీ వదిలేసినా...

గి : అజ్ఞాతంగా శాశించే యీ సంఘం రేపు నా ప్రేమపూవు ఫలించక మోడయిపోతే నన్ను ఉద్ధరిస్తుందా? నా సుఖాన్ని లెక్కచెయ్యని యీ సంఘానికి నేనెందుకు తల వంచాలి?

ని : అదే నేనూ అంటున్నాను. నువ్వు సంఘాన్ని లెక్కచెయ్యవద్దు.

గి : నా సుఖాన్ని ప్రతిఫలంలేనిదానికోసం నేనెందుకు త్యాగం చెయ్యాలి? నా సుఖాన్ని వదులుకుని యావజ్జీవితం కలల్లో కలువరింతల్లో బ్రతుకుతూ బలయిపొమ్మని శాసించే అధికారం యీ సంఘాని కెవరు ఇచ్చారు?

ని : నిన్ను శాసించినా నువ్వు లెక్కచెయ్యనవసరంలేదు. వ్యక్తులు శుష్కసిద్ధాంతాలకోసం బలవనక్కరలేదు. కాని...మానవులమైన మనం పుట్టినందుకు మనలో మానవత్వం చావనియ్యకూడదు కదూ. నీ సుఖంకోసం నువ్వు ఆయన్ను చేపట్టితే నీలాంటి వ్యక్తే నీ పాదాల క్రింద పడి నశించిపోతుంది చూశావా?

గి : ఇప్పుడు మానవత్వం అని యిటి ఆలోచించి నా ప్రేమను నిప్పుపెట్టుకున్నాను అనుకో... నా బ్రతుకును నిప్పుపెట్టుకున్నట్టేగా...ఈ మానవత్వం ఈ త్యాగంవల్ల నాకు మిగిలేదేమిటి?...నా సుఖస్వప్నం చెదిరిపోయిన మసకదారి అంతేగా... నా హృదయం ఖదాహంతో బీటలు వారి నశించడం అంతేగా...

ని : ఆనందము సుఖము అంటే ఇవే నంటావు ...నన్ను కాదని కేసుకున్నావనే కట్టు. ఇంక నీకు సుఖమే వ్రాసిఉందని ఎందుకనుకోవాలి. ఏదో ప్రేమించా ననుకుంటున్నావు. వివాహితుణ్ణి ప్రేమించడమా.

గి : వివాహితుడయితే ప్రేమించకూడదని ఎక్కడుంది? ప్రేమను యిటువంటి భౌతికవిషయాలు కట్టివెయ్యవు...

ని : ఏవేవో ప్రేమసిద్ధాంతాలు ఆదర్శాలు ఏకరువు పెట్టకు. క్రిందికి చూడు. ఇక్కడ నడిచేందుకు ఒకదారి ఉంది. భూమి ఉంది. దాన్ని అంటిపెట్టుకు ఉండక తప్పదు. ఒకవేళ నువ్వు తాత్కాలికంగా గాలిలోకి ఎగరగలిగినా భూమికి దిగిరాక తప్పదు గిరిజా...

గి : నువ్వు వెయ్యి చెప్పు లక్ష చెప్పు నేను ఆలోచించి తేల్చుకోడం అయిపోయింది. నేను నా ప్రేమను సఫలం చేసుకుని తీరతాను.

ని : నీ చేతిలో ఒక మానసికతృప్తినిచ్చేది వుంది. అది వదలి ఎండమావికోసం పరుగెడుతున్నావు...

గి : ఎండమావా?...

ని : అంతే అవుతుంది. నీ చేతిలో ఉన్నది చూడు. ఇప్పుడు నువ్వు ఈ పెళ్ళిచేసుకోడం మానేస్తే ఒక జీవికి సుఖప్రదానం చేశానని తృప్తిగా ఉంటుంది. ఇది మానసికానందము...

గి : మానసికానందము...భ్రాంతి కానందము అంతా భాష్....

గి : భాష్ గిరిజా...చదువూ సంస్కారమూ ఏ ఏట్లో పోశావు పురుషునిలోని పశుత్వం కాళ్ళక్రింద స్త్రీజాతంతా నలిగిపోతోంది. ఆ పశుత్వానికే నువ్వు దోహదమిస్తున్నావు. నీతోటి స్త్రీ పీక నీ చేత్తో నులిమి నీ సుఖానికి ద్వారం తెరుస్తున్నావు...పురుష

జాతి జులుముకు తందాన అనే స్త్రీలు ఉండబట్టే మనం ఈస్థితిలో ఉన్నాము. ఎవరికి పెళ్ళి కాకపోతే దాని దెప్పడం మన అమ్మలక్కలు; సంఘము అంటే స్త్రీ యొక్క అవివేక రూపమయి కూర్చుంది. కట్నం — మన స్త్రీయే అంటుంది, పది వేలన్నా లేకపోతే ఎల్లాగా అని. ఛీ! నువ్వు కూడా ఆ అజ్ఞానుల్లో కలిసిపోయావు. మీ అమ్మ ఏం చదువుకుందని అంత మానవత్వం ప్రదర్శించింది. తన కంఠంలో ప్రాణం వుండగా ఈ పెళ్ళి జరగదని చెప్పి వెళ్ళింది. నీకంటే ఆ అమ్మాయి ఎక్కువనా? ఆమెలోని మానవత్వం అల్లా చెప్పించింది...

గి : [దిమ్మెరపోయి చూస్తూ ఉంటుంది]

ని : మానవత్వం వదిలి కేవలం స్వార్థంకోసం నువ్వు యిది మానవన్న మాట. స్వార్థంకోసం ఖూనీ చేసి డబ్బు అపహరించేవాడికీ నీకూ ఏమిటి తేడా? నువ్వూ హత్య చేస్తున్నావు. ఇక్కడ కాకపోయినా ఎక్కడయినా ఈ మన చేష్టల్ని చూసి నిష్పాక్షికంగా శిక్షించే న్యాయస్థానమే ఉంటే అది నిన్ను హంతకురాలిగా శిక్షిస్తుంది ..

గి : ఆఁ...

ని : [తన ధోరణిలో] ఎప్పుడో కాదులే ఈ చేతకి శిక్ష ఈ జన్మలోనే; వాడు రాక్షసుడు. నిన్న ఆమెను ప్రేమించాడు. ఈవాళ నిన్ను ప్రేమిస్తున్నాడు. రేపు యింకొకతెను. వాడి కేం బాధ...నలిగిపోయేది నువ్వేగా...

గి : [నిరాశగా] అంతేనా!...

ని : అంతకాక? నీలాటి తోటివాళ్ళని ఖూనీ చేసి వాడి రాక్షసత్వాన్ని బలపరచేవాళ్ళు...కరువయితేగా...

[గిరిజ 'నిర్మలా' అని కేక పెట్టి పడిపోతుంది) నిర్మల తెల్లబోతూ నీళ్ళకోసం కేకలు పెడుతుంది. తల్లి అట్లకాడతో ప్రవేశించి బోర్లా పడిపోతుంది కంగారులో]

[తెర]

# * గుఱ్ఱాల గోపిరెడ్డి

'రామ్‌చంద్'

ఓ గుఱ్ఱాల గోపిరెడ్డి!
దాచేపల్లికె దానమైతివా॥
శేరు శేరు ఎండి ముడుగుల్
సేతులకు పెట్టుకొని
కట్టమీదా వస్తావుంటే
కలకితేరు వనుకొంటిర కొడకా,
వయ్యారికొడక, బంగారుకొడక
దాచేపల్లికె దానమైతివా॥

*         *         *

ఆపక్క ఒక సేను
ఈపక్క ఒక సేను
నడుమలోన నాపసేను
సందున నిను నలుగురు పట్టి
నరికిరి కొడక, వయ్యారికొడక
దాచేపల్లికె దానమైతివా॥

*         *         *

ఎక్కేది ఎల్లగుఱ్ఱం
కట్టేది కాయపంచ
సుక్కవంటి నీ సక్కదనము
సూడ కన్నులు లేవుర కొడక
బంగారుకొడక, చిన్నారికొడక
దాచేపల్లికె దానమైతివా॥

*         *         *

ఆంధ్రదేశంలో, అందు ముఖ్యంగా గుంటూరు సీమలో పై పాటను దానికి మూలమైన గుఱ్ఱాల గోపిరెడ్డి పేరును విననివారు అరుదు. ఆ ప్రాంతంలోని గ్రామీణులకు ముఖ్యంగా గొడ్లకాపరులకు అతనిని గూర్చిన పాటలు బాల్యంనుండి సుపరిచితములే. పల్లెపల్లెలలో పిచ్చిగుంటలవాళ్లు అనబడే ఒకరకం బిచ్చగాళ్లు అదోకరకం కిన్నెర వాయిస్తూ రెడ్డికథను పాటలరూపంగా పాడుతుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. గోపిరెడ్డి మరణాన్ని వింటుంటే అటువంటి వీరుడికా ఇటువంటి చావు అని మన కళ్లలో నీళ్లు తిరుగుతాయి. గోపిరెడ్డిచరిత్రను వివరించే బుర్రకథలు, జానపదగేయాలు బహుళ ప్రచారంలో వున్నవి.

గోపిరెడ్డి సుమారు 65 సంవత్సరాల క్రితం వాడు. అతని జన్మస్థలం పల్నాడులోని పిడుగురాళ్లకు అయిదుమైళ్లు దూరంలోవున్న పిల్లుట్ల గ్రామం. పిల్లుట్లగ్రామంలో వేయి గడపకు పైగా వుంది. బ్రాహ్మణులున్నా రెడ్డికుటుంబాలే ఎక్కువ.

ప్రచారంలో వున్న కథ ననుసరించి, గోపిరెడ్డి మంచి పలుకుబడి కలవాడని, ధర్మాత్ముడని, వీటికి తోడు చండశాసనుడని, పిల్లుట్ల సమీపంలో వున్న మన్నెసుల్తానుపాలెం గ్రామకరణం గోపాలకృష్ణయ్యకు గోపిరెడ్డికి మధ్య పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేదని, పుల్లరి వసూళ్లసందర్భంలో వారిద్దరి మధ్య ఏర్పడిన మనస్పర్ధలు ద్వేషాలుగా మారి చివరకు రోషాలతో దొమ్మీలకు దారితీశారని, సంక్రాంతి కోడిపందాల సమయంలోనూ, వీరుల పూజ సందర్భంలోనూ ఇరువురి ముఠాలు తలపడటం రక్తప్రవాహాలవటం జరిగేవని, గోపిరెడ్డితో ముఖాముఖి పోరాడి లాభంలేదని తెలుసుకున్న గోపాలకృష్ణయ్యా రెడ్డి వెళ్లేత్రోవలో ఉచ్చులు పన్నించి, వాటిలో అతడు గుఱ్ఱంతోసహా చిక్కుకోగా ఈటెలతో పొడిచి చంపించాడని తెలుస్తున్నది. ఇటీవల గోపిరెడ్డిచరిత్రకు సంబంధించిన విషయసేకరణకై పల్నాడు వెళ్లటం సంభవించింది. ఆ సందర్భంలో గోపిరెడ్డి కాలాన్ని కళ్లారా చూచిన పూజ్యులు కొందరిని కలుసుకునే అదృష్టం కల్గింది. కాని ప్రచారంలోవున్న కథకు నిజచరిత్రకు (ఎక్కడో తప్ప) సన్నిహిత సంబంధంలేదని తెలుసుకున్నాను. నిజచరిత్ర తెలుసుకోవాలనే ఉత్సాహంతో తగినవిధంగా భోగట్టా చేశాను.

ఓం ప్రథమంగా ప్రచారంలోవున్న గోపిరెడ్డి కథ కేవలం కల్పితమని తెలిపినవారు ఇటీవల కీర్తి

శేషులైన బత్తెనపాటి వెంకటసుబ్బయ్యా పంతులు గారు. సుబ్బయ్యా పంతులుగారు 94 ఏండ్ల వృద్ధు. వ్యాపారవృత్తిస్యా అయితేనేం, బంధుత్వాలవల  పంతులుగారికి పల్నాడుతో ంబంధ ముంది. కరణం గోపాలకృష్ణయ్యగారికి ఆయనకు బంధుత్వం లేకపోయినా ఇద్దరిమధ్య ఓ విధమైన అనురాగము నేది వుండేది. కరణం గోపాలకృష్ణయ్య గోపిరెడ్డికి సమకాలికుడు కాదని, పోతే రెడ్డిగారి సోదరుడైన వీరారెడ్డికి ఆయన సమకాలికుడని వా రిద్దరిమధ్య కోర్టువ్యవహారాల రూపంలో ద్వేషాలైతే వుండేవికాని అవి దౌర్జన్యాలకు దారితీయలేదని పంతులుగారు సెలవిచ్చారు. దీన్ని గోపిరెడ్డిగారి మేనళ్ళులైన నంద్యాల గోపిరెడ్డిగారు, బత్తుల సింగరయ్యగారు తదితరులు బలపరుస్తున్నారు.

గోపిరెడ్డి చరిత్ర పరిశోధనను సత్తెనపల్లిలో ప్రారంభించాను. ఆయన సోదరుడైన వీరారెడ్డిగారి కోడలు శ్రీమతి గుర్రం కోటమ్మ వరఫ్ దమయంతీ దేవిగారి వలన కొంతిగాకపోయినా కొంత తెలుస్తుం దని ఆశించానుగాని ప్రయోజనం లేకపోయింది. అనంతరం పిడుగురాళ్ళ వెళ్ళాను. పిడుగురాళ్ళ గోపిరెడ్డి జన్మగ్రామమైన పిల్లుట్లకు అయిదుమైళ్ళ దూరంలో వుందికాని పిడుగురాళ్లలో 'గోపిరెడ్డి' పేరుగూడా తెలియనివా రున్నారని తెలుసుకొని ఎంతో ఆశ్చర్యపోయాను.

ఇకపోతే గోపిరెడ్డిగారి జన్మవృత్తాంతాన్ని గూర్చి సమగ్రంగా తెలుసుకోగల్గింది పిల్లుట్లగ్రామం లోనూ, పరిసరాల్లోవున్న కేతవరం, రుక్మిణీపురం, మన్నెసుల్తాన్‌పాలెం, దాచేపల్లి, రెంటాల, జూల పాడు, గణపారం గ్రామాల్లో.

ప్రస్తుతం పిల్లుట్ల గ్రామంలోవున్న గుర్రంవారి అనాథశరణాలయానికి చెందిన ట్రస్టీలు శ్రీయుతులు నంద్యాల గోపిరెడ్డిగారు, బత్తుల సింగరయ్యగారు, కమిటీ మెంబర్లైన మంచికంటి వెంకటసుబ్బారెడ్డిగారు (రెంటాల వాస్తవ్యులు), మన్నెం ఆదినారాయణ రెడ్డిగారు (జోలపాడు వాస్తవ్యులు) గుర్రం కోటి రెడ్డిగారు, ఎర్రెద్దు నాగిరెడ్డిగారు, ఆరె వీరారెడ్డిగారు ధర్మవరప్పాడు (గ్రామకాపరస్థులు) బూతుకూరు వెంకటసుబ్బారెడ్డిగారు (గణపవరం) రెడ్డిగారిని గురించిన విషయసేకరణలో ఎంతో తోడ్పడారు. వీరందరూ గోపిరెడ్డిగారి కుటుంబానికి బంధువులే.

గోపిరెడ్డి వంశీయులు గుర్రంవారు. (గుర్రం ఎక్కి ఎప్పుడూ తిరుగుతుండేవాడని అందువలన గుర్రాల గోపిరెడ్డి అని ప్రచారంలో కొచ్చిందన్న విషయం సత్యదూరమని దీనివలన తెలుస్తున్నది.) గుర్రంవారు పల్నాడులోని ప్రసిద్ధ కుటుం బాల్లో ఒకటి. పల్నాటి యుద్ధకాలంలో మలిదేవ నాయుని కొలువులో గుర్రంవారు ఉన్నత సైనికో ద్యోగాలు చేశారని తెలుస్తున్నది.

గోపిరెడ్డి జనకులు గుర్రం చినకృష్ణారెడ్డిగారు. ఆయనకు ఇద్దరు భార్యలు. ప్రథమభార్యా సంతానం, గోపిరెడ్డి, వీరారెడ్డి, నాగమ్మ, అంతమ్మ అనేవారు. రెండో భార్యకు కోటిరెడ్డి అనే ఒక్క కుమారుడు. గుర్రం వంశం దానధర్మాలకు పెట్టింది పేరు. వారిని అడిగి లేదనిపించుకున్నవారు లేరు. దీనికి సాక్షి నేడు పిల్లుట్లలోవున్న గుర్రంవారి అనాథ శరణాలయమే. ఈ శరణాలయానికి వారు సుమారు 600 ఎకరాలభూమిని దానంచేశారు. ఈభూము లపై వచ్చే ఆదాయంతో ఆ అనాథశరణాలయం నడుపబడుతున్నది. ఇహ గోపిరెడ్డికి గూడా ఈ దానధర్మాలు అలవడ్డాయంటే అతిశయోక్తేమీ లేదు.

గోపిరెడ్డిఆకృతి గంభీరంగానూ, ముఖం ఆకర్ష వంతంగానూ వుండేదట, చాలా అందంగా వుండేవా డట. నడుస్తుంటే 'కలకరుతీవి' ఒలికేదట. (ఆ కాలంలో తెల్లదొరలే కలక్టరుపదవులను నిర్వ హించారు). కావిపంచ కట్టుకొని, ఎల్లగుర్రం ఎక్కి వెళ్తుంటే, ఆ ఠీవి, ఆ దర్పం, ఆ హుందా, ఆ అందం...చూడటానికి రెండుకళ్లూ చాలేవికావదట.

శేరుశేరు ఎండి మురుగుల్
సేతులకు పెట్టుకొని
కట్టమీద వస్తావుంటే
కలకటేరు వనుకొంటిర కొడుకా

ఎక్కేది ఎల్లగుల్లం
కట్టేది కాయపంచ
సుక్కవంటి నీ నక్కదనము
సూడ కన్నులు లేవుర కొడక

ప్రచారంలో వున్న పై గేయం అతని ఆకృతిని వర్ణించటంలో సత్యాన్నే వెల్లడించుతున్నది.

*　　　*　　　*

బాల్యంనుండి గోపిరెడ్డి ముక్కుసూటిగా, తనకు న్యాయమని తోచిన త్రోవనవెళ్ళేవాడు. బీద సాదలంటే మక్కువ. ఎదుటివారు కష్టపడుతుంటే చూడలేకపోయేవాడు. అందుకే బీదసాదలకు అతడంటే అమిత గౌరవం. గొప్పవంశంలో పుట్టిన ఇతడు తన హోదాకు తక్కువైనవాళ్ళతో కలిసి మెలిసి తిరగటం గ్రామంలోని పెద్దవాళ్ళకు కంటకమైంది. తండ్రిగారి మరణంతో వంశపారంపర్యంగా వస్తున్న మున్సబుగిరీ అతని నెత్తినపడింది. తన గ్రామాన్నంతా అభివృద్ధిచేయాలని, గ్రామంలోని కుళ్లును కూకటి వేళ్లతో పెళ్లగించాలని ఏవేవో కలలు కనేవాడు గోపిరెడ్డి బాల్యంనుండి... చేతికి అధికారం రావటంతో అతని కలలు నిజమయ్యాయి. కాని అతన్ని చూచి ఈర్ష్యపడుతున్నవారికి అగ్నిపై ఆజ్యం పోసినట్లయింది.

ఆనాడు పల్నాడులో దొంగలబాధ ఎక్కువగా వుండేది. గ్రామంలో పెద్దలనబడే కొందరు వ్యక్తుల ఆసరాతో దొంగతనాలు జరుగుతుండేవట. గోపిరెడ్డి గ్రామాధిపత్యం వహించటంతో దొంగల ఆటలు, వారి వెనుకవున్న పెద్దల స్వార్థం కట్టుపడ్డాయి. ఈ కారణంగా ఆయా పెద్దమనుష్యులు గోపిరెడ్డిపై కత్తిగట్టారు. కాని అతన్ని చంపటానికి ఎవరు సాహసించగలరు!......గోపిరెడ్డితో కయ్యం అగ్నితో వియ్యం వంటిదని వారికి తెలుసు. అందుచేత సమయంకోసం నిరీక్షించసాగారు.

ఆనాడు ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలవారు పశువులను మేతకు పల్నాడు తోలేవారు. ఆయా గ్రామాల్లోని కొందరు వ్యక్తులు బీళ్ళను గుత్తకు తీసుకొని, పశువుల్ని మేపి పుల్లరివసూలు చేసుకొనేవారు. గోపిరెడ్డిగూడా కొన్ని బీళ్ళను గుత్తకు తీసుకొని మందలను మేపేవాడనిన్నీ, బీళ్ళను గుత్తకు తీసుకునే విషయంలో ప్రముఖులనే కొందరు వ్యక్తులు ఆయనతో పోటీపడ్డారని, పోటీ సహించలేని గోపిరెడ్డి వాళ్లతో పోట్లాట పెట్టుకొన్నాడని, ఈ పోట్లాటలే కాలక్రమేణా పరమద్వేషాలుగా మారాయని, కేతవరం, దుక్కిరాళ్ళ ప్రాంతాలకు చెందిన కొందరు పెద్దలు చెప్పారు. గోపిరెడ్డి విరోధికోటికి చెందిన ప్రముఖ వ్యక్తులు ఎవరో చెప్పటానికి వారు నిరాకరించారు గాని ఆ ప్రముఖ వ్యక్తులు పిల్లుట్ల గ్రామానికి చెందిన వారేనని రూఢిపర్చారు. ప్రచారంలోవున్న కథలో, గోపిరెడ్డికి ముప్పాళ్ళ సుల్తానుపాలెంకు చెందిన కరణం గోపాలకృష్ణయ్యకు మధ్య పుల్లరులవిషయంలో వైషమ్యాలొచ్చాయని చెప్పబడిన విషయం కేవలం సత్యదూరమని గూడా వారు ఘంటాపథంగా చెప్పారు. కాబట్టి గోపిరెడ్డి కథకు గోపాలకృష్ణయ్యకు ఏమాత్రం సంబంధం లేదని, గోపాలకృష్ణయ్యకు, గోపిరెడ్డిసోదరుడైనవీరారెడ్డికి మధ్య విద్వేషాలుండేవని, కాని అవి హత్యలకు దారితీయలేదని బుజువయింది. ఏమైతేనేం గోపిరెడ్డికివున్న ఊళ్లోనే విరోధిబృందం ఎదురైంది. వాళ్ళంతా అతనిపై కక్షతో సమయంకోసం ఎదురుచూడసాగారు. 'పిల్లికి గంట కట్టే దెవర'న్నట్లు గోపిరెడ్డిపై చేయి చేసుకునే వ్యక్తికోసం వేయికళ్ళతో గాలించసాగారు. చివరకొక వ్యక్తి తటస్థపడ్డాడు.

గోపిరెడ్డి విరోధికోటిలో బోయవాడొకడుండేవాడు. అతడు ఒకప్పుడు దొంగల ముఠానాయకుడు. రెడ్డి గ్రామాధిపత్యం వహించటంతో ఆ ముఠావాళ్లు తల ఒకదారి అవటం బోయవాడి నోటివద్ద కూడుపోవటం జరిగింది. గోపిరెడ్డిని చంపటానికి అతడే సమర్థుడని రెడ్డి విరోధులంతా అతన్ని సమీపించారు. రెడ్డిని చంపటానికి పురికొల్పారు. 'బాబోయ్, ఆ మారాజును చంపలేను. నా పాపిష్టి చేతులు ఆ పని చేయలేవు. ఇంతకూ ఆయన ఏం అపకారం చేశాడని ఈపని చేయమంటారు? మన దొంగతనాల్ని పసికట్టి అరికట్టాడనా?" అని ఆ బోయవాడు మొదట నిరాకరించాడట. కాని వారి దుర్బోధలవల్ల నైతేనేం, ఆశచూపిన ధనంవల్ల నైతేనేం, పొలంలోకుండా గుర్రంపై ఒంటిగా వెళ్తున్న రెడ్డిని చెట్టుపై ఆకులమాటున దాక్కొని తుపాకీతో కాల్చి చంపాడు. తుపాకీదెబ్బతిన్న రెడ్డి గుర్రంపైనుండి క్రింద పడిపోయ్యాడు. తుపాకీ

ప్రోగటం, గోపిరెడ్డి క్రిందపడటం పొలంలోని జీతగాళ్లకు అన్నం తీసుకొనివస్తున్న గోపిరెడ్డి పనిమనిషి చూసి వెనక్కి వెళ్ళి రెడ్డి సోదరుడైన వీరారెడ్డికి చెప్పిందట. వెంటనే వీరారెడ్డి గోపిరెడ్డి పడివున్న చోటికి వెళ్ళి సమీపంలో ఎక్కడా వైద్యశాల లేకపోవటంవలన దాచేపల్లిలోని ధర్మాసుపత్రికి తీసుకువెళ్లాడట. కాని గోపిరెడ్డి దాచేపల్లి చేరేటప్పటికే మరణించాడు.

గోపిరెడ్డి మరణాన్ని ప్రచారంలోవున్న కథ ఒకవిధంగానూ జానపదగేయం మరో విధంగానూ చిత్రించాయి. ఈ రెండిటికీ సామరస్యం ఎక్కడా కన్పించదు.

"నెమలిపురం కనుము, గుత్తికొండకనుమ, పాపాయిపాలెం కనుముల మధ్యప్రదేశంలో గోపిరెడ్డిముఠాకు, కరణం గోపాలకృష్ణయ్యముఠాకు పోరాటం జరిగిందని, గోపాలకృష్ణయ్య మందలోని కొన్ని పశువుల్ని తోలుకొని గోపిరెడ్డి బయలుదేరాడని, అతడ్ని ఎదిరించి లాభంలేదని తెలుసుకున్న గోపాలకృష్ణయ్య అనుచరులు దాచేపల్లిసమీపంలో గోపిరెడ్డి వెళ్లేత్రోవలో పంటచేలో ఉచ్చులు పన్నారని, చెవుకోసి ఒక ఆవుదూడను పొలంలోకి తోలారని, చెవుకోసిన బాధతో అరుస్తున్న ఆవుదూడ ఆర్తనాదం విని పులి ఏమైనా దూడను పట్టుకుందేమో విడిపిద్దామని రెడ్డి చేలో ప్రవేశించాడని, పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్లు అతని గుర్రం చేలో పన్నిన ఉచ్చుల్లో చిక్కుకుందని, పక్కనే కాచుకొని కూర్చున్న గోపాలకృష్ణయ్య అనుచరులు రెడ్డికి అవకాశం ఇవ్వకండా అతడ్ని గుర్రం పైనుండి క్రిందకు త్రోసి ఈటెలతో పొడిచి చంపారని" ప్రచారంలో వున్న కథ తెలియపరుస్తున్నది.

---

అనారోగ్యాన్ని కూడా లెక్కచెయ్యక, నడివేసవిలో పల్నాటిమండు టెండల్లో ఆయా గ్రామాలకు వచ్చి, విషయసేకరణకై ప్రముఖ వ్యక్తుల్ని పరిచయం చేసిన సత్తెనపల్లి వీరబ్రహ్మస్వాములవారి మఠాధిపతులైన కీ॥ శే॥ జవంగుల నారాయణదాసుగారి కుమారుడు శ్రీ వెంకటేశ్వర్లుగారికి కృతజ్ఞత.

'ఆపక్క ఒక సేను
ఈపక్క ఒక సేను
నడుమలోన నాప సేను
నందున నిను నలుగురుపట్టి
నరికిర కొడక, వయ్యారి కొడక
దాచెపల్లికె దానమైతివా॥'

అని జానపదగేయం వెల్లడిస్తున్నది. పై కథకు ఈ గేయానికి సంబంధం కన్పించకపోయినా, ఈ గేయం కొంతవరకు సత్యాన్నే నిరూపిస్తున్నది. అయితే అతన్ని చంపింది నలుగురు కాదు ఒకరే. అదీ అతన్ని కాల్చి చంపాడుగాని నరికిమాత్రం చంపలేదు. కాకపోతే న్ని చంపటానికై జరిగిన కుట్రలో నలుగురూ వున్నారని దీని అంతరార్థం ఏమో(?) "దాచేపల్లికే దానమైతివా" అనే పదం విషయంలో అటు కట్టుకథ, ఇటు జానపదగేయం, నిజచరిత్ర ఓవిధంగా ఏకీభవిస్తున్నాయి. కట్టుకథ గేయం దాచేపల్లి సమీపంలోనే రెడ్డిని చంపారని తెలుపుతున్నాయి. నిజచరిత్ర కూడా అతడ్ని దాచేపల్లి వైద్యశాలకు తీసుకొని వెళ్ళారని, అతడక్కడ మరణించాడని తెలుపుతున్నది.

* * *

గోపిరెడ్డికి సంతానం ఎవరూ లేరు. అతనితోనే అతని కుటుంబం అంతమైంది. అతని సోదరుడు వీరారెడ్డికి నలుగురు ఆడపిల్లలు, ఒక్క మొగపిల్లవాడు. మొగపిల్లవాడైన గోపాలకృష్ణారెడ్డి కందుకూరు వీరేశలింగం పంతులుగారి శిష్యుడు. అతడు వివాహమైన కొద్దికాలానికే మరణించటంతో వీరారెడ్డిగారి కుటుంబం అని చెప్పుకోతగ్గవాళ్లు ఆయన కుమార్తెలు, కుమార్తెల సంతానమున్నూ. కీ. శే. గోపాలకృష్ణారెడ్డిగారి పేరనే, వారి జనకులు ఆయన ఆదర్శాలకు అనుగుణంగా అనాథశరణాలయాన్ని స్థాపించి, ఆస్తి అంతా దానికి

గోపిరెడ్డి బ్రతికినన్నాళ్లు పౌరుషంగానూ, గొప్పగానూ బ్రతికాడు. మంచికి మంచనిపించాడు,

చెడుకు చెడు అనిపించాడు. బీదసాదలు అతనికి చేయెత్తి నమస్కరించారు. దొంగలు కలలో కూడా అతని పేరు విని అదిరిపడేవారు. శత్రువుల పక్కలో బల్లెం అతను కాని పెద్దలని చలామణి అయ్యేవారి స్వార్థానికి బలి అయ్యాడు. మానవుడు ఎంత బలవంతుడైనా స్వార్థపుసంఘంతో జరిపే పోరాటంలో 'ఏకాకి' అన్న విషయం గోపిరెడ్డిపట్ల అక్షరాలా వర్తిస్తుంది.

## : గోపిరెడ్డిగారి వంశవృక్షం :

గుర్రం చిన రెడి

ప్రథమ భార్యా సంతానం          ద్వితీయ భార్యా సంతానం

'గోపిరెడ్డి' (భార్య : మంగమ్మ)   వీరారెడ్డి (భార్య : పేరమ్మ)   నాగమ్మ   అంతమ్మ   కోటిరెడి

సుబ్బారెడ్డి

రామిరెడ్డి వరఫ్ దాచయ్య

అబ్బిరెడ్డి వరఫ్ రామిరెడి   గోపిరెడ్డి

*సుబ్బమ్మ (భర్త : మంచికంటి వెంకట సుబ్బారెడ్డి)   కోటమ్మ (భర్త : నంద్యాల అబ్బిరెడ్డి వరఫ్ రామిరెడ్డి   *రుక్మిణమ్మ   బిచ్చాలమ్మ (వివాహం కాకుండానే మరణించారు)   గోపాలకృష్ణారెడ్డి (భార్య: కోటమ్మ వరఫ్ దమయంతీదేవి)

* సుబ్బమ్మ వివాహానంతరం కొద్దికాలానికే మరణించటంచే, రుక్మిణమ్మను సుబ్బారెడ్డిగారికే యిచ్చి వివాహం చేశారు.

# * విశ్వకవి ప్రార్థన *

మూలం :
రవీంద్రనాథ్ ఠాకూర్



అనువాదం :
బి. వి. సింగరాచార్య

మానసము భయలేశమేని సోకని సీమ
మానవుడు శిరమెత్తి మసలగలిగెడు సీమ
జ్ఞాన సముపార్జనాసక్తి గలిగిన సర్వ
మానవుల కది యుచితమై లభించెడు సీమ
జగతి సంఘ స్వార్థ సంకుచిత కుడ్యాళి
విగతైక్యయై శకల వికలత గనని సీమ
ప్రతియత్న మాదర్శపథము కొన జనుసీమ
సదసద్వివేచనా స్వచ్ఛాంబు ఝరి దుష్ట
సంప్రదాయపు పేరెడారి నింకని సీమ
నిత్య విస్తృత భావనాక్రియా వీథులను
నీవ తోడై మాకు త్రోవజూపెడి సీమ

స్వాతంత్ర్య రుచిర మా
స్వర్గ సీమను స్వామి !
సంతరించుము దయను
మా
జన్మభూమి

# * మన ప్రాజెక్టులు *

### శ్రీ జి. కృష్ణ

నిర్మాణాలశాఖ [పి. డబ్ల్యు డి], సరిగా, అంటే ఆంధ్రులకు కొంత సంతృప్తికరంగా, పనిచేస్తున్నట్లుంటే ఆంధ్రరాష్ట్ర ఉద్యమం సానుకూలమయ్యేదే కాదేమో! నీటివనరులకోసం, విద్యుచ్ఛక్తికోసం, మంచినీటి సౌకర్యాలకోసం, మురుగు పారుదల ఏర్పాట్లకోసం, బాటలకోసం, సాముదాయక వాడకాలకు భవనాలకోసం, ప్రతి ప్రాంతంవారూ ప్రతి ఊరివారూ ప్రతి రాజకీయపక్షమూ ఒకరినిమించి ఒకరు మహజర్లు పెట్టటం ఆందోళనలు చేయటం బాగా చెలరేగిన కాలంలో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. మద్రాసు ప్రభుత్వం ఏవేవో చేయటంలేదనే అసంతృప్తిలో ఆంధ్రరాష్ట్రం ఉదయించింది. అంటే ఆ అసంతృప్తిని తొలగించే బాధ్యత ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వానిది అయింది.

## : రాష్ట్ర అవతరణనాటి స్థితి :

సర్ ఆర్థర్ కాటన్ 1853–70 లకు మధ్య ఆంధ్రదేశానికి చేసిపెట్టిన ధవళేశ్వరం, బెజవాడ, సుంకేసుల ఆనకట్టలు తప్ప... సలహాదార్ల ప్రభుత్వ కాలంవరకూ ఆంధ్రదేశానికి లభించిన గొప్ప నీటివనరు లేవీలేవు. ధవళేశ్వరం, బెజవాడ ఆనకట్టలు శక్తికిమించిన ఆయకట్టును భరిస్తుంటే, సుంకేసుల ఆనకట్ట మాత్రం నిర్ణీతమైన ఆయకట్టును కూడా తడపలేదు. అధికారులుగాని, రాజకీయవాదులుగాని ఈ విషయం ఎత్తేవారుకారు. సలహాదార్లు మచ్‌కుండ్, విద్యుదుత్పత్తి నిర్మాణాన్ని, తుంగభద్ర ప్రాజెక్టును ప్రారంభించారు. ఆ తర్వాతవచ్చిన కాంగ్రెసు మంత్రివర్గంలో రామపాదసాగర నిర్మాణం ప్రారంభమయినట్లే అనిపించింది. కాని నిర్మాణంకోసం చేసిన ఏర్పాట్లను తుడిచివేసిన ఆరునెలలకుగానీ, సామాన్యులెవ్వరికీ, అది ఆగిపోయిందని తెలియనేలేదు. ఇది ఇటుంచి, కొల్లేరు బెడద కృష్ణా, పశ్చిమ గోదావరి రైతులకు, వ్యవసాయవృత్తి ప్రారంభించిన నాటినుంచీ ఉంటూవచ్చింది. దీని నివారణకు వచ్చేపోయే ప్రతి సూపరింటెండింగ్ ఇంజనీరూ పథకాలు వేశారు. కొల్లేటిపేర, సామాన్యంగా ప్రతి సంవత్సరమూ చెడిపోయేపంట, ఎంత పెద్దనీటి వనరునో కట్టేనేగాని లభించని పంటకు సమం. కాని కొల్లేరు, బుడమేరు, తమ్మిలేరు, ఉప్పుటేరు వగైరా ముంపువనరులు యథాతథంగానే ఉంటూ వచ్చాయి. పశ్చిమగోదావరి జిల్లాలో మాత్రం పొలాల మురుగు పారుదలకు రూ 30 లక్షలు ఖర్చు చేశారు. ఈ ఖర్చు కొంత మేలు కల్గించింది. మిగిలిన ప్రతిజిల్లాలో ప్రతిపాత చెరువు, ప్రతిప్రవాహము... వ్యవసాయం తరఫున ఆందోళనలు సాగించటానికి బలవత్తరమైన సాకులుగా ఉపయోగించాయి. ఇవి ఇట్లాఉండగా, కలకత్తా మద్రాసు మార్గంలో కృష్ణా గోదావరి నదులపైన కాశీరామేశ్వర మార్గంలో పెన్నార్, తుంగభద్రలపైన, వంతెనలకోసంకూడా మహజర్లు ఆందోళనలు జరుగుతూ వచ్చాయి. నెల్లూరుదగ్గర పెన్నపైన వంతెన నిర్మాణం కాంగ్రెసు ప్రభుత్వహయాంలోనే సాగింది. ఉన్నట్లుండి, గోదావరికి, ఆలమూరువద్ద వంతెనకు శంకుస్థాపన చేశారు. భైరవాని తిప్ప ప్రాజెక్టుకూ అట్లాగే శంకుపును వేశారు. అంతే. వేరే పని ఏదీకాలేదు. ఆంధ్రదేశంలో 35 పురపాలక సంఘాలున్నాయి. వెయ్యికి మించిన జనాభా కల పంచాయితీలు 71 ఉన్నాయి. ఐదువందలు వెయ్యి మధ్య జనాభా కలిగిన పంచాయితీలు 322 ఉన్నాయి. ఇందులో 18 పురపాలక సంఘాలకు మాత్రం శాస్త్రీయ పద్ధతిలో నీటి సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. అయినా పౌరులకందరికీ ఉపకరించేటంతటి ఏర్పాట్లు కావు. ఇవి ఇట్లాఉంచి, గ్రామీణ నీటి సౌకర్యాలకు రెవెన్యూబోర్డువారు అప్పులిచ్చారు. ఆ అప్పులు చాలావరకూ నీట కలిశాయని ప్రతినోటా విన వచ్చింది. కొన్ని జిల్లాలలో రోడ్లు, జిల్లాబోర్డులు వేశాయిగాని, మనకు రోడ్డు సౌకర్యాలు చాలా తక్కువే. పురపాలక మందిరాలు కావాలని, ఆసుపత్రులకు భవనాలు కావాలని, విద్యాలయాలకు భవనాలు అవసరమనీ, విజ్ఞప్తులు చేయని రోజు లేదు.

సరే విద్యుచ్ఛక్తి కావాలని అడగనివారు మందుకైనా లేరు. ఇవన్నీ చేయాలంటే, ఎంత డబ్బు, ఎంత మానవశక్తి, ఎంత కృషి, కావాలో లెక్క వేసి తేల్చినవారు లేరు. ఈలోగా కృష్ణానదిపైన ఒక ప్రాజెక్టును నిర్మించాలనే సమస్య వచ్చింది. కృష్ణా జలాలను తమిళనాడు తీసుకు వెళ్లాలని, మద్రాసు ప్రభుత్వం వేసిన పథకఫలితంగా, జనించిన రాజకీయాలు, వివిధరాజకీయ పక్షాలకు ఊతనిచ్చాయి నందికొండ, సిద్ధేశ్వరం, పులిచింతల, కర్నూలు కడప కాలవ నిర్మాణాలకు అవసరమైన పరిశోధనలను మద్రాసు ప్రభుత్వం కేంద్రప్రభుత్వం పెట్టిన గడువులో, సాగించలేదు. ఇన్నింటికి తోడు కృష్ణ ఆనకట్ట దెబ్బతిన్నది. రాయలసీమలో నీటికరువు కూడాను.

ఇట్లాంటిస్థితిలో 1 అక్టోబరు 1953 న ఆంధ్ర రాష్ట్రం వచ్చింది. పరిపాలన చేయగలిగినవాడు రాక్షసుడైనా అయిఉండాలి; దేవత అయినా అయి ఉండాలి! రాజకీయపరిజ్ఞానం, రాజకీయవాదుల మనస్తత్వజ్ఞానం, క్షుణ్ణంగా తెలిసినవ్యక్తితప్ప మరెవ్వరూ మంత్రికావటానికి జంకాల్సిన స్థితి. కాని నూత్న ప్రభుత్వపుపుటకే "రాయలసీమ - కోస్తా" రాజకీయ వికారంతో జరిగింది. రాజధాని రభసతో మంత్రులకు చాలా కాలం గడిచిపోయింది.

అయితే ఈ మంత్రివర్గం కొన్ని పనులు ప్రారంభించింది. ఏదేశంలోనైనా, ఒక కొత్త మంత్రివర్గం ప్రజాసహకారాన్ని నయానో భయానో సంపాదించుకోటం జరిగిందంటే, అది ఆ మంత్రివర్గం ప్రకటించిన, చేయ ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమాలే కారణం. కార్యక్రమాన్నంతా నిర్మొహమాటంగా వెల్లడిచేయటం సత్ఫలితాన్ని తప్పక ఇస్తుంది. ఆంధ్రమంత్రివర్గం అల్లాటి సుస్పష్ట ప్రవర్తనను చూపలేదు. కేంద్రప్రభుత్వంతోనూ, ప్లానింగ్ కమిషన్‌తోనూ ఎడతెగని సంప్రదింపుల ఫలితంగా కూడా, ఆంధ్రప్రభుత్వానికి ఒక సుస్పష్టవిధాన ప్రకటన సాధ్యంగాక పోయిందనికూడా చెప్పవచ్చు.

## : శంకుస్థాపనలు :

కంట్రాక్టరును ఎన్నుకోటం తెగక, కొంత ఆలస్యమయినా, కృష్ణారోడ్డు బ్రిడ్జి రెగ్యులేటర్‌కు శంకుస్థాపన చేయటమేగాక, పని ప్రారంభించిన గౌరవం ఆంధ్రప్రభుత్వానికియ్యాలి. రాబోయే రెండుమూడు వేసవులతో నిర్మాణం పూర్తి అవుతుంది.

కాని ఇట్లాగే వేసవికాలంలో చేయాల్సిన కర్నూలు కడప కాలవ మరమ్మతుమాత్రం ఆంధ్రరాష్ట్రపు మొదటి సంవత్సరంలో కాలేదు. కరువు ప్రాంతపు నిర్మాణాలలో దీనినిచేర్చి, కేంద్రప్రభుత్వం అప్పు ఇచ్చినా, అవసరమైనపథకం తయారుచేయలేకపోయి నందువల్ల ఈకాలవ మరమ్మతు వచ్చేఏటికి తోసుకు పోయింది కరువుప్రాంతపు నీటి వనరుల నిర్మాణానికి కేంద్రప్రభుత్వం 1955-56 సంవత్సరాంతంలోగా వాడుకునేటందుకు రూ 5 కోట్లు అప్పు ఇచ్చింది. దీనికి రాష్ట్ర ప్రభుత్వం ఒకకోటిని జోడించి, ఈ నిర్మాణాలు చేయాల్సి ఉంది. ఈ అప్పుతో నిర్మించాల్సిన 17 నీటివనర్లలోనూ ఇంతవరకూ ఈ ఏకు ప్రభుత్వం 9 నిర్మాణాలకు శంకుస్థాపన మహోత్సవాలు జరిపించారు. శ్రీకాకుళం జిల్లాలో సీతానగరం, నారాయణపురం ఆనకట్టలు, నాగావళి కాలవ; విశాఖపట్నం జిల్లాలో గంభీరంగడ్డ రిజర్వాయిర్; నెల్లూరు జిల్లాలో ఉప్పుటేరు ఆనకట్ట, నక్కలగండి, పాలేరు రిజర్వాయిర్లు; చిత్తూరు జిల్లాలో కాళింగి ప్రాజెక్టు; కడపజిల్లాలో దిగువ సాగిలేరు రిజర్వాయర్ ...ఈ ఏడు పునాది రాళ్లను సంపాదించాయి. అయితే ఇందులో అన్నిటి నిర్మాణమూ ప్రారంభం కాలేదు. పునాది వేయగానే పని ప్రారంభం కాదు. ఈ పునాదిరాళ్లు కొన్నిటి పరిశోధనారంభాన్ని, కొన్నిటికి నిర్మాణారంభాన్ని సూచిస్తాయి. శ్రీకాకుళం జిల్లాలో పునాదివేసిన మూడు ప్రాజెక్టుల నిర్మాణమూ ప్రారంభమయింది. అట్లాగే నక్కలగండి కూడా ప్రారంభమయిం దనవచ్చు. దిగువ సాగిలేరు నిర్మాణారంభదశలోనే ఉన్నది. మిగిలినవి పరిశోధనల్లో ఉన్నవి. కరువుప్రాంత నిర్మాణాల్లోని మిగతా 8 కూడా త్వరలో శంకువులను సంపాదించుకుంటాయి అని ఆశించవచ్చు. అయితే చిత్తూరుజిల్లాలో స్వర్ణముఖి ప్రాజెక్టుమీద పని సాగిపోతున్నది. అనంతపురం జిల్లాలో ఎగువ పెన్నార్ ప్రాజెక్టు నిర్మాణం కూడా చాలా వేగంగానే సాగుతోంది. ఈ ప్రాజెక్టులన్నీ—అంటే రాయలసీమ [ఒక్క కర్నూలు కడప కాలవ మినహా], శ్రీకాకుళం, విశాఖపట్నం, నెల్లూరులోని కరువు ప్రాంతాలవి,...ఎక్కువ భూమికి నీటి నివ్వగలిగినవి కావు. వీటి ఆయకట్టు ఏమంత మహాపెద్దదీ కాదు. అయినా ఇవి ఈ ప్రాంతాలకు చాలా ముఖ్యమైనవి. వీటి పరిశోధనను సత్వరమే ముగించి, నిర్మాణాలు చేయటం హితకరం.

## : కృష్ణపైన ఒక ప్రాజెక్టు :

కృష్ణపైన ఒక ప్రాజెక్టును కట్టటం ప్లానింగ్ కమిషన్ సంకల్పం. అది నందికొండ అని హైద్రాబాగు ఆంధ్రప్రభుత్వాలు సూచించాయి నందికొండ పరిశోధన పూర్తి అయిందని చెప్తున్నారు. నిర్మాణ ప్రధమ దశకు రూ 50 కోట్లు అవుతుందని ఇంజనీర్లు సూచించారు సిద్ధేశ్వరం ప్రాజెక్టు మరోచోట కట్టకోమని, లేకుంటే దానివలన అలంపురం తాలూకా తాలూకాయే మునిగిపోతుందని హైదరాబాదు ప్రభుత్వం చెబుతున్నది. ముందు ముందు సిద్ధేశ్వరం నిర్మాణం జరగటానికి అనువుగానే, నందికొండ నిర్మాణయత్నం చేస్తున్నట్లు ఆంధ్రప్రభుత్వ ప్రతినిధి శాసనసభలో వెల్లడించారు. అప్పటప్పుడు సిద్ధేశ్వరానికి వేరే జాగా చూస్తున్నారనే భ్రమించాల్సి వస్తుంది. సిద్ధేశ్వరానికి నందికొండకు పోటీ లేదని ఆంధ్ర ఉపముఖ్యమంత్రి వెల్లడించేదాకా, పోటీ ఉన్నదనే నమ్మకమే వ్యాప్తిలో ఉంది. కాని, తుంగభద్ర ఎగువ కాలవ ముందా, నందికొండ ముందా అనే విషయం ప్లానింగ్ కమిషన్ తేల్చాలని ఆంధ్ర ప్రభుత్వమూ, ఆంధ్రప్రభుత్వం తేల్చాలని ప్లానింగ్ కమిషనూ పట్టుపట్టుకు కూర్చున్నట్లు ఉపముఖ్యమంత్రి ప్రకటనలవల్ల అనుకోవాల్సి వస్తోంది. వెనకే చెప్పాను, నిర్మొహమాటంగా కార్యక్రమాన్ని ప్రకటించుకునే అవసరాన్ని గూర్చి. కేంద్ర ఆర్థికమంత్రి నవంబర్‌లో తను విదేశపర్యటనను ముగించుకొని వచ్చినాక, ఈ కృష్ణాప్రాజెక్టు విషయం ఒక రూపానికి వస్తుందని ఆశించుదాం. ఈలోగా ఈ కృష్ణానది వలన కృష్ణాలోయకే గాక మరే ఇతర ప్రాంతానికైనా లాభం ఉంటుందా లేదా అనే వెతుకులాట జరుగుతూనే ఉంటుంది. ఈ తుకులాటను సాగనివ్వటం, ఆంధ్రరాష్ట్రస్థాపన వాతావరణాన్ని గ్రహించుకొని పనిచేసేవారికి, నిషిద్ధంగా తోచక తప్పదు.

## : తుంగభద్ర ఎగువ కాలవ :

తుంగభద్ర ఎగువకాలవ ప్రత్యేక ప్రాజెక్టు కాదని ఉపముఖ్యమంత్రి చెప్పనే చెప్పారు. అది తుంగభద్ర ప్రాజెక్టులో ఒక భాగం మాత్రమే. కాని దిగువ కాలవక్రింద భూమిని బాగా సాగులోకి తెచ్చే ప్రయత్నం సఫలం కాకుండగానే, ఎగువ కాలవ ఎందుకని ప్లానింగ్ కమిషన్‌వారి సందేహం. అలాటి ఎగువ కాలవముందో, నందికొండముందో తేల్చమని ఆంధ్ర ప్రభుత్వంవారు ప్లానింగ్ కమిషన్‌ను అడుగుతున్నారు. మంచిదే. ఎగువకాలవను సత్వరనిర్మాణాల్లో ర్పించాలని ఆంధ్ర ప్రభుత్వప్ర ఆశయం. అప్పటప్పుడు ఈ సంవత్సరకాలంలో దిగువకాలను బాగా వినియోగంలోకి తీసుకురావటానికి ఆంధ్ర ప్రభుత్వం ఎక్కువగా కృషి చేయాల్సింది; తగు వాతావరణాన్ని కల్పించి ఉంటే బాగుండేది. ఈ నాటికీ, దిగువ కాలవక్రింద చేయాల్సిన పనికి వేగం చిక్కలేదు.

వంశధార ప్రాజెక్టును గునుపురం దగ్గర కట్టాలని అనుకున్నారు. కాని ఆచోటు కొందరికి రుచించలేదు. ప్రస్తుతం ప్రభుత్వంవారు రూ 12 కోట్లు ఖర్చు అయ్యే ఒక ప్రాజెక్టు పథకాన్ని తయారు చేశారు అది సింగిడివద్ద ఒక రెగ్యులేటరు - గొట్టా దగ్గర ఒక రిజర్వాయర్ ఈ పథకం ప్రభుత్వ పరిశీలనలో నిలచి, ఆ తర్వాత ప్లానింగ్ కమిషన్‌కు వెళ్లాలి. ఆంధ్రప్రభుత్వం రూ 122 కోట్ల ఖర్చుతో అయ్యే నందికొండను, రూ 18 కోట్లతో అయ్యే తుంగభద్ర ఎగువకాలవను, రూ 12 కోట్లు అయ్యే వంశధారను ప్లానింగ్ కమిషన్‌కు మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చ సిఫారసు చేసింది. మొదటిప్రణాళిక మరొక సంవత్సరంతో ముగుస్తుంది.

## : విద్యుచ్ఛక్తి :

ఇక విద్యుచ్ఛక్తి — మచ్‌కుండ్ ప్రాజెక్టు రెండేళ్లలో ఫలితానికి వస్తుంది. ఈలోగా లైను వేయటం మొదలైన పనులు ఈ సంవత్సరంలో కొంత జరిగాయి. కాని ఖర్చు కార్యక్రమం అనుకున్నదాన్లో సగంమాత్రమే జరుగుతోంది. బహుశా అవసర సామగ్రిని దిగుమతి చేసుకోటంలో విదేశీ సహకారం లోపం అవటం ఒక కారణం కావచ్చు. తుంగభద్రవిద్యుచ్ఛక్తి - ఇంకా ఈనిర్మాణం సరిగా ఆరంభం కాలేదు...సరఫరాకు అవసరమైన ఏర్పాట్లుకూడా ఈ సంవత్సరంలో సాగాయి. మచ్‌కుండ్ విద్యుచ్ఛక్తి సరఫరాకు, తుంగభద్ర విద్యుచ్ఛక్తి సరఫరాకు ఏర్పడిన కేంద్రాలలో కావలసిన గృహనిర్మాణాలు కూడా ఈ ఏడు జరిగాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంతా విద్యుత్కాంతి ప్రసరణ కార్యక్రమమే అన్న ఆశను కల్పించే ఒక పథకాన్ని ప్రభుత్వంవారు ఈఏడు బహిర్గతం చేశారు. ఈలోగా రాయలసీమకు మైసూరునుంచి జోగ్ విద్యుచ్ఛక్తిని, చిత్తూరుకు మద్రాసురాష్ట్రంనుంచి విద్యుచ్ఛక్తిని కొని సప్లయి చేస్తున్నారు. మైసూరు ధరలు హెచ్చు. ఈమధ్య హెచ్చు విద్యుచ్ఛక్తిని అమ్మమని మైసూరు ప్రభుత్వాన్ని ఆంధ్రప్రభుత్వం కోరింది. ధరలు

వగైరా విషయాలపై, రెండు ప్రభుత్వాల కార్య దర్శులు ఒక ఒప్పందం చేసుకున్నారు. ఆ ఒప్పం దంలో భైరవానితిప్ప ప్రాజెక్టువల్ల మైసూరు రాష్ట్రంలో మునిగిపోయే భూమికి ఇవ్వాల్సిన పరి హారం ధరలుకూడా ఉన్నాయి. అయితే ఆ ఒప్పందం ఇంకా మైసూరు ప్రభుత్వపు ఆమోద ముద్రను సంపాదించలేదు. నందికొండ విద్యుచ్ఛక్తి కూడా వస్తే, నల్లమలకొండలలో ఉన్న కంబం మార్కా పురం తాలూకాలకు కూడా నీరు ఇవ్వవచ్చునని ఒక మతం. నెల్లూరు థర్మల్ స్టేషన్‌ను కూడా ప్రభుత్వం అభివృద్ధి చేస్తోంది. మచ్‌కుండ్, తుంగభద్ర, నంది కొండ, సీలేరు విద్యుచ్ఛక్తులు వస్తే, రాష్ట్రంలో థర్మల్ స్టేషన్లు అనవసరమవుతవి. ఒక్క నెల్లూరు స్టేషన్ నే ఉంచాలని ప్రభుత్వపు ప్రస్తుత సంకల్పం.

గౌతమిపైన ఆలమూరువద్ద, పెన్నార్ పైన చెన్నూరు దగ్గర కర్నూలు పక్కన తుంగభద్రపైన రోడ్డు బ్రిడ్జీలు కట్టడానికి తాజా అంచనాలు తయారు చేస్తున్నారు.

## : నీటి సప్లై :

మంచినీటి సప్లై ప్రణాళికలు...గుంటూరుది తప్ప...మరే పురపాలక సంఘంలోనూ, ముందుకు పోవటంలేదు. కేంద్రం రూ 60 లక్షలు అప్పు ఇస్తుం దని ఆశతో ఈ సంవత్సరం వృథాగా గడిపారు. అరవై లక్షలకోసం సంవత్సరం గడపటం ఆశ్చర్య కరమే. ఈ 60 లక్షలకోసం, ఆంధ్ర ప్రభుత్వం వారు ప్లానింగ్ కమిషన్‌కు పంపిన నివేదికలు, అంచనాలు, అసంఖ్యాకం. కాని పరిశీలన పూర్తి అయిన విజవాడ నీటిసప్లై అభివృద్ధి మురుగు పారుదల సౌకర్య నిర్మాణ కార్యక్రమం ఇంతవరకూ ప్రారంభం కాలేదు. ఇది ప్రారంభింప జేయటం పురపాలక సంఘం బాధ్యత. ఆ బాధ్యతను వారు నెరవేర్చనప్పుడు ప్రభుత్వం ఆ బాధ్యతను స్వీకరించాలి. గుంటూరుకు 1956 కల్లా బాగా నీరు సప్లై అవుతుంది. విశాఖపట్టణానికి నీటి సప్లై పథకం సరిగా రూపం దాల్చటంలేదు. సైన్యం, రైల్వే, పుర పాలక సంఘం....ముగ్గురూ కలిసి చేయాల్సిన పని ఇది. వారు కలిసి పథకాలు వేస్తున్నారేగాని, పనికి ఉపక్రమించటంలేదు. అనేక మ్యునిసిపాలిటీల నీటి సప్లై పథకాలు ఇంతవరకు ప్రభుత్వపు ఆమోదం పొందలేదు. ఈలోగా వాటి జనాభా పెరుగు తున్నది. నిర్మాణసమయానికి, ఈ పథకం సరిపోదు అని మళ్ళీ మొదటికి రావలసి వస్తుంది.

## : రాజధాని అభివృద్ధి :

కర్నూలు అభివృద్ధికి ఒక సంఘాన్ని వేశారు. ఈలోగా, ప్రభుత్వాన్ని అప్పుకోసం అర్థించమని పురపాలక సంఘాన్ని ప్రభుత్వం ఆదేశించింది. పుర పాలక సంఘం వివిధనిర్మాణాలకు గాను ప్రభు త్వాన్ని కోటి రూపాయలకు పైగా అప్పు ఇవ్వమని కోరింది. మరి ఈ అభివృద్ధి సంఘం ఏమి అభివృద్ధిని సిఫారసు చేయబోతున్నదో, అసలు ఎప్పుడు సమావేశం కాబోతున్నదో తెలయదు. కర్నూలులో నీటి సప్లై స్థితి చాలా హీనస్థితిలో ఉంది. రాజ ధాని ఏర్పడి సంవత్సరమైనా, ఇంతవరకూ పరిస్థితి మారలేదు. ఒక్క కర్నూలు నీటి సప్లై విషయంలో జరిగే ఆలస్యాలుచూస్తే, ప్రభుత్వం ఎలా నడుస్తోందో తెలుస్తుది. దస్త్రాలు కదలకపోతే, పరిపాలనలో కొత్త ఏమి కనపడుతుంది! ఈ సంవత్సరం మొత్తం మీద రాజధానిలో నీటి సప్లైని పెంచే సూత్రం ప్రభు త్వానికి తట్టలేదు; ప్రస్తుతం తక్షణాభివృద్ధికి అను కూలమైన పథకమూ లేదు. పురప్రముఖులలోకూడా, మరేచోటా ఇట్లాంటి మాంద్యం కనపడదు, ఈ విషయం ఇంతవరకూ పట్టించుకోలేదు.

ఈ పురపాలక సంఘాల నీటి సప్లై సమస్యలు తక్షణం పరిష్కరించకపోతే, చాలాఅసంతృప్తికి దారి తీస్తాయి ప్రభుత్వం, పురపాలకసంఘాల చట్టాన్ని సంస్కరించటం, ప్రజారోగ్య, ఇంజనీరింగ్ శాఖను నెలకొల్పి, సుస్పష్ట కార్యక్రమంలో పని చేయించటం ముఖ్యం. ప్రస్తుతం ప్రతి పురపాలకసంఘంలోనూ ఇంజనీరు, హెల్త్ ఆఫీసరూ, మ్యునిసిపల్ తగా దాలలోనుంచి తప్పుకోటంలోనే చాలా కాలం గడ పాల్సి వస్తోంది. పన్నులు సరిగా వసూలుచేస్తే, 10 వేల జనాభాకలిగిన ప్రతిఊరికీ నీటిసప్లై ఏర్పాటు చేయవచ్చు. కేంద్రసాయంతో పది పదిహేను ఏళ్లలో అనేక పంచాయితీలలోకూడా నీటిసప్లై ఏర్పాట్లు చేయవచ్చు. ప్రస్తుతం ఆంధ్రరాష్ట్రంలో ఒక యిమ్మిగనూరు పంచాయితీలోనే సురక్షితమైన నీటిసప్లై ఉంది. నీటిసప్లై, మురుగు పారుదల సౌక ర్యాల అభివృద్ధి విషయంలో ప్రభుత్వం, పురపాలక

సంఘాలపట్ల పంచాయితీలపట్ల, కట్టాలపేర, మిన్నకుంటటం.- -అన్యాయం.

## భవన నిర్మాణం :

ఇక భవననిర్మాణాలు అనేది నిర్మాణశాఖలో ఒక అంతశ్శాఖగా ఉన్నట్లు చెప్తున్నారు. కొన్ని ఇళ్ళ నమూనాలను తయారుచేసి, ఆ నమూనాలనే రాష్ట్రం అంతటా ఉపయోగంలో పెడుతున్నారు. భవన నిర్మాణాలకు ప్రత్యేక అధికారి "ఆర్కిటెక్ట్" లేడు. రాష్ట్రప్రభుత్వం కట్టుతున్న ఏ భవనానికీ శిల్పి అక్కర్లేదు. రాజధానిలో ఇన్ని ఇళ్లు కట్టుతున్నారు. ఎక్కడా ఒక్క మంచిశిల్పిని గౌరవించినట్లు కనపడలేదు. ఆ ఇళ్లు కట్టడంలో ప్రత్యేకతా లేదు. ఏ ప్రభుత్వ భవనం ఎక్కడ చూసినా సరే, ఆంధ్రులకు ప్రత్యేక రుచులేవీ లేవని, సౌందర్య పిపాస గాని అలంకార వాంఛ గాని లేదని ఋజువవుతుంది. నిరాడంబరత మంచిదే గాని, సౌందర్యం నిరాడంబరత్వంక్రింద రాదనుకోవాలా! విద్యుచ్ఛక్తి శాఖకోసం అక్కడక్కడా కట్టే ఇళ్లు, ప్రాజెక్టుల సిబ్బందికి కట్టే ఇళ్లు, ప్రభుత్వ కార్యాలయాల సిబ్బందికి కట్టే ఇళ్లు...అన్నీ రెండుమూడు నమూనాల్లో చెల్లు. అందమే కాకుండా, శబ్దప్రసరణకు అనుకూలమైన ఏర్పాట్లు నేటి భవనాలకు ఉండాల్సిన లక్షణాలు. అవి కనపడటంలేదు. ప్రస్తుతం ప్రభుత్వం కట్టుతున్న ఇళ్లకోసం ఇంజనీర్లు మాత్రం అనవసరం.

## : టౌన్ ప్లానింగ్ :

నిర్మాణశాఖలో ఆర్కిటెక్టు మాత్రమే గాక టౌన్ ప్లానింగ్ శాఖ కూడా ఉండటం అవసరం. ఉన్న టౌన్ ప్లానింగ్ ఉద్యోగులు పురపాలక సంఘాల తగాదాల్లో పడి సరిగా పనిచేయటం లేదు. ఏ పట్టణంలో చూసినా, గృహ నిర్మాణాలు ఒక తీరులో జరగటం లేదు. కొత్తగా కట్టుతున్న పట్టణ ప్రాంతాలు, కంట్రాక్టర్ల తెలివితేటలవల్ల కొంత బాగుంటున్నవేగాని, టౌన్ ప్లానింగ్ శాఖ పురమాయింపువల్ల మాత్రం కాదు. ఏ పట్టణమూ సరిగా అభివృద్ధి కాకపోవటం, ఇళ్లు గొగ్గిపళ్లలాగా లేవటం, ఆంధ్రులంతా ఎగిరిన విషయమే.

## ప్రభుత్వప్రతిష్ఠకు కొలబద్ద :

ఇంతకూ నిర్మాణశాఖ పూర్తిగా సంస్కరింపబడాలి. ప్రభుత్వ ప్రతిష్ఠకు ఈ శాఖ చేస్తున్న పనులే కొలబద్ద. ఆదాయానికీ ఈ శాఖ చేసే కృషియే ప్రధానమార్గం. యువకులైన ఇంజనీర్లలో ఉత్సాహం, కార్యదక్షత కల్పించే ఏర్పాట్లు చేయటం అవసరమని అనేక ఇంజనీర్ల సమావేశాల్లో తీర్మానాలు చేశారు. పైగా ఆంధ్రదేశంలో ఇంజనీరింగ్ పరిశోధన ఏర్పాట్లుకూడా లేవు. సివిల్, మెకానికల్, ఎలెక్ట్రికల్ ఇంజనీరింగుల్లో తప్ప శిక్షణ సదుపాయాలూ లేవు. ఇదిగాక ఇంజనీర్లలో సక్రమంగా ఉద్యోగాభివృద్ధి, ప్రోత్సాహమూ లేక నిరుత్సాహం అవినీతి పెంపొందే విషయం గమనార్హం. ప్రతివానికీ కీర్తికాంక్ష ఉంటుంది. బాధ్యత అంటకడ్తే, నమ్మకం ఉంచుతే, ఎంతపనైనా అవుతుంది. నిర్ణీత కార్యక్రమం జరగకుంటే చర్య తీసుకోటం సమంజసం.

అయితే డబ్బు పెద్ద సమస్య. వంతెనలపైన పన్నులు వసూలు చేయవచ్చు. ఒకటి రెండు పురపాలకసంఘాల్లో నీటిసప్లై అభివృద్ధి, మురుగు పారుదల సౌకర్యకల్పన, ఏవైనా ప్రైవేటు కంపెనీలకుఇచ్చి, కొంతకాలం వారు ప్రభుత్వపు అజమాయిషీక్రింద పన్నులు వసూలు చేసుకునే ఏర్పాటు చేయవచ్చు. పని జరగటం ముఖ్యమనుకుంటే ఏదైనా చేయవచ్చు. రాజకీయవాదులు కోరే కోర్కెలకు సమాధానం కేంద్ర ఆర్థికమంత్రి ఇచ్చారు : కోర్కెలుకోరేవారు, ఆర్థికస్తోమతునుకూడా గమనించాలని, ఆ కోర్కెను తీర్చటానికి డబ్బు ఎలా వస్తుందోకూడా తేల్చాలని వారు చెప్పారు. కాని మన మంత్రులు సుస్పష్టంగా, నిర్మొహమాటంగా ప్రభుత్వ కార్యక్రమాలను రూపొందించి, ప్రకటించి, వాటిని నెరవేర్చటానికి ఉచితమైన పద్ధతులను అవలంబించినప్పుడే, ఇతరులుకూడా బాధ్యతతో ప్రవర్తింప వీలవుతుంది.

# * బాటసారి *

'హర్షవర్ధన'

నా కొక యిల్లు లేదు, మరి నా యనువారును లేరు, నిల్వగా
లేక సదా యిటీగతి చరించుచునుందును, గమ్యమెయ్యదో
నాకె యెఱుంగరా దొకొకనా డొక త్రోవరి తోడువచ్చిన
ట్లే కనిపించి తప్పుకొను, నే నెపుడొంటరి బాటసారినే !
చూచుచునుండగానె సొగసుల్ విరజిమ్ముచు మబ్బు తున్కలు
తో్కచతనందు నంత నెటకో పనియున్నటు సాగిపోవు, లీ
లా చటులమ్ములై నిరవలంబగతిన్ పవమాన సంహతిన్
నా చలనమ్ము స్థైర్యము కనంబడు నట్టులె,గాలిపోకగా !

లోననుకొందు నెల్లక్రియలున్ మతి ఏగతి నిర్ణయించు న
ట్లే నొనరింతునంచని—సరే అటులే అనుకొంద మైన మ
న్మానస వాహిని చలనమార్గము తానె రచించునేమొ, యే
దే నొక శక్తిమున్నె వలయాకృత భూభ్రమణోపమమ్ముగా !
ఎంతగ నే స్వతంత్రతవహించి చరించెదనంచు నెంచినన్
స్వాంత మొకింత మెత్తబడి వంచిత మాటయెగాక, క్షుద్ర మ
త్యంత విలోలమీమనసు అప్పటి కేదెటు లాగునో అటే
గంతులు వేయుచుం జనును గంతలు కట్టిన వాహనమ్మనా !
త్రోవను పోవు నప్పుడెదలో ననిపించును రమ్యగేహముల్
భావుకులైన స్నేహితులు, వత్సలతామయ బంధువర్గమున్
కేవల ప్రేమపూర్ణసతి, నిర్మలభక్తియుతుల్ తనూజులున్
కావలెగాక యీ భవమునన్ మరి వేరెవి వాంఛనీయమా ?

ఐన పథిశ్రమమ్మున రవంత ఎటేనియు నిల్చినంతలో
కానబడున్ మహాభవన గహ్వరసంస్థిత కశ్మలంబు, ఈ
ర్ష్యానలతప్త మానసుల వ్యాజపు స్నేహవికారమున్, వ్యథ
ధీన కుటుంబ భార మనతిక్రమమైనిక వక్రచర్యయున్ !
నాకొక యిల్లు లేదు మరి నాయనువారును లేరు, నిల్వగా
లేక సదా యిటీగతి చరించెద నొంటరి బాటసారినె !

కథానిక

# * జాహ్నవి *

## 'శండిల'

"ఏమ్మా! జాహ్నవీ?"

"వస్తున్నా నాన్నా ఏం?"-పన్నెండేళ్ళమ్మాయి పరికిణీకుచ్చెళ్ళు చేతబట్టుకుని చెంగున నడవలోకివచ్చి ఆనందబాబువంక ప్రశ్నార్థకంగా చూసింది చిరునవ్వు మొగంతో. "ఉత్తరాలొచ్చినట్లున్నాయ్. పుచ్చుకోవమ్మా" అంటూండగానే రెండుఅంగలలో వాకిట్లోకి వెళ్ళి పోస్టుజవానిచ్చిన మూడుకవర్లూ పుచ్చుకుని వచ్చీరాని ఇంగ్లీషుతో చిరునామాలు చదవడానికి ప్రయత్నిస్తూ "నాన్నా కిశోర్ బాబు గారికి మళ్ళీ మూడుకవర్లు" అని తండ్రి చేతి కందించింది. జాలిని ప్రకటించే ముఖంతో కవర్లు తడిమి చూడున్నా బుక్ పోస్టులే అని గుర్తించి "ఆతని రచనలు, పత్రికలు తిరిగి త్రిప్పేశాయి." "ఎందుకని నాన్నా" తండ్రికళ్ళలోకి చూస్తూ అడిగింది జాహ్నవి. "ఏమీ లేదమ్మా మనింట్లోకి అద్దెకొచ్చినప్పటినుండి చూస్తున్నా. కిశోర్ బాబు రాత్రింబవళ్ళు ఏకవ్రాస్తూనే వున్నాడు. రచన లెన్నిసార్లు పంపాడో పత్రికలకు—అయితే వొక్కటీ ప్రచురింపబడ్డట్లు తోచదు." "మనం రోజూ చదివే పత్రికలకేనా? మరి వాట్లో వేసుకోరేం?"—అడుగుతున్న జాహ్నవితో "ఆయన వ్రాయడంవరకేనమ్మా అవి సంపాదకులకు నచ్చాలి. లేకపోతే ప్రచురించుకోరు." ఆనందబాబు ఇలా అంటూండగానే కాలేజీ నుండి యింటికివచ్చే కిశోర్ ఆయన చేతుల్లోని కవర్లు అందుకుని "మళ్ళీ తిరిగొచ్చాయి" అని "ఏగతి రచియించెనేని సమకాలికు లెవ్వరు మెచ్చరేగదా" అనుకుంటూ గదితాళంతీసి మేజాక్రిందున్న దేవదారు చెక్క పెట్టెలో గిరవాటేశాడు. అప్పటికే గుట్టలుగావున్న రచనలు తమతో ముగ్గురు నూతన మిత్రులు జేరారన్న సంతోషంతో సకిలించినట్లు కొద్దిపాటి సవ్వడి చేశాయి.

కాలేజీచదువుతోబాటే అంకురారోపణ జరిగింది కిశోర్ బాబు రచనావ్యవసాయానికి. నాలుగేళ్ల జీవితంలోనూ ఎన్నో కృతులు చేశాడు. కనీసం కొన్నివందలైనా పత్రికలకు పంపివుంటాడు. బహు కొద్దిమాత్రమే ప్రచురితములయ్యాయి. రచనద్వారా సమాజంలో సంస్కారం తీసుకురావాలన్న మహత్కాంక్ష వెలుగొందింది ఆతనిలో. కళారాధన క్రమేపీ అతన్ని ఇతరవిషయాలపట్ల వేవిధాల విముఖుని చేసింది. తనకు తెలీకుండగానే తోటివారిలో వొక విచిత్రవ్యక్తిగా మారిపోయాడు. విద్యార్థులూ, అధ్యాపకులూ కిశోర్ లో విచిత్రమైన ఉన్మత్తతను చూసి విస్తుపోసాగారు. తన భావాలను లోకం ఎందుకు పరిగణించదో! అనే సంఘర్షణ పొడుకొంది.

పరీక్షలైనాక ఇంటికివచ్చిన తమ్ముని చూసి అన్న రవీంద్రుడు చాలా ఆశ్చర్యం పొందాడు. అతనిలోని విపరీతపరిణామానికిగల కారణాలు గుచ్చిగుచ్చి అడిగాడు. తల్లీదండ్రీ లేని తమ కుటుంబంలో తమ్ముని భారం తనమీద తనకు తానుగా విరుచుకుపడింది. అప్పో సప్పో జేసి ఏనెల కానెల యాభైరూపాయలు పట్నం పంపుతూండేవాడు చదువుకి. క్రిందటిసారి తాను కిశోర్ ను చూడబోయినప్పుడు ఆనందబాబు తరచు ఇంటి అద్దెగూడా పుచ్చుకోకుండా తమ్ముని ఆదరించుతున్నట్లు తెలిసింది. ఇన్ని హంగు లుండీగూడా తమ్ముడు బొత్తిగా సంరక్షణ లేని కిరాయి మనిషినిగా మారిపోవడంలో గల ఆంతర్యం అన్నకు బోధపడలేదు. "అబ్బే—ఏమీ లేదు—నాకేం—నిక్షేపంగా వుంటే" అని ముక్తసరిగా సమాధానమిస్తాడు కిశోర్. పోనీ ఏ ప్రేమ జాడ్యమేనా సోకిందా అనుకుంటే అదీ వున్నట్లు తోచదు. ఆనందబాబు అనేకసార్లు తనకు లేఖలు వ్రాస్తూ తమ్ముని సౌశీల్యాన్ని వేనోళ్ళ కొనియాడాడు.

రవీంద్రుని జిజ్ఞాస అధికమైంది. రాత్రింబవళ్లు తదేకదీక్షగా పుస్తకాలు చదవడం, తీరికవున్నపుడల్లా తెగ వ్రాస్తూవుండడం—కిశోర్ చివరకు ప్రపంచాన్నే మరచిపోతున్నట్లు గుర్తించాడు. సౌభ్రాతృత్వాన్ని పురస్కరించుకుని చూచాయగా మందలించాడు. కిశోర్ పెడచెవిని బెట్టాడు. తుదకు ఆతనికి స్వగ్రామంలో వుండడం దుర్ఘటమయ్యింది.

ఒకనాడు అన్నగారితో చెప్పకుండా బిచానా సర్దుకుని పట్నం చేరుకున్నాడు. తనలో బయలుదేరిన తుపానుకు అనువైన వాతావరణంకోసం ప్రాకులాడ్డం మొదలుపెట్టాడు.

ఆనందబాబుయింటిలో తన గదిలోవున్న రచనలను మళ్ళీ తిరగేశాడు. జాగ్రత్తగా పరిశీలించి బూజూ, దుమ్మూ దులిపేశాడు. ఏదైనా ఉద్యోగం దొరికేదాకా తమతోనే వుండమనీ, జాహ్నవికి చదువు చెప్పమనీ ప్రతిమాలాడు ఆనందబాబు. ఆయనకోరికపై కొంతకాలంవరకైనా అక్కడవుండక తప్పిందిగాదు. రోజుకు వొక్కగంట మాత్రమే చదువు చెప్పేవాడు. కిశోర్‌కు వుండే తీరికగల సమయం అదొక్కటే. ఆనందదాయకమూ, ఆహ్లాదకరమూ అయినకాలం ఆ పట్నవాసజీవితంలో యేదైనావుంటే ఆక్షణమే. అమాయికతనూ, నిర్మలత్వాన్నీ విరియబోసే జాహ్నవీముఖకవళికలే అతన్ని బాహ్యప్రపంచంనుండి మళ్ళించేవి. ఆమెయెడల జాలీ, ఆప్యాయతా, వాత్సల్యమూ కిశోర్‌బాబులో సుడులు తిరిగేవి.

మిగతా వేళల్లో ఒకటే సంఘర్షణ వందలాది పత్రికాధిపతులతో వాగ్వివాదాలు. రచయితలతో చర్చలు. గ్రంథాలతో భావసంవాదాలు. ప్రకృతిని పరిశీలించడం. ఇవి లేనిసమయంలో విధివిరామం లేకుండా చేత కలం బట్టుకుని కాగితాలను పరంపరలుగా నలుపుచేయడం. ఇవే అతని దైనికచర్యలు. సమాజం వింటూందా లేదా? లోకం ఆదరించదెందుచేత? అనే శంకలులేకుండా అతని హృదయసీమలోంచి, మేధాప్రపంచంనుండి విచిత్ర మానవప్రవృత్తులు, వింతప్రకృతి, వివిధసమస్యలు,—కథలుగా, నాటికలుగా, గేయాలుగా, నవలలుగా, వర్ణచిత్రాలుగా వెలువడి శాశ్వతంగా వ్రాతప్రతులలో ఇరుక్కుపోయాయి. స్వేచ్ఛకై నిరీక్షించే జన్మఖైదీలవలె ప్రకటితం గాకుండా బంధింపబడ్డట్లు పడివున్నాయి. అయినా ఆతనిలో నిరుత్సాహం అవుపించదు. ఏండ్లు గడచినా కిశోర్‌కు నిశ్చయం చలించలేదు. తనచుట్టూ ప్రపంచం తన్ను జూచి నవ్వుతూన్నా, హేళనచేస్తూన్నా, ప్రతిఘటిస్తూన్నా ఆతడు వొక్కడుగైనా కదలడంలేదు.

కొన్నాళ్ళకు దైనందినజీవితం గడచేవిధం కష్టమైంది. విసిగి విసిగి అన్నగారు డబ్బు పంపడం మానుకున్నాడు. పట్నంలో కానీ రాబడిలేదు. కాగా కాగితాలకూ, సిరాకూ ఖర్చు తగ్గలేదు. అప్పుపెట్టి తనను కొన్నాళ్లు ఆదుకున్నాడు ఆనందబాబు. తుదకు అదిగూడా మందగించింది. పరిస్థితులొక్కసారుగా ఆలోచనల్లోనికి దింపినట్లయింది. ఏమూలచూసినా దైన్యమూ, నైరాశ్యమూ తాండవిస్తున్నాయి.

ఒకనాటి సంఘటన కిశోర్‌బాబును కలచివేసింది. రెండుగోజులుగా ఇల్లువిడిచి అప్పుడే తిరిగివచ్చాడు. ఆనందబాబు పడకగదిలో కొంత అలజడిగావుంది. ఆయన్ను ఇద్దరు వైద్యులు పరీక్షిస్తున్నారు. "మనోవ్యాధి" అన్నాడొకాయన. "హృద్రోగం" అన్నాడింకొక డాకరు. రాత్రి పదిగంటలవరకూ వేచియుండి ప్రాణంమీద ఆశలేదని పెదవులు విరచుకుని వెళ్ళిపోయారు. ఒకప్రక్క కిశోర్—మరొకవంక జీవితంలో 'ఒడుదుడుకు లెరుగని లేబ్రాయపు జాహ్నవి—ఆనంద్‌బాబును కనిపెట్టుకుని కావలి కాస్తున్నారు. బాహ్యప్రపంచమంతా కటికచీకటి కౌగిలింతలో గాఢంగా నిద్రపోతూంది. పన్నెండుగంటలకు బరువుగా నిట్టూర్చి కనులు విప్పాడు ఆనందబాబు. మంచినీటికై పెదిమలు మెదిపాడు. జాహ్నవి కంటినీరు తుడుచుకుంటూ లోనికి వెళ్లింది కిశోర్‌బాబు చేతిని బట్టుకుని ఆనందబాబు కళ్లవెంబడి నీళ్లు జలజల రాలుస్తూ చెప్పడం ప్రారంభించాడు. "కిశోర్! ఇక పరిస్థితిని గూర్చి నీకు చెప్పనక్కరలేదు. నీలో చెలరేగిన సంఘర్షణ నేను ఏనాడో గుర్తించాను. విపత్కర విషమ వాతావరణంలో నీవు ప్రయాణం చేస్తున్నావు. అంతిమవిజయం నీదే. అయితే—నా తుదికోర్కె వొక్కటుంది.. చెల్లించవూ?" అంటూంటే జాహ్నవి మంచినీటిని తెచ్చి తండ్రి కంఠం తడిపింది. కిశోర్ ధైర్యంతో గుండె చిక్కబట్టుకుని "బాబూజీ! ఎందుకు సందేహిస్తారు చెప్పండి. మీరు నాకుచేసిన మేలు వేయి జన్మాలకైనా మఱువలేను. తప్పక మీ ఆజ్ఞ శిరసావహిస్తాను." అన్నవెంటనే "నాకున్న కాంక్ష ఒక్కటే. లోకం ఏమనుకున్నా సరే—నీవేమి నిశ్చయించుకున్నా సరే—ఒక దీనురాల్ని—రెక్కలురాని పసికందును,—అనాధను నీ చేతబెట్టి వెడుతున్నా. దీన్ని పెంచి, పెద్దదాన్ని జేసి, రక్షించి, పాలించే భారం నీది. నేటినుంచీ ఈ ఇల్లు నీది. ఇదొక్కటే జాహ్నవికున్న దిక్కు—పైన నీ యిష్టం" అన్నాడు. "దానికి మీరు బెంగపెట్టుకోకండి. అవశ్యం ఈమెను రక్షించేభారం నాది. ఇదిగో వాగ్దానం. ఎంత కష్టమైనాసరే దీన్ని నిర్వహిస్తాను" అని కిశోర్ ఆనందబాబుచేతిలో తన చేతి నుంచాడు. జీవితంలో తుదిసారిగా ఆనంద బాష్పాలను గ్రుమ్మరించి దుఃఖాశ్రువులతో తనకు

విడ్కోలిచ్చే జాహ్నవిని చూస్తూ శాశ్వతంగా కన్నుమూశాడు ఆనందబాబు.

జాహ్నవిని వృద్ధికి తెచ్చే భారం కిశోర్ మీద పడింది. ఇంటిలో రెండు గదులు మినహా మిగిలిన భాగమంతా నలభై రూపాయల కద్దెకిచ్చేశారు. అదే వారికి జీవనోపాధి. నౌకరీ చేద్దామంటే స్వాభిమానం చంపుకు తింటూంది. రోజూ రెండు గంటలసేపు ఆమెకు చదువుచెప్పడం; మిగతా సమయంలో రచన, పరిశీలన, ఆలోచన—ఇవీ ఆయన నిత్యకృత్యాలు.

కాలగర్భంలో నెలలు క్రమంగా వత్సరాలుగా మళ్ళుతున్నాయి. జాహ్నవిలో నూతన వసంతంవలె నవ్యయౌవనశోభ చిగురుస్తూంది. వయసు గడచిన కొద్దీ ఆమెకు విద్యయందు వాంఛ మెండయ్యింది. రాత్రనకా పగలనకా కిశోర్ బాబును వేధించుకు తింటూంది పాఠాలు చెప్పమని. అప్పటప్పటి ఆమెను కసురుతూ చేతి వాడితనంగూడా చూపే వాడు. కాని ఆమెను తాకినపుడల్లా అతనిలో వివిధ ఆలోచనలు స్ఫురించేవి. తన కథలలో, నవలల్లో ప్రత్యక్షంగానో పరోక్షంగానో జాహ్నవి నృత్యం చేసూంది. పదహారేళ్లు దాటాయి ఆ కన్యకు. ప్రపంచాన్ని క్రమంగా దూరం చేస్తుకుంటూన్న కిశోర్ కు జాహ్నవి మాత్రం దగ్గరగా వస్తూన్నట్లు తోచింది. నిరంతరం జాగ్రదవస్థలోనే వుండడానికి ప్రయత్నించేవాడు. జాహ్నవివల్ల అతడు తలపెట్టిన సంఘర్షణ, రచనాకృషి కుంటుపడడం మొదలైంది. మానవ సహజమైన భావోద్రేకం అతన్ని మైకంలో ముంచి తేల్చేది. ఎంతో బాధపెట్టింది. తన నిశ్చయం దృఢమైంది. దానికై తానెట్టి త్యాగానికైనా సిద్ధమై వున్నాడు.

నాటిరాత్రి రెండు గంటలదాకా పట్నంలో పర్యటించి కిశోర్ బాబు బడలికతో ఇల్లు చేరుకున్నాడు. త్రిప్పటలో మునిగి భోజనమాటే మఱచిపోయాడు. ఆయాసంతో మెల్లెక్కుతున్నాడు. ఇంతరాత్రైనా లోన సద్దుమణగలేదు. జాహ్నవి కంఠం స్ఫుటంగా వినబడుతూంది. "ఈ ప్రపంచాన్ని విడిచి వెడుతూ నాన్నగారు నన్నాయనకు వప్పగించారు. నాటినుండి అయనే కంటికి రెప్పగా కాపాడుతున్నారు." "అయితే - జాహ్నవీ! నీకు పెండ్లీడు వచ్చిందిగదా—ఆయ నేఁవీ ప్రయత్నాలు చేస్తూన్నట్లు కనుపడదేఁ" ఇది ఇంటిలో అద్దెకున్న విమలాదేవిగారి కంఠం. అరుగుమీద గోడవారనే చదికిలబడి తనను యోచనావాహినిలోకి దిగలాగే ఈ సంభాషణ వింటూన్నాడు.

"ఏమో! ఆయనకు మాత్రం తెలీదూ"

"పోనీ—ఏకొాకిగదా. జాహ్నవీ. నిన్నెందుకు ఆయన వివాహం చేసుకోగూడదూ. మహా వుంటే కిశోర్ బాబుకు ముప్ఫై కంటె ఎక్కువుండవు. యువకుడులానే వుంటాడూ. ఈడు తక్కువేఁవీ వుండదు"

"అమ్మో—ఆ ప్రసక్తి తేవడానికి నాకు గుండె చాలదు. ఆయన కేమి తోస్తుందో అంతే. నేనేపాటి దాన్ని యీ విషయం బాబు ఎదుట తలపెట్టడానికి? కొంచెం కళ్లెఱ్ఱజేశారా వొళ్ళు దడదడ వణుకుతుంది నాకు."

"ప్రపంచం మిమ్మల్నుగురించి ఎంతో విడ్డూరంగా తలుస్తూంది. సహజంగూడా. యౌవ్వనంలోవున్న యువతీయువకులు ఒకేఒకచోట కొన్నియేండ్లుగా జీవించడం—కొంచెమైనా ఇతరులలో వైపరీత్యానికి తావివ్వదూ?" "కిశోర్ బాబు నాకు దైవసమానుడు. క్షమామూర్తి. దయామయుడు. ఆయన నిశ్చయాలు అచంచలాలు. ఆయన రచనలు చదువుతూంటే ప్రపంచాన్ని ఊపగల ప్రచండమారుతం ఆయనలో చెలరేగుతున్నట్లు తేటపడుతుంది" "నీమాట కడ్డొచ్చాను. అయితే ఏ పత్రికలలోనూ ప్రకటించుకోరేఁ? పోనీ పుస్తకాలుగానైనా వెలువరించరేం?"

"దానికనేక కారణాలుండొచ్చు. ఆయన సాగిస్తూన్న మానసంగ్రామమే యిది. ఇతరులకు నచ్చనంత మాత్రాన మనభావాలను చంపుకోవడం పిరికితనం. చరిత్రలో ఎన్నో ఉదాహరణలున్నాయి జీవించియుండగా యిట్టి మహాఁమేధావుల్ని సన్మానించి తరింపలేకపోయాఁవే అని సమాజాలు కుమిలికుమిలి యేడ్చినయుగాలు" "జాహ్నవీ!" బలహీనంగా పిలిచాడు. సంభాషణ స్తంభించిపోయింది. తలుపులు తెరువబడ్డాయి. కిశోర్ భారంతో గదిలోకి వెళ్ళి ప్రక్క దులుపుకుని దీపం సన్నంచేసి మేను వాలుస్తున్నాడు. "బాబూజీ! భోంచెయ్యరూ?" జాహ్నవి భుక్తిమాటను జ్ఞప్తికి తెచ్చింది. "అఖ్ఖర్లేదు. పడుకో. ఇంతసేపటిదాకా మేలుకుని వున్నావేం?" "అబ్బే! ఇప్పటిదాకా చదువుకుంటూనే వున్నాను. మధ్యాహ్నం మీరు వెళ్ళిపోయిన తర్వాత మీరు పంపిన సీరియల్ తిరిగివస్తే మీకోసం ఎదురుతెన్నులు కాసి ఏఁవీతోచక తిరిగ్గా తిరగేస్తున్నాను. పోనీ అన్నం తినకపోతే కాసిన్నిపాలూ, కోండి" అని ఆమె తనగదివైపు వెళ్ళింది.

కిశోర్ మళ్ళీ ఆలోచనలోకి దిగాడు. ఆమె ఎంతో అమాయకురాలు. తనకు తెలీకుండా వెర్రిగా ప్రేమను పెనవేసుకుంటూన్న లేదీగె. ఆమె దగ్గరగా రావడం సుతరామూ తనకు గిట్టదు. ఆనంద్ బాబుకు ఇచ్చిన వాగ్దానానికి కట్టుబడి తన వ్యక్తిత్వాన్ని అమ్మేసుకుంటున్నాడు. ఇప్పటి వాతావరణం తన ఆశయాలను తనకు తెలీకుండా చాటుచేస్తూంది. ప్రస్తుతం తాను ఆమెకు దూరంగా వుండకపోతే తన దృష్టి వాగుముఖంపట్టి జీవితంలో గెలుపును చూడలేడు.

పాలగ్లాసూ, రొట్టెలపళ్లెంతోనూ ప్రత్యక్షమైంది జాహ్నవి. మంచంపై పడుకునే రొట్టెముక్క విరుచుకుని కాగినపాలలో ముంచుకు తింటున్నాడు దీపపుకాంతిలో ఆమెముఖంవంక తేరి పారజూచాడు. నిర్మలమైన కాంతితో పున్నమినాటి నడిరేయిని ప్రశాంతంగా ప్రవహిస్తూన్న పవిత్రజాహ్నవిని గుర్తుకు తెస్తూంది.

“నాకథ ఎలావుందీ” ముడిగా ప్రశ్నించాడు. “మీకథ బాగుండకపోవడ మేమిటే? అందులో—నాకు?” చిరునవ్వుతో ఆమె సమాధాన మిచ్చింది. సరోవరంలో పండువెన్నెలలో వెలిగే కలువరేకులు కదలినట్లు మెదులుతాయి కనురెప్పలు. తాను ఓడిపోతున్నాడు ఆ కదలికకు. “ప్రపంచం నా కృషిని ప్రశంసించకపోవడం నీకు బాధగావుంది గాదూ?” “అలా గంటారేం? ఎవరికైనా బాధగా ఉంటుంది ఉత్తమకృషి నిర్లక్ష్యం చెయ్యబడ్డప్పుడు. మీకు మాత్రం విచారం కలుగదూ?” “లేదు - జాహ్నవీ లేదు. పొరబడుతున్నావు. సమాజం నన్ను సవాలు చేస్తూంది. నేను ధైర్యంతో దాన్నెదుర్కొంటున్నాను. దీనిలో ఖేదానికి తావేలేదు. ఉండకూడదు. ఎదుటినుండి వచ్చే తాకిడిని ఎదుర్కొన్న వాణ్ణే విజయలక్ష్మి వరిస్తుంది.” “ఏమిటో—మీరూ మీ ఊహాలే వేరు. మీ పరిధిలో యోచించడానికి ఏపాటిదాన్ని?” “రోజు రోజుకూ మారే ప్రపంచాన్ని చూస్తూంటే ప్రపంచంతోబాటు మారే నీకు నీలో వింతలేమీ పొడగట్టడం లేదూ?” “నా కర్థంగావడం లేదు మీ ధోరణి” అంటూ ముసిముసి నవ్వులతో జాహ్నవి తన గదిలోకి పోయింది.

ఆ మలుపులో, చిరునగవులో, వడిలో, నాటి రాత్రి ఆమె వైఖరిలోనే ఏదో ఒడుపుండి కిశోర్‌ను బలంగా బంధించి ఎక్కడికో ఈడుస్తున్నట్లు పసిగట్టాడు. ఆ క్షణంలో రెండేదారులు అతని ఎదుట అవుపిస్తున్నాయి. ఒకటి ఏకాంత జీవితం; అనవరత తీవ్రసంఘర్షణ! సంతోషంతో హాలాహలాన్ని మింగి అమృతంకొఱకు అంతిమ విజయంకోసం జీవితమంతరాన్ని ప్రపంచ సాగరంలో మథించడం—రెండవది సుఖమయమైన, ప్రశాంతమైన, సుసంఘటితమైన, భోగలాలసమైన, దీక్షారహితమైన వీడ్కోలు ఆ పోరాటానికి. “నీకే జయం అని బిడియంలేకుండా సమాజానికి సాగిలబడి తన వోటమిని న్యాయంగా స్వీకరించడం”—తలంచుకునేసరికి వొళ్లు కంపించింది జగత్తు తన్ను పరిహసిస్తూంది. కలం గడగడలాడుతూంది. మూలనున్న పెట్టెలోని అముద్రిత గ్రంథాలు—ఏళ్లుగా కుప్పలు కుప్పలై బంధింపబడ్డ ఖైదీలు స్వేచ్ఛావాయువులకొఱకు అంగలార్చుతూ తననే ఆధారంగా ఆశాజ్యోతిలా భావించుకుని యున్నట్లు కనుపించే తన కృతులు—కిశోర్ బాబు నిశ్చయించాలి ఊహాసంఘర్షణ నింక సాగనివ్వకూడదు. అటో ఇటో తేల్చెయ్యాలి.

కిటికీలోంచి బాహ్యప్రకృతి చీకటిలో జీబురుగా తొంగిచూస్తూంది. గడియారం నాలుగు కొట్టింది. గతకాలం తన మనస్సులో తికమకలతో నెమరు వేయబడుతూంది. సాహసించి లేచాడు—అటు ఆ గదివైపు చూచాడు. గంభీరంగా ఆ జవరాలు వొడలు మఱచి నిద్రపోతూంది. అరణ్యమధ్యంలో ప్రియుని నెడబాసిన దమయంతి : రాహులుడు చెంతలేని, గౌతముడు వీడిన యశోధర—లిప్తకాలంలో విరసంగా అతని భావనలో మెదిలారు. దృష్టిని ఇటు మరల్చాడు. ఆనాడే తిరిగివచ్చిన “పెద్ద కథ”—జాహ్నవిలో తనపట్ల దైవత్వాన్ని పాదుకొల్పిన రచన—లోకం నా కక్కర్లేదని పారవేసిన కృతి; సమాజం తన్ను ఎదురుదెబ్బ దీసిన సవాలు;—అతనికి తెలీకుండానే చేతులు త్వరత్వరగా పనిచేస్తున్నాయి. కాళ్ళు తడబడ్డాయి. కవర్లు, కాగితాలు, రచనలు, పుస్తకాలు—వొండొరులను కౌగిలించుకుని ఉక్కిరి బిక్కిరిగా క్రిక్కిసలాడాయి. దీపంలో చమురు తగ్గినట్లుంది. కాంతి క్రమంగా తగ్గిపోతూంది చీకటిలో కూడా. ఆ ఘడియలో నెత్తిమీద ఎత్తుకొనబడ్డ పెద్ద పెట్టెతో, పరులకు చోరుడా అని స్ఫురింపజేసే ఒక వ్యక్తి జాలిగా తనను విడువలేక వీడ్కొలిచ్చే ముగ్ధ కన్యకతో మూగపడుములా వున్న ఆనందబాబు ఇంటినుండి వలికిబడి ప్రత్యూషంలోకి జరిగిపోతూన్న చీకటిలో నెమ్మదిగా సాగిపోయాడు.

## 3

గ్రామసీమ కలకలలాడుతూంది. గోపాల్ బాబు చిన్ననాటి స్నేహితుడు కిశోర్ బాబు వచ్చిన కొలది రోజులకే ప్రారంభోత్సవం జరుపబడింది "కుబేర ప్రచురణల"కు. ఊళ్ళో వున్న గృహస్థులంతా అల్పాహార విందు ఆరగించి వెళ్లారు. రాత్రి అతిథుల్ని సాగనంపి మిత్రులిద్దరూ భావి కార్యక్రమం గూర్చి చర్చించారు. కిశోర్ బాబు ప్రతి చదువుకుంటున్నప్పటినుండి గోపాల్ బాబుకు పరిచయమే. కాలమాన పరిస్థితులనుబట్టి రచనే ప్రవృత్తి అయినది.

"కిశోర్! నీ రచనలు బాగానే వున్నాయి. కానీ ఒక పేరువడ్డ రచయితనుబట్టి పీఠిక వ్రాయించాలి. వ్రాసినవాడు వ్రాయకుండా గ్రంథానికో పెద్దని యెన్నుకోవాలి" "లేకుంటే మనం బ్రతుకలేమా? స్వతంత్రంగా మన శక్తిని మనం చాటుకోలేమా?" "అది గాదోయ్. నేటి ప్రపంచానికి కొంతైనా డాబికం చూపాలి. లేనిదే ముందు అది మనకు లొంగదు" "ఒకడిదగ్గిరికి మనం పుస్తకాన్ని దీసికెడితే మన కెన్ని పేర్లు పెడతాడూ—రచయితలంతా యాచకులవంటివాళ్ళే. "యాచకో యాచకశ్శత్రుః." "నీవు అలాగంటే లాభంలేదు." (ఈ రోజుల్లో ఎలాంటివాడైనా సరే డబ్బుకి గడ్డి తింటాడు")—కిశోర్ బాబు ఆలోచించాడు. తన కిష్టం లేకపోయినా ఈ యెత్తు మొదట్లో కొంత ఆకర్షవతంగా అవుపడింది. "అయితే — మనదగ్గర డబ్బేదీ" "ఆఁ—అలా దారిలోకి రా. నా కొక వాగ్దానం యిస్తే చాలు. నువ్వు "ఊఁ" అంటే సరి - తర్వాత పని గానిస్తా." వాగ్దానం అనేసరికి కిశోర్ బాబుకు ఆనందబాబు అంతిముఘట్టం గురుకువచ్చింది. గోపాల్ బాబు చిన్నప్పటినుండి తనతో యెరమరిక లేకుండా తిరిగినవాడే - ఎటొచ్చీ యీ నాలుగేళ్ళనుండీ తనకు కనబడలేదు. "ఊఁ" అనొచ్చు కానీ—ఇతనెలాంటి కోరిక కోరుతాడో! ఏ కోరికయితేనేం—ముందు నా సంఘర్షణలో జయించే ఆశ మెరుస్తూంది. "ఓ—అలాగే కానియ్. కాని ఒకటి జాగ్రత్తగా విను. నేను తలపెట్టిన ఉద్యమంలో కృతకృత్యుణ్ణి అయినతర్వాతనే నీమాట చెల్లిస్తా"—"సరేలే—ఇప్పుడే మునిగిపోయిందేమీ లేదు. మన పాచిక పారి సమాజం లొంగి వచ్చినపుడే నువ్వు చేయొచ్చు నే జెప్పినపని" "గోపాల్—నీ ఉద్దేశ్యం నాకు బోధపడలేదు. సమాజం అంటే అవపగుగ్గిళ్ళనుకున్నావా—లోకం మొండి, బండ, గ్రుడ్డి, మూగ, చెవుడు, పెంకి—ఇన్ని విశేషణాలు గల పదార్థం. దీనికి రూపురేఖలు, పలుకులీగులు, సకల కళలు తెచ్చిపెట్టేసరికి మనవంటివాళ్లు కనీసం కొన్ని వందలమంది యువకుల ప్రాణాలను బలి పెట్టాలి." "కళాకారుడ వనిపించుకున్నావులే"

మరునాడు ఉదయానే ప్రారంభించి ఏకాయెకీని నెలరోజులలో వొక నవల వ్రాశాడు కిశోర్. "జాహ్నవి" అని పేరుపెట్టాడు. సాక్షాత్తు తన రక్తంతో వ్రాసినంత కృషిసల్పాడు. పుస్తకం చేతబట్టుకుని ఎక్కే గుమ్మం దిగే గుమ్మంగా ఎందరో గ్రంథకర్తలను సందర్శించాడు గోపాల్. అంతక్రితమే నాలుగువేలు పెట్టికొన్న ప్రెస్ మేనేజిమెంటు కిశోర్‌కు వప్పగించాడు. చూచిన రచయితకలా కళ్ళుకుట్టింది "జాహ్నవి". తమను కాదని తమ ఆధిపత్యాన్ని కొలవన్నే రచయిత తారాపథాని కెగబ్రాకుతున్నాడు. ఈర్ష్య, సంకుచితత్వం, స్వార్థం,—వాళ్ళను గ్రుడివాళ్ళను చేశాయి. తాము సహకరించకపోయినా రచయిత నిరాటంకంగా పైకి వచ్చేస్తాడు. అయినా మానవనైజము మాన్పుకోలేరు. పెదవి విరిచారు. నిరశించారు కొందరు. విమర్శించారు. ఖండించారు. రచనంటే ఏమిటో యెఱుగని గోపాల్ బాబు బిక్కమొగంపెట్టాడు. కిశోర్‌కు మాత్రం ఏమీ దిగులుగలుగలేదు. ఎవరంగీకరించినా మానినా తానుమాత్రం దాన్ని అచ్చొత్తించి ప్రకటించడానికే నిశ్చయించుకున్నాడు. కాని గోపాల్ బాబు వొప్పుకోలేదు. తొలుదొలుత నే తనకు పెట్టుబడి పెడుతున్న మిత్రునితో ఘర్షణ పడడానికి మనస్కరించలేదు. "జాహ్నవి" తాను ఇన్నాళ్లుగా ఆదరించి, ఆలోచించి—తీర్చి దిద్దిన కళాఖండం పాతరచనల బుట్టలో కుక్కబడింది. తర్వాత చాలా గ్రంథాలువ్రాశాడు. అనేకులు పెద్దలకు చూపించాడు. మెచ్చుకున్న బహు కొద్దిమందిని వ్రేళ్ళమీద లెఖ్ఖపెట్టొచ్చు. మిగతా వేలాదిప్రబుద్ధులు పెదవి విరచారు.

రెండేళ్లుగా సాగిన ప్రచురణలు మళ్లుమొగం పట్టాయి. తొలుత గోచరించిన ఆశారేఖ దూరమౌతున్నట్లు తోచింది కిశోర్‌కు. ఈ అనుభవం మాత్రం అతనిలో ఆత్మవిశ్వాసాన్ని సడలించలేదు; కాగా బలపరచింది. ఈ మధ్యను వొక్కసారీ జాహ్నవి జాడ తెలీలేదు. ఆమె అసలు వుందా? వుంటే అంతటి మేలు చేశిన తనను, ఆమెయొక్క ఏకైక ఆశాకిరణాన్ని మరచిపోతుందా! ఏం—ఎందుకు మరువగూడదు? స్వార్థంతో తాను తన ఆశయంకొఱకు ఆమెను వంచించినపుడు యింకొ

తన్ను ఏ మొగం పెట్టుకుని జ్ఞాపకముంచుకోవాలని కోరుతున్నాడు? ఆమె భోగట్టాతీయాలని నిశ్చయించుకున్నాడు.

పట్నంలో అడుగు పెడుతూ ఎదురైన ప్రతిస్త్రీ ముఖాన్నీ మౌనంగా కళ్లతో ప్రశ్నిస్తున్నాడు జాహ్నవిజాడ చెప్పమని. మార్కెటు వీధిగుండా ఆనందబాబు యిల్లువుండే పేటకు బయలుదేరాడు. దారిలో ఒక దృశ్యం అతన్ని చకితపరచింది. బజారులో ఒకచోట పాతసామానులు విక్రయించేదుకాణం జాహ్నవిచే నిర్వహింపబడుతూంది. దూరాన్నుంచి చూస్తూ నిర్ఘాంతపోయాడు కిశోర్. పాతసీసాలూ, సైకిలుచక్రాలూ, ఇనుపమరలు, వాడి పారేసిన చిన్నచిన్న స్పేరుపార్టులు, వొకమూల — మఱొక వంక యుద్ధంనుంచి తిరిగివచ్చి ఇళ్లకుపోయే సైనికులమ్మివేసిన కోట్లూ, పాత రగ్గులూ, టోపీలూ, బూట్లూ — ఇంకొకప్రక్క పత్రికలకట్టలు, పాత పుస్తకాలు అనేక భావాలలోవి పదహారేళ్ల యువకుని చేత సర్దబడుతున్నాయి. అదిగో—ఆమెయే జాహ్నవి. కొంచెం పొడుగెదిగింది. బొద్దుగా వుంది. అవే కళ్లు. ఆనాళ్ల రాత్రి ఆశాకాంతులతో మెఱసిన నయనాలు. త్రుటిలో పుస్తకాలవద్దకు వెళ్లాడు. వంగి షేక్స్పియర్ నాటకంతీసి "దీనివెల?" ముడిగా అడిగాడు. గొంతు పసికట్టడానికి వెదుకుతున్న కళ్లు యెత్తబడ్డాయి. "బాబూజీ - కిశోర్ బాబూ!" మఱి మాట్లాడలేక పోయింది. క్షణంలో ఆమె వదనంలో అబలత్వం వెనుకై గంభీరత ఆవరించింది.

"దయచేయండి కిశోర్ బాబూ — మీరు వెలిగించిన ఆశాజ్యోతి ఆరకుండా మీకై నిరీక్షిస్తూ వెలుగుతూంది. జీవితాన్నే చమురుగా దహించుకుంటూ" అని కుర్చీ చూపి "బాజీ—తర్వాత సద్దుదువుగాని వెంటనేవెళ్లి రెండుకప్పులతో టీన్నీ, బిస్కట్లూ తీసుకురా" అంది తమవైపు వెర్రిగాచూచే కుర్రవానితో. త్రుటిలో వాడు ప్రక్కకు వెళ్లాడు. "దారి తప్పారా బాబూజీ! మీరు కథలో గానిలేరుగదా? లేక ఆ ఉద్యమం చాలించి హాయిగా బ్రతుకుతున్నారా? ఇన్నాళ్లకైనా తాము పెంచి పోషించిన లతను చూడ కోరిక జనింపజేసిన భగవంతునికి ధన్యవాదాలు". కిశోర్ ఇంతవరకు మెదల్పలేకపోయాడు పెదవుల్ని. మౌనంగా తెగ పరిశీలిస్తున్నాడు పరిసరాల్ని. "బాబో! దయయుంచి పరిశీలన తగ్గించండి కొంత. కొంపదిపి దీన్నిగూడా ఏకథలోనైనా ఇరికించేరా—ఇంక నాకు నిలుచోవడానికి తావుండదు" పరిహాసించింది. ఆమె నవ్వు అతన్ని మాట్లాడించింది. ఇలాగున్నావేం జాహ్నవీ? ఈషాపు నీదేః ఎన్నాళ్లనుంచి నడుపుతున్నావూ?" "బాగాలేదూ ఈవ్యాపారం? మీస్తు నాతో వుండనీయలేకపోయింది నాస్థితి. తర్వాత చదువు మానేశాను. మాఁవయ్యొచ్చి ఏడాదిపాటు ఇంట్లోవుండి ఈ వృత్తిలో ప్రవేశ పెట్టాడు. విధి ఇలాగుండడంగూడా సహించలేకపోయింది. ఆయనకూడా క్రొమచహాముగా పరిణమించాడు. నా వాతావరణం ఆయనకుకూడా స్వస్తి పలికింది. ఏదో అలాగాలాగు లేని ధైర్యం తెచ్చుకుని జీవితం వెళ్లబుచ్చుతున్నా. మీరింకా అలానే వున్నారా?" విచిత్రమైన వింతప్రశ్న ఆమెనుండి వెలువడింది.

"ఓ—అలానే వున్నా. ఇంకా రాళ్ళు విసురుతూనే వున్నాను. ఆశాజ్యోతి ఆరలేదు. అంతిమ విజయంకోసం అఱ్ఱులుచాస్తూ ఆకాశంలోకి యెగ బ్రాకుతూంది." ఇంతలో టీ తెచ్చాడు బాజీ. "వీడి మేలు వెయ్యి జన్మాలకైనా మఱువలేను. కంటికి రెప్పలాగున కాపాడుతాడు. పేరుకు నాదిగాని ఈ షాపులో పనంతా వీడిదే". అంది జాహ్నవి. కిశోర్ బాబు సంగతంతా విన్నది "మీ రెక్కడున్నాసరే మీ విజయాన్ని కాంక్షించే జీవి ఒకటున్నదని మఱువకండి. మీరు జయిస్తారు. అదృష్టముంటే ఈ కన్నులతో ఈ జీవితంలో చూచే భాగ్యం నాకు కలగకపోదు. ఏనాటికైనా సమాజం మీకు కైమోడ్పు చేసి తీరుతుంది. ఇదిమాత్రం తథ్యం" అని ముగించింది జాహ్నవి. ఆమెను చూచేవరకూ ఏమేమో అనుకున్న కిశోర్‌కు ఇంక మాట్లాడ్డాని కేఁవీ కనుపడలేదు లేచి శలవు తీసుకోబోతున్నాడు. "లోకంలో అంతా వొక్క తీరుగానే వుండరు. మోసగాళ్ళుంటారు జాగ్రత్త. ఎటువంటి వేళనైనాసరే మీరిక్కడకు యథేచ్ఛగా రావచ్చు. ఏమీ సంకోచించకండి. విజయోత్సాహంలో మునిగి ఈ దీనురాల్ని గనుక మఱచేరా—నాకిక దిక్కుండదు" ఆఖరిసారిగా ఆమె పలుకులు జాలిగా అతని చెవులలో గ్రుచ్చుకున్నాయి.

గిరుక్కున మళ్ళిన కిశోర్ బాబుకు వొకసారి తన గదిని చూచిరావాలనిపించింది. తిన్నగా ఆనందబాబు యింటికి వెళ్లాడు. రెండేళ్లక్రితం ఎలాగుందో ఇప్పుడూ అలాగు నేవుంది. తనను పరిహసిస్తున్నట్లు తన గదితాళం వూగిసలాడింది. విమాలాదేవీ వాళ్లే ఇప్పుడూ అద్దెకున్నారు. తననుచూసి విస్తుపోతున్న ఆ గృహిణిని తలెత్తి పరికించాడు. ఆమెలోనూ ఏమీ మార్పులేదే. చూడగా తానే మారిపోయినట్టు

తోచింది. "బాబూజీ—రండి. కూర్చోండి. క్రొత్త వారికివలె అలా నిర్ఘాంతపోతారేం?" అంది విమలాదేవి. కుర్చీలో కూర్చున్నాడు. జాహ్నవిని గూర్చి ఆమె వ్యాపారాన్ని గురించీ అడగాలనిపించింది. ఆమెయే తనకు జాలిగొలిపేటట్లు చెప్ప నారంభించింది.

"నాయనా! ఏ నేరమూ లేనిదే తమ రలా అంతర్థానమైనాక ఆపిల్ల ఎన్ని ఇక్కట్లు పడిందో దేవుని కెరుక" అంటూండే ఆమెను ఆపి ప్రశ్నించాడు. "ఈపిల్ల నీ వృత్తిలోని కెవరు దింపారండీ?" "అదే చెబుతున్నా. కొన్నాళ్లు మీకోసం దుఃఖించి స్వగ్రామాని కంటూ వెళ్లింది నెలనాళ్లకు వీళ్ళ మేనమామట. ఒకాయన్ని దీసుకొచ్చింది. మూడు నెల్లదాకా మేపింది. ఆయనే తర్జనభర్జన చేసి తనకు కొద్దిపాటి సొమ్ము అప్పుజేసి చిన్న దుకాణం పెట్టించాడు. ఆరునెలలదాకా అలా నేవుంది కాని క్రమేపీ లాభం మొదలెట్టింది. బాజీ—అనే కుర్రాణ్ణి కుదుర్చుకున్నారు. వాడే ఈ చుట్టుపట్ల పదిమైళ్ళదాకా వున్న పల్లెటూళ్ళ కెళ్ళి పాతసామానులు, ఖాళీ సీసాలూ, చిత్తుకాగితాలూ చౌకగా కొంటూ వుంటాడు అలాంటి విశ్వాసపాత్రుడగు పనివాణ్ణి ఎక్కడా చూడం. వాడు నౌకరీలోకి వచ్చింతర్వాత జాహ్నవికి కొంచెం ఊపిరాడుతూంది. స్వయానా తమ్మునికంటె మిన్నగా చూసుకుంటూంది వాణ్ణి."

అలాగకూడా ఆమె బ్రతకడం విధికి బరువైంది. రోజూ తనూ మామా తగవులాడుకునేవారు. ఆయనకు జాహ్నవి నిన్ను నిత్యమూ పూజిస్తూంటుందని ఎలాగో తెలిసింది. ఆమె మిమ్మ్ని ప్రేమించడం ఆయనకు గిట్టలేదు. చాలాసార్లు మందలించాడు. కాని ఆమె మిమ్మ్ని దైవంగా పరిగణించడం మానలేదు. చివరకొకనాడు తేల్చాడు. జాహ్నవిని తననే వివాహం చేసుకోమని. రెండో

అయినా తన కేమీ వయసు ముదరలేదనీ, తన ఆ నిపాస్తుల్ని ఆమెకే చెందజేస్తాననీ ఆమెను వేధించేవాడు. క్రమక్రమంగా బలవంతంలోకి దిగింది వ్యవహారం. ఒకనాడు జాహ్నవిపై చెయిచేసుకున్నాడు. ఇరువురకు పెనుగులాట ప్రారంభమైంది. నేనెంత బ్రతిమాలినా ఆయన వినలేదు. చివరకు భగవంతుడు పంపాడా అన్నట్లు ఖాళీసీసాల కావిడితో బాజీ ప్రత్యక్షమయ్యాడు. వాడూ ఎంతో ప్రాధేయపడ్డాడు. లాభంలేకపోయింది. కుర్రవాడైనా కోపంతో ఉడికిపోయి కావడిలోంచితీసి ఖాళీ సీసాతో కణతమీద బలంకొద్ది కొట్టాడు మామని. సీసా బళ్లున బ్రద్దలైపోయింది. జాహ్నవి కెవ్వున కేకపెట్టి నేలగూలింది ధారకట్టిన నెత్తుటిని చూడలేక. తల బ్రద్దలైంది ఆయనకు. సాయంత్రానికి ఆసుపత్రికి చేర్చారు. పోలీసులొచ్చి ఎంతో గొడవ చేశారు. జాహ్నవిని బాధించారు. ఆమెయే తనను హత్య చేయడానికి ప్రయత్నించిందని ఆయన వాఙ్మూలమిచ్చాడు. బాజీ—"నేను—నేరస్థుణ్ణి" అని ఒప్పుకున్నాడు. అతనికి సంకెళ్లు తగిలించి జైలుకు తీసుకెళ్ళారు. మళ్ళీ మూడునెల్లదాకా లేవలేదు ఆ పెద్దమనిషి మంచంపై నుండి. రెండు నెలలు జైలులో కఠినశిక్ష ననుభవించి అక్కగారికోసం అటమటిస్తూ ఇంటికొచ్చాడు బాజీ. ఇలా మీకొరకై యమయాతన లనుభవిస్తూ బ్రతుకు సాగిస్తూంది బరువుగా మాయ కూతురు."

ఈ ఉదంతం వింటూ కిశోర్ ఇక నిలువలేకపోయాడు. దీనవదనంతో ఆమెకు నమస్కరించి వీధినబడ్డాడు. ఎటూ నిశ్చయింపలేని హృదయంతో తూలిపోతూన్నాడు. జాహ్నవి తనయెడ ఇంకా యింత బలీయమైన విశ్వాసం గలిగియుండడం అతన్ని ఉన్మత్తుని చేస్తూంది.

## 4

చికాకు మనస్సుతో కార్యాలయంలోకి అడుగు పెట్టాడు కిశోర్. లోన ఎవరో తీవ్రంగా వాగ్వివాదం జరుపుకుంటున్నారు. "ప్రెస్‌కు చేర మొచ్చింది. అమ్మించెయ్. వచ్చిన నష్టం చాలు" ఇది స్త్రీకంఠం. "నీయిష్టం. కొఱగానిపనికి డబ్బు అనవసరంగా ఖర్చుపెట్టడం నాకుమాత్రం నచ్చుతుందా. కానీ ఒకటే పీకుతూంది. ఆయన కింకా ఆపిచ్చి వదల్లేదు"—గోపాల్ బాబుది ఈ స్వరం. "వదలదు. మనం పచ్చిగా వున్నన్నాళ్లు ఆయనపిచ్చి కుదరదు. చిత్తు కాగితాలతో సహా అమ్మేయ్. పది రోజుల్లో మనకు సొమ్ము చేరాలి. జాగ్రత్త". "అలాగే కానిద్దాం" "గోపాల్! అమ్మాయి పెళ్లిమాట ఆయనతో ఎప్పుడైనా ప్రస్తావించావా?" "లేదు. అలాగునే గోప్యంగా వుంచాను. ఇవాళనే తేల్చేస్తాను. పట్నంనుంచి రానీండి"

కిశోర్ లోనికి వెళ్ళాడు. వారిద్దరూ క్షణంసేపు చకితులైనారు. యజమానురాలు యింతటి అవ్యాజప్రేమ ఇన్నాళ్లుగా తనపై ప్రసరించడంలో గల అంతరార్థం బోధపడింది. ఆమెను ఏమనాలో తోచలేదు. నెమ్మదిగా ఆమె తప్పుకుంది. గోపాల్

ప్రారంభించాడు. "కిశోర్ - ఎంత చెప్పినా ఆమె వినడంలేదు. తానుబట్టిన కుందేటికి మూడేకాళ్లంటుంది". "ఆఖరిసారిగా ఒకేఒక ప్రయత్నం తలపెట్టాను. నేటివరకు విజయం ఎండమావులుగానే వుంది. నిన్న నే పత్రికలో ఒక ప్రకటన చూశాను. నవలా రచనల ప్రపంచపోటీలో పాల్గొంటున్నాను. దీనిలో విజయం వచ్చినా సరే. లేకుంటే ఇదంతా సొమ్ము జేసుకుందాం. శాశ్వతంగా నా ఉద్యమానికి తిలాంజలి యిస్తాను." "సరే" అన్నాడు గోపాల్. ప్రశాంతంగావున్న సమయంలో ప్రెస్ యజమానురాలికుమార్తె లీలాదేవి పెండ్లిగురించి ప్రస్తావించాడు. తనకిచ్చిన వాగ్దానాన్ని చెల్లించమని కోరాడు. కిశోర్ తన అసమ్మతిని వెల్లడించాడు. అయితే తన కడసారి యత్నం ఫలించేదాకా ఈ రహస్యం వెల్లడించవద్దని ప్రతిమాలాడాడు. గోపాల్ మౌనం వహించాడు. ఆ మౌనముద్రలో వొక మహావిప్లవం చెలరేగింది. కాలకూటవిషం అతని మెదడులో మెదిలింది అది ఏరూపంలో విజృంభించి తనకు [illegible] ఎట్టి [illegible]ను తెస్తుందో వూహించగలగడం బహుకష్టమయింది కిశోర్‌బాబుకు. ఆ మౌన ప్రత్యుత్తరాన్ని ఆశ్చర్యంతోనూ, ఆవేదనతోనూ స్వీకరించాడు.

కృషి మళ్ళీ ప్రారంభమయింది. రాత్రింబవళ్లు నిద్రాహారాలు త్యజించి వ్రాశాడొక నవలను. కళాకారుని కడసారి ప్రహారం—అతడు కేవలం విజయకాంక్షతో చైతన్యంతో పూనిక వహించాడు. తప్పక జయించి తీరాలనుకున్నాడు. నవలా పోటీకి పంపాడు ఆ గ్రంథాన్ని. రెండు ప్రతులుగా తయారు [illegible] మిత్రుడు లీలాదేవికి చూపిస్తానని తీసుకుపోయాడొక ప్రతిని. అతడు ఆ పుస్తకాన్ని చూసి మెచ్చుకున్నాడు; ఆమె నవ్వుకుందన్నాడు. ఆ మెప్పు, నవ్వు, పయోముఖవిషకుంభాలని తెలుసుకోలేకపోయాడు కిశోర్. తన జీవితభవిష్యత్తును తేల్చేది ఈ ప్రయత్నం. అదే అతని చావుబ్రదుకుల్ని నిర్ణయించాలి. అదొకటే ఆశతో దినాలు యుగాలుగా గడుపుతూ నిరీక్షిస్తున్నాడు. ఎన్నో తీయని కలలు గంటున్నాడు. ఆశాభావంతో తేలిపోతున్నాడు.

అతడు ఆశించిన గడువు దాటింది. ఎప్పటియట్లే నాడుగూడా కిశోర్‌బాబు రచనలు తిరిగి వచ్చాయి. అయితే అవి వచ్చేసమయానికి లీలాదేవి, గోపాల్‌బాబూ అక్కడే వున్నారు. త్రిప్పివేయబడ్డ వాటిలో తాను పోటీకి పంపిన గ్రంథంగూడా వుంది. అతడు దాన్ని చూస్తూనే దిగులుపడిపోయాడు. ఏవిధమైన వ్యాఖ్యానం లేకుండానే ప్రె వాళ్లు తన నవలను తిరిగి పంపేశారు. ఒళ్లు తేలిపోయింది జీవితంలో తానూహించని సంఘటన సంభవించింది. ఆ కవర్లు అలాగునే మూలకు గిరవాటేసి, కించిత్తూ తన అవస్థకు జాలిని ప్రకటించనివారివద్ద శెలవు పుచ్చుకుని పట్నం బయలుదేరాడు. ఆయన వెళ్లిన కొద్ది నిమిషాల అనంతరం ప్రెస్‌నూ, ఇతర సామగ్రినీ అమ్మివేయమని మళ్లీ గోపాల్‌బాబును హెచ్చరించి లీలాదేవి వెళ్లిపోయింది. ఇకనైనా కిశోర్ మనస్సు మార్చుకుని తన ఉన్మత్తతకు స్వస్తి చెప్పి ఆమెవద్దకు వచ్చి తీరుతాడని భ్రమించింది.

మతిలేని స్థితిలో రెండుమూడురోజులు కిశోర్ పట్నంలో తచ్చాడాడు. ఆ మైకంలోనే జాహ్నవిని చూడాలని బయలుదేరాడు. ప్రపంచంలో తానింక బ్రతకడం అనవసరం అనుకున్నాడు ఆఖరిసారిగా జాహ్నవి ఎదుట నిలిచాడు. బాజీతో దుడుకుగా సంభాషిస్తోంది జాహ్నవి. "నిన్నవగా పోయావు తమ్ముడూ! ఈ రెణ్ణెల్లలోనూ కనీసం పదూళ్లైనా తిరిగివుండాలి. ఏం(వి) ఖరీదు చెయ్యలేదూ?" "లేదక్కా. ఒక్క పాతసామానైనా దొరకలేదు. ఎపుడూ పత్రికల కట్టలు దొరికేవి. ఏవో చిత్తుకాగితాలూ. వ్రాతపుస్తకాలూ, పరీక్షపేపర్లూ దిద్దిపారేసినవి—ఇంకా కవర్లలో మడిచివున్న కాగితాలు—అయితే సరుకుమాత్రం భారీగానే వుందిలే." "ఏవీ—ఎక్కడున్నాయీ?" "కావిడి మొయ్యలేక ఇంటిదగ్గిరే గదిలో బెట్టొచ్చాను. అక్కాయ్—చెప్పడం మరిచాను. ప్రొద్దుట కాఫీకి డబ్బులేకపోతే వూళ్లోకి రాగానే మసాలాపప్పూ, వేరుశెనక్కాయలూ అమ్ముకునేవాడికి పెద్దపుస్తకం వొకటి వాటిలోది అరటావు సైజుది అమ్మేశాను. ఎనిమిదణాలిచ్చాడు. నిన్నటినుండి మాడుతూన్న కడుపును దానితో తడిపాను." "సరేలే" అని ముఖం అటు త్రిప్పింది జాహ్నవి

ఎదుటివ్యక్తినాలకం గుర్తుపట్టడానికి ఆట్టే శ్రమపడనక్కరలేకపోయింది. కాని ఇదేం విపరీతం. కిశోర్‌బాబు ఇలా వున్నారేం! "రండి—కూర్చోండి బాబూ." అతడు ఆమెమాటలు వినిపించుకునే స్థితిలో లేడు "లేదు— జాహ్న కూర్చోడానికి రాలేదు. నా తుదిప్రయత్నం గూడా విఫలమైంది. ప్రపంచ పోటీకి నవల వొకటి పంపాను." అంటూంటే అడ్డుకుంది జాహ్నవి "మీరూ పంపారా? అయితే మీకే గెలుపు. జయించారు." "ఏం పిచ్చినమ్మకం నీది! పోయిన ప్రాణాలను గూడా లేవదీయ యత్నిస్తున్నావు విశ్వాసంతో.

నా విషయంలో ఆశలేదు. శెలవు. నిన్నొకసారి చూడ వేడుకబుట్టి వచ్చాను." "వద్దు, మీ రెక్కడికీ వెళ్ళొద్దు. కొంత విశ్రాంతి తీసుకోవడం అవసరం." కిశోర్ ను బహు జాలిగా బ్రతిమాలింది. ఆమె ప్రార్థనను ఆయన వినడానికి రాలేదు. జీవితంలో తుదిసారిగా ఆమెను చూచిపోతానని తాను ఆమెకు మాటయిచ్చాడు. అంతే—ఆపని అయిపోయింది. రోజుకుంటూ ముందుకు సాగిపోయాడు. దృష్టిపథం నుంచి క్రమంగా దూరమైపోయాడు. ఆలోచనలో లీనమైన జాహ్నవికి తెలివివచ్చింది. బాజీని జాగ్రత్తగా సాపు చూస్తూండమని ఆవైపు వెర్రిగా అతన్ని వెంబడించింది.

కిశోర్ బాబు సరాసరి బీచ్ వైపుకు వెళ్లాడు. దూరాన ఉప్పొంగిపోతున్న సముద్రం కెరటాలతో తన్నెదుర్కొనడానికి విజృంభించే లోకంవలె వుంది. ఎన్నో తలపులు లోన మెదిలినై. జీవితం చేదుగా వుంది ఆత్మహత్యకు నిశ్చయించుకున్నాడు. సిగరెట్టు ముట్టించుకోవడానికి ఆ ప్రక్కనే వున్న కిళ్ళీకొట్టువద్దకు వెళ్ళాడు. సిగరెట్టుతీసి కొట్టుతలుపుకు వ్రేలాడగట్టబడ్డ అగ్గిత్రాటిని పట్టుకుని తల వంచాడు. వంచిన తల ఎత్తకుండానే అలా వుంచేశాడు. పెదిమెలమధ్యనుండి సిగరెట్టు క్రిందకు జారిపోవడంగూడా గుర్తించలేదు. ఆ పరిస్థితి చూస్తూ కొట్టువాడుగూడా నిర్ఘాంతపోయాడు.

కొట్టుకు చేరగిలబడివున్న బల్లమీద అంటించబడివుంది వొక కాగితం. దానిలో నాటిదైనిక పత్రికా విశేషాలు, పెద్దపెద్ద అక్షరాలలో వున్నవి, అంటించబడివున్నాయి. అక్షరాలను చదువుతూ తూలిపోసాగాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. విచిత్రమైన అవస్థలో పూర్తిగా మునిగిపోయాడు. రెండు చేతులతోనూ ఆ బోర్డును పైకెత్తి ప్రారంభించాడు పరుగెత్తడం. కొట్టువాడు ఆడే మాటలుగూడా వినిపించుకోవడంలేదు. మార్గంలో జాహ్నవి ఎదురైంది. ఆమెనూ చూడలేదు.

జాహ్నవి అతని పాదాలపై వాలి "ఇదేమిటి కిశోర్ బాబూ! ఇలాగైపోయారు. నా ప్రార్థన మన్నించండి. ఇంటికి పోదాంరండి" అంటూ విలపిస్తూంది. ఆ బల్లను అక్కడే పారేశి అమాంతంగా ఆమెను కౌగలించుకున్నాడు. "జాహ్నవీ! నీవు చెప్పింది నిజం. నేనే తప్పను కున్నాను" అనసాగాడు—ఆమె కిది అర్థంకాలేదు. బల్లఎత్తి తనకూ ఆమెకూ మధ్యగా పట్టుకున్నాడు. వణకే పెదిమలతో జారిపోతూన్న ఆనందబాష్పాలతో చదివింది "భారతీయ నవలాకారునికి ప్రపంచపోటీలో ప్రథమ బహుమానం. కిశోర్ బాబుకు అయిదువేల డాలర్ల కానుక—భారతీయ సాహిత్యంలో ఒక మహిమాన్వితఘట్టం-ఆమెగూడా తన కనులను తానే నమ్మలేకపోయింది. ఆనంద సాగరంలో తేలిపోతూ ఇల్లు చేరుకున్నారు. అప్పుడే బాజీ కౌవడిలో పెట్టుకున్న కాగితాలతో సాపుకు వెళ్లేసని చెప్పింది విమలాదేవి. పండువలతో రెండు రోజులు క్షణాలుగా దొర్లిపోయాయి.

## 5

కిశోర్ బాబు పత్రికాధిపతుల్ని కలుసుకున్నాడు. తన రచనను త్రిప్పివేయడంగూర్చి ప్రస్తావించాడు. ప్రతినిధులాతనిని మిక్కిలిగా సన్మానించారు. తాము రచనను అతనికి పంపనేలేదనీ, ఇందేదో ఇంద్రజాలం ఇమిడియున్నదనీ పేర్కొన్నారు. పౌరసన్మానాలుగూడా జరిగాయి. అతని రచనలన్నింటినీ సమగ్రంగా ముద్రించడానికి అంగీకరించి వాటిని తీసుకురమ్మని కోరారు. చాలా ధనం పారితోషికంగా ఇవ్వ నిశ్చయించారు. మఱునాడే విజయసూచకంగా ఒక రచన వ్రాసి తన ప్రాతపుస్తకాలకోసం పల్లెటూరికి బయలుదేరాడు. కాని అచ్చటి దృశ్యం ఆతణ్ణి కుందించింది. ప్రచురణాలయం ఎత్తివేయబడింది. పొరుగువారు చెప్పారు "గోపాల్ బాబూ, లీలాదేవీ—ప్రెస్సూ, తదితరసామగ్రీ అమ్మివేసుకుని మకాం ఎత్తివేశార"ని. ఎటుపోవడానికీ అతనికి కాళ్లాడలేదు. భోగట్టా జరిపి తిన్నగా గోపాల్ బాబువున్న చోటి కెళ్లాడు. "అసలు ఆస్తి అంతా లీలాదేవిదే. ఆమెను నీవు వివాహం చేసుకోవని స్థిరపడింది. కాగా నీవు పిచ్చివాడవైపోయావనీ, నీకు పెట్టుబడిపెట్టడం వృథా అనుకునీ ప్రెస్ నీ తదితర సామగ్రినీ నాలుగువేలకు అమ్మివేసింది." అన్నాడు బిక్కమొగం పెడుతూ గోపాల్ బాబు.

"నా రక్తంతో వ్రాసినరచనలు, నా సరస్వతి - ఏదీ" దుఃఖంతో అంగలార్చాడు కిశోర్. "లోకం నీచంగా చూసి త్రోసిపారేసిన తుక్కు ఇంక వుండీ ఏం ప్రయోజనం? కిశోర్! ఆ పాతకట్టలన్నీ అయిదు రూపాయల కమ్మివేశాం" అంటూన్న గోపాల్ చెయ్యిబట్టుకుని "ఎంతఘోరం జరిగిందీ! గోపాల్ - నీవాగ్దానం చెల్లించలేదని నాపై పగబట్టావా? ఎంత అమానుషం ? అయిదువేలకంటె విలువైనసాహిత్యాన్ని అయిదురూపాయల కమ్మివేశావా? ప్రాణపదంగా చిన్ననాటనుండీ పెంచుకున్న పుస్తకాలు

పరారీ అయ్యాయి. నేను గెలిచీ ప్రయోజనం లేకపోతూందే. ప్రపంచంలో ప్రథమబహుమతీ పొందానోయ్" అంటూన్న వెర్రికిశోర్‌ను చూచి గోపాల్ విస్తుపోయాడు. ఏమీ తెలియనట్లు నటించ ప్రయత్నించాడు! అంతా లీలాదేవియే చేసింద"న్నాడు మొగం వేలవైచి. ఇరువురూ బయలుదేరి లీలాదేవి వూరు చేరుకున్నారు. కిశోర్ విజయవార్తను పత్రికలలో చూచిన లీల ఆనందాన్ని పట్టలేక కౌగలించుకోవడానికి చేతులు చాచింది "లీలా — దూరంగా వుండు. నీవు స్త్రీవి కావు. రాక్షసివి. నిర్దయతో నా జీవితాన్ని నాశనం చేశావు. నా హృదయం, నా ప్రాణం అయిన సాహిత్యాన్ని ఎవరి కమ్మావు. నేను నీకేం అపకారం చేశానని మోసంచేసి నా రచన నాకు ష్టట్లు చేశావు—నీ ఘోరం తెలుసుకోలేక, నీలో కాలకూటవిషం ఉబికిందని గ్రహించలేక నిజంగా నే ఓడిపోయానని హత్యకు సిద్ధపడ్డాను. పవిత్ర జాహ్నవీ ప్రణయం నన్నాపింది లేకుంటే నీ పేరుమీదుగా అమరపురిలో కవిత్వం చెబుతూండేవాణ్ణి." అని తన్ను శూలాల వంటి మాటలతో పొడిచేస్తూ, వలవల దుఃఖిస్తున్న కిశోర్ బాబును చూచి వణకిపోయింది. "ఔను— కిశోర్. నీ ఘనతను గుర్తించలేక చిరంతనమైన సాహిత్యాన్ని చిత్తుకాగితాలుగా జమకట్టి రత్నాలను రాలకంటె తీసి కట్టుగా లెక్కించి అమ్మి పారేసిన పాపిని నేనే—రచనారంగంలోంచి నిష్క్రమించి నావశ మౌతావని తుచ్ఛస్వార్థంతో నీవు నాకు పంపిన వ్రాతప్రతిని కవరులోవుంచి పట్నంనుండి పోస్టుచేయించిన ద్రోహిని నేనే. నా పాపానికి నిష్కృతిలేదు." అంది జాలిగా దుఃఖిస్తూ.

ఆ పాపపంకిల వాతావరణంలో మఱొక్క క్షణమైనా నిలువలేకపోయాడు. గిరుక్కున మఱునాడుదయానే పట్నం చేరుకున్నాడు. జరిగినదంతా జాహ్నవితో చెప్పి వలవల యేడ్చాడు. ఆవాళ మధ్యాహ్నం తాను మళ్లీ వ్రాసిన రచన తిరిగి వచ్చింది. పత్రికాధిపతులమీద పళ్లు కొరికాడు కిశోర్. తన నింకా నీచంగాయెంచి సమాజం అగౌరవ పరుస్తుందన్నాడు. జాహ్నవి అతన్ని శాంతింపజేసి "కిశోర్ బాబూ? ఇప్పుడు పత్రిక నీరచన తిరస్కరించడంలో లోపంలేదు. బాధపడి ఏం ప్రయోజనం? నీవు యింక రచనా వ్యవసాయం ఆపుచెయ్. చెరుకు తుదన వెన్నుబుట్టింది. నీలో సంఘర్షణలేదు. పోరాటంలో విజయం సాధించిన నీవు నాటి సంగ్రామ సమయంలోవలె సజీవ రచన సాగించలేవు; ఎంత ప్రయత్నించినా గతంలోవలె వ్రాయలేవు ఆ ఉద్వేగం, ఉద్రేకం నీవు ఎంత ఊహించినా రావు. నీకు తెలీకుండా మహోజ్వలమైన భవిష్యత్తు గతంలో కుదింపబడి ఇరుక్కుపోయింది." జాహ్నవి ముఖంవంక చూస్తూ సత్యమైన ఆమె సందేశాన్ని ఆలిస్తూ విస్తుపోతున్నాడు కిశోర్. పాతరచనలకై పలవించడం ప్రారంభించాడు.

పట్నమంతా గాలించమని తన్నుపంపే అక్కతో అంటున్నాడు బాజీ "అక్కా! బాబూజీ ఏవూళ్ళో వుండేవారు? ఆయన పుస్తకాలు ఎలాగున పోగొట్టుకున్నారు?" "అదంతా నీకెందుకూ? పోయి నే చెప్పినపని చెయ్" "కాదక్కా! మనంగూడా కొంటున్నాంగదా కాగితాలు. వాటిలో గానా ఉన్నాయేమో అని-" జాహ్నవి లోనికి వెళ్ళింది. ఛత్రపుర, కుటీర ప్రచురణలను గురించిచెప్పింది. "ఓ- అలాగైతే తప్పకుండా మనదగ్గరే వుండివుండాలి. ఆవాళ చెప్పలేదూ. ఏవీ సామానులు దొరకలేదు. పాతపుస్తకాలూ కవర్లూ మాత్రమే కొన్నానని." చంగున బయలుదేరి షాపుకు వెళ్ళాడు. కిశోర్ బాబునుగూర్చి ఏమీ తెలియని బాజీకి ఇపుడు అసలు విషయం కొంత బోధపడింది.

అరగంటసేపటికి కావడి పట్టుకుని ప్రత్యక్షమయ్యాడు బాజీ పుస్తకాలతో. కటగట్టిన కవర్లూ, విడి వ్రాతప్రతులూ కిశోర్ బాబుముందు పడేశాడు. వొక్కసారి వాటిని కౌగలించుకుని "ఈ బహుమానం నాదిగాదు. నీదేరా బాజీ" అన్నాడు వాణ్ణి బుజ్జగిస్తూ. ఒక్కటొక్కటే తిరగేశి పరీక్షగా చూసుకున్నాడు. పుస్తకాలు అన్నీ ఉన్నట్లే వున్నయ్— కాని ఒకటిమాత్రం అవుపించలేదు. "ఇంతేనా— ఇంకా ఉన్నాయా?" ఆత్రుతతో ప్రశ్నించాడు. "లేవు" పెదవివిరచాడు బాజీ. జాగ్రత్తగా సద్ది పెట్టెలో బిగించేశాడు కిశోర్ వాటిని.

కిశోర్ ముఖంలో ఇంకా దిగులుపోలేదు. గుచ్చి గుచ్చి అడిగింది జాహ్నవి. "నిన్నుగురించి వొక పుస్తకం వ్రాశానూ అదిపోయింది అదీ నా దురదృష్టమే." అన్నాడు. జాహ్నవి బాజీని పిలచి అడిగింది. "ఆవేళ కాఫీకని ఓ పుస్తకం అమ్మేశాగా— బహుశః అదేనేమో అక్కా—" అన్నాడు బాజీ— ఇంక దాన్నిగూర్చి బాధపడి ప్రయోజనంలేదని ఊరడించింది. జాహ్నవి కాని ఆ కళాకారునికి తృప్తి లేదు—లీలాదేవిని తెగతిట్టడం ప్రారంభించాడు. ధనంకోఱకు తన సుఖంకోసం ఆమె సాహిత్యాన్ని హత్యచేసిందన్నాడు.

సముద్రతీరానికి వాహ్యాళికి బయలుదేరారు కిశోర్ జాహ్నవులు. సాయంకాలపు చల్లగాలిలో సాగరుడు కరాలనుచాచి ఆ ప్రేమజీవులను ఆహ్వానిస్తున్నట్లున్నాడు. ఇసుకతిన్నెమీద కూర్చున్నారు ఇరువురూ. పవిత్రజాహ్నవి సాగరుని యొడిలో ఔదల దాల్చినట్లు జాహ్నవి కిశోర్ ప్రాంగణంలో ముగ్ధగా పరవశయైయుంది. "జాహ్నవీ! నీ విశ్వాసం అచంచలమైంది. ఓటమిని నాకుగా వొప్పుకున్న నన్ను నీవే గెలిపించావు. ఇంతటి సంఘర్షణలో పాల్గొని మనస్సు నిలువద్రొక్కుకోలేకపోయాను. నైరాశ్యంపొందాను. కాని నీవో? మృత్యుముఖంలో గూడా ఆత్మవిశ్వాసాన్నే ప్రకటించావు." అంటూ బుజ్జగిస్తున్న కిశోర్‌తో "మీ ఆశాకిరణమే నా విశ్వాసానికి జీవం. జీవితంలో ఎన్నటికైనా మిమ్ము పొందగలననే దీక్ష నన్ను బ్రదికించింది." అంది. ఇంతలో వేరుశెనక్కాయలమ్మేవాడు బండి తోసుకుంటూ వస్తున్నాడు. కిశోర్ లేచి రెండణాలుపెట్టి కాయలుకొన్నాడు. పొట్లం విప్పుతూ రెండుకాయలు ఆమె కిచ్చాడు. అవి వొలిచి పొట్టును ఊదిపారేసి ఆతనికి గింజలందిస్తూంది. పరధ్యాన్నంలో పడి పొట్లం కాగితాన్ని తేరిపార జూశాడు కిశోర్. కిళ్ళీదుకాణంనుండి బల్లయెత్తుకుని తనవద్దకు పరుగెత్తుకువచ్చిన కిశోర్ ముఖం మళ్లీ అవుపించింది జాహ్నవికి. అంతే. త్రుటిలో వెర్రిగా పరుగెత్తాడు కిశోర్ వేరుశెనక్కాయలమ్మేవాని వైపు.

జాహ్నవి కేమీ బోధపడడంలేదు. "జాహ్నవీ—జాహ్నవీ—రా—రా నా ప్రాణం నేటికి కుదుటబడింది" అంటూన్న పిచ్చి కళాకారుని చూచి చుట్టుప్రక్కలవారు ఆశ్చర్యపడుతున్నారు. వేరుశెనక్కాయల వర్తకుడు వికటంగా నవ్వుతున్నాడు. వెనకనే పరుగెత్తుకునివచ్చి "ఇదిగో—ఇక్కడే వున్నా" అంటూ కిశోర్‌ను గట్టిగా పట్టుకుంది. "లేదు. జాహ్నవీ—నీవు అంగడివాడికి అమ్ముడుపోయావు. నా నెత్తుటితో సృష్టించి నిన్ను యీ అన్యాయపు లోకంపాలు చేశాను. నా కారణంగా ఎన్ని ఇక్కట్లుపాలైనావో గదా? ప్రియమైన జాహ్నవీ! రావూ" అంటూ త్రోపుడు బండిలోని విడికాగితాల దొంతరను లాగేశాడు పైకి. జేబులోంచి రూపాయతీసి బిత్తరగా మాస్తున్న అంగడివాడి ముఖాన కొట్టాడు. పరుగున ఇంటికి చేరుకున్నాడు. చినిగిపోయిన కాగితాలను ఒక్కొక్కటే చేర్చాడు. జాహ్నవి రోజుకుంటూ లోనికి అడుగుపెట్టింది. ఆమె కిప్పు డర్థమైంది. ఆతడు రాత్రింబవళ్లు విచారంతో వెదకుతూన్న గ్రంథం అది. తన పేరిట వ్రాయబడడం ఆమెలోని ఆందోళనను అధికంచేసింది.

పుస్తకంలో కొన్ని కాగితాలు శిథిలమైపోయాయి. కొన్నిటి నిండా నూనెమరకలు. కొన్ని లేనేలేవు. నాటినుండి మళ్లీ కూర్చున్నాడు దాన్ని పూర్తిచేయడానికి. సుమారు పాతిక పేజీలు పోయాయి. వారంరోజులు గడచినా పూర్తిగాలేదు. "పోనీలెండి. నా పుస్తకాన్నిగూర్చి మీకంత ధ్యాసెందుకూ" అంటుంది జాహ్నవి. "అలాగ్గాదు జాహ్నవీ! ఇది కేవలమూ పుస్తకమే ననుకున్నావా? నా సంఘర్షణలో తళతళలాడిన క్రొమ్మెరుపు. మఱపునకు రాని మహిమాన్విత ఘట్టం. నీవు మొన్న చెప్పినది నిజం. ఆ మెఱపును మళ్లీ నా హృదయాకాశంలో చూడలేను. నా గ్రంథం ఇలానే వుండిపోతుంది అసంపూర్తిగా." అని ఆమె ప్రక్క మేను వాల్చాడు. వాతావరణం బహు ప్రశాంతంగా వుంది తుపాను పట్టి వెలసిన అనంతరపు మహాసాగరంవలె—కిశోర్‌బాబుకు బాగుగా నిద్రపట్టింది. ఆతని ఉద్వేగాన్ని తిలకించిన జాహ్నవికి మాత్రం ఎంత ప్రయత్నించినా నిద్రరావడంలేదు—కళారాధన తక్క ఆయనకు జీవితంలో మఱొక విషయానికి తావులేదు. తన రచనగురించి—కాదు—కాదు కళోపాసనలో రూపొందించుకున్న తననే గూర్చి తలంచుకు తలంచుకు కలవరిస్తున్నాడు నిద్రలోగూడా— "ఎంతపొరబాటు జరిగింది? నావల్ల సృష్టింపబడి, నా రక్తంతో పెంపబడి—అకారణంగా వొరులవల్ల పరులకు అమ్మివేయబడ్డావు—మఱతునన్నను మఱపునకు రావు—ఎలాగ ఈ జీవనఘట్టం—కళాఖండం పూర్తికావడం—అబ్బా. తలచినకొద్దీ సంఘర్షణ హృదయాన్ని జలదరింపజేస్తూంది — జాహ్నవీ!

# * శృంగారరసము

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

శృంగారమునకు జీవితమగు రతి యను భావము సర్వప్రాణులయందు, సర్వ సాహిత్యముల యందు నతిప్రధానముగా కన్పించును. ఇట్టి శృంగారమున ప్రతిభావము అంతర్వ్యాప్తము కాగలదు. 'ప్రేమరసే సర్వే రసా అంతర్భవంతీత్యత మహీయా నేవ ప్రపంచః' అని అలంకార కౌస్తుభ మున వినుచున్నాము. కావ్యజగమున గల రస చర్వణలలో శృంగారమునకు వైశిష్ట్యము కలదు. సంవేదనమగు రసచర్వణ శుద్ధము, అక్లిష్టము, స్ఫుటమునగు విశ్వప్రేమయని, ఈ విశ్వప్రేమయే వైశద్యమునంది తీవ్రత్వముతో నభివ్యక్తమై మానవుల విషయమున శృంగారమని, దేవతా విషయమున భక్తియని పిలువబడుచున్నదని "కోహెన్" (*Cohen*) పల్కుచున్నాడు. మహాకవులు భౌతికముగా శృంగారమును ప్రదర్శించక సంతానప్రాప్తితో శృంగారమునకు పూర్ణత్వము సిద్ధించుచున్నదని చెప్పుచున్నారు. కాళిదాస భవ భూతుల నాటకములలో శృంగారము క్రమక్రమమున ఆధ్యాత్మికరూపమునందుట అందరకును తెలిసిన విష యమే.

సంభోగమునకంటె విలక్షణమైన శృంగార రూపముగా ప్రేయస్ లేక వాత్సల్యము కనపడు చున్నది. ప్రేయస్ అను రసమును రుద్రటుడంగీక రించగా, దీనిని 'భావ' కావ్యముగా ఉద్భటుడు గ్రహించినాడు. "ప్రేయః ప్రియతరాఖ్యానం" అని ప్రాచీను లనినారు: కావున నే భావకావ్యమునకు లాక్షణికముగా ప్రేయశ్శబ్దమును ప్రయోగించ వచ్చునని ప్రతీహారేందు రాజు వచించినాడు. ప్రియతరాఖ్యానము శృంగారమునకు సన్నిహితమైన దగుటచేతను, ఈ ప్రీతి కేవలము మానసికము లేక ఆధ్యాత్మికము అగుటచే ప్రేయస్, వాత్సల్యము, ప్రీతి అను మూడు శృంగారరూపములు కలవనినారు. భక్తిని నాల్గవరూపముగా చెప్పవచ్చును. ఈ నాలుగు హర్షోత్సాహములలో నంతర్వ్యాప్తము లగు భావములే యని దశరూపకమున సిద్ధాంతించబడినది. ఇవన్నియు శృంగారరసములో కన్పించు భావములు.

ప్రేమయనబడు శృంగారము ప్రతిరసములోను గలదు. శృంగారప్రియుడు, హాస్యప్రియుడు, ఉత్సాహ ప్రియుడు, అని వ్యవహరించుచున్నాము. ఇట్టి ప్రేమ లేనిచో జీవితమున ప్రవృత్తియే కొనసాగదు గనుక "రసంత్విహ ప్రేమాణయే వామనంతి" అని భోజు డనినాడు. రసమనగా ప్రేమయే అని అర్థము. కాని క్రోధప్రియుడు గర్విష్ఠిగాని, ముకోపిగాని యగును. శోకప్రియుడు నిష్ప్రయోజకుడగును. ఇట్లే జుగుప్సాప్రియుడు స్నేహబాంధవ్యములు లేని వాడగును. కాగా క్రోధ, శోక, జుగుప్సలను ప్రేమించువానికి కావ్యజగమున నిలువ నీడలేదు. కాని ప్రేమను హృదయసంవాదముగా గ్రహించితి మేని శృంగార ప్రతీతియే రసప్రతీతి యగును.

అగ్నిపురాణ మొక విశిష్టవాదమును ప్రపం చించియున్నది. బ్రహ్మ సహజానందరూపము దాని ప్రథమవికారమగు అహంకారము అభిమానము నుత్ప న్నము చేయుచున్నది. భువనత్రయ మద్దానియందు సమాప్తమగుచున్నది. అభిమానము రతిగా పరిణమించు చున్నది. ఈ రతియొక్క వివిధరూపములు, పరిణామ ములుమిగిలిన రసములు. చైతన్యముయొక్క సహజలక్షణ మగు ఆనందము చమత్కారముగా, లేక రసముగా, అభివ్యక్తమగుచున్నది. ఈ రస ముపహితమై అహం కారమని పిలువబడుచున్నది. ఆత్మకామముతో, ఆత్మకామముద్వారా అహంకారము ప్రవృత్తమగు చున్నది. అనగా శృంగారమున కనుప్రవేశము లేని రసము ఉండజాలదని భావము. శృంగారాత్మకమగు రసమే రసచర్వణలో అవగతమై అనుభూతమగు చున్నది. ఏవంవిధ శృంగారావిష్టుడైన కవియొక్క కావ్యమే రసమయమగుచున్నది. శృంగార మనబడు ఈ రసమునుండి లౌకిక శృంగారాది రసము లుత్ప న్నము లగుచున్నవి.

ఈ వాదము ననుసరించినచో రస మొక్కటే అని, అట్టి రసమును శృంగార మనవలెనని తేలుచున్నది. అహంకారముగాను, అభిమానముగాను ఈ రసము ప్రతివ్యక్తియొక్క ఆత్మయందు కలదు. ఆత్మ కామముగా అనుభూతమగు ఈ శృంగారము బాహ్య జగన్నిష్ఠ విషయములతో సంవలితముకాగా వివిధభావము లావిర్భవించుచున్నవి. కాగా శృంగారము పురుషనిష్ఠమని, వస్తుతంత్రమని ద్వివిధము కాగలదు. ప్రేమ యనబడు మహారసములోనికీ భావములన్నియు పర్యవసితములుకాగా పురానిష్ఠము, వస్తుతంత్రము నగు ద్వివిధశృంగారములకు వీటి నంతర్లీనము చేసికొనిన తృతీయరూపము వచ్చుచున్నది.

మానవచైతన్యము వ్యావహారిక జగమునుండి పరిష్కృతమై, ఉత్తమమార్గమున కున్నేయముకాగా అహంకార మనబడుచున్నది. ఆత్మస్వభావమగు ప్రేమను చర్వ్యమాణముగా చేయుటకే మానవుడు కావ్యజగమున ప్రవర్తించుటచే, ఈ ప్రవృత్తిలో అభిమానరూపమున ఆత్మచైతన్యము కన్పించుచున్నది. అనుకూలవేదనీయత్వముగా దుఃఖము సహితము సుఖముగా అభిమత మగుచున్నది. ఈ రెంటిని తనలో సంవలితము చేసికొని, వీటికి అతీతమై కన్పించునది శృంగారము. ఈ అవస్థలో దేశకాలాద్యనుపహితముగా ఆత్మవిస్మృతి, ఆత్మవికాసము గలవు. కావున అనుపహితమగు చైతన్యమునకు విశ్రాంతి లక్షణమగుస్థితి శృంగారముద్వారా, శృంగారములో కలదని స్పష్టమగుచున్నది.

"ఒకడు రసికుడు, మరియొకడు నీరసుడు అని లోకమున చూచుచున్నాము. ఈ అనుభవమును పరిత్యజించి శృంగార చర్వణస్వార్థము, ఆత్మస్థము కాదని, దేశకాలప్రమాత్ర నియంత్రితమని చెప్ప వీలులేదు. అందరకు రత్యాది భావములు కలుగవు. ఎవరికో కొందరకే ఈ భావములు కలుగుచుండుటచే సర్వజగత్తు రసికమగుటలేదు. అసాధారణమగు అదృష్ట నిమిత్తమునను సరించి రత్యాదిభావములు కొందరికే కలుగుచున్నవి. ప్రత్యగాత్మగతమగు అనాది వాసనానుబంధియైన ధర్మమే ఇచట కన్పించు అసాధారణ హేతువు" అని శృంగారప్రకాశకర్త చెప్పుచున్నాడు. బాహ్యజగన్నిష్ఠమగు ప్రమేయములతో మనస్సునకు సంబంధము కలుగగా మనస్సునుండి ప్రప్రథమమున నుత్పన్నమగునది కామమని ఋగ్వేదమున దశమ మండలములో గలదు. ఇచ్ఛ, రతి యనునవి కామమున నంతర్భూతములు. స్వార్థమే ప్రతిప్రవృత్తియందు ప్రధానముగా కన్పించుటచే ఆత్మకామము సర్వత్ర గలదని చెప్పగలుగుచున్నాము. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని బృహదారణ్యక మనుచున్నది. ఏవంవిధమగు విశ్వజనీనత్వము గల కామము రసచర్వణలో ఉండక తప్పదు. కామముయొక్క తీవ్రత, ప్రయోజనము, ప్రాముఖ్యము తదంతర్గత దుఃఖము నాశ్రయించుకొని వచ్చునవగుటచే కామమును సుఖ సంవేదనమని చెప్పరాదు. ఆత్మకు ప్రియమైనస్థితి యగు కామము సుఖదుఃఖానువిద్ధమైనది.

ఆత్మకామమే రసమని, శృంగార హాస్యాది సామాన్యరసములీ రసరూపములని భోజునివాదము. ఆత్మకామమగు రసము సదా అనుభూతమగునది. ఇది పూర్వసంస్కారానువిద్ధమైన ఆత్మ గుణమని, ఈ గుణమునుండి రత్యాదులు జన్మించుచున్నవని చెప్పుచున్నాడు. గుణరహితమగు చైతన్యమునకు అభివ్యంజకములగు ఉపాధులే కన్పించుటచే చైతన్యముయొక్క గుణములుగా అహంకారాదులను గ్రహించుట అశాస్త్రీయము. శృంగార మితరరసములవలె చైతన్యాభివ్యంజకమే కాగలదు. అహంకారరూపమున చైతన్యము పరిచ్ఛిన్నమగుటచే అహంకారమును ఆత్మగుణమనరాదు. పైగా భావములు చిత్తవృత్తులుగా భావింపబడుచున్నవని విస్మరించరాదు. భావనావ్యాపారము నిర్వృత్తమైన తర్వాత రసప్రతీతి కలుగునని భోజుడు వచించుటకూడ అనుభవవిరుద్ధము. భావనా వ్యాపారము నిర్వృత్తమైన, రసచర్వణకూడ నిర్వృత్తమగుచున్నది.

రసప్రతీతిని వివరించు సందర్భమున భోజుడు నూతన ప్రక్రియ నవలంబించుచున్నాడు. మొదట అహంకారము గలదు. ఎనిమిది స్థాయిభావములు, ఎనిమిది సాత్త్వికభావములు, ముప్పదిమూడు వ్యభిచార భావములు గలవు. ఈ నలుబది తొమ్మిది భావములు అహంకారమునుండి పరిణమించినవి. ఇందు ప్రతిభావము రసముగా పరిణమించగల శక్తి కలిగియున్నది. అన్నియు కలసి ప్రేమరసమున పర్యవసితములై చివరకు అహంకారమున లీనమగుచున్నవి. లొల్లట, దండి ప్రభృతుల ననుసరించి భోజుడు గూడ ప్రకర్షాధిగమము నందిన భావమే రసమనుచున్నాడు. ఈ ప్రకర్షాధిగమమువలన ఆత్మస్వభావమున, ప్రవృత్తియందు పరిణామము కన్పించగలదు.

"సత్త్వాత్మనా మమల ధర్మవిశేషజన్మా
జన్మాంతరానుభవ నిర్మిత వాసనోత్థః
సర్వాత్మ సంప దుదయాతిశయైక హేతుః
జాగర్తి కోఽపి హృది మానమయో వికారః"

అని ఈ పరిణామమును వర్ణించినాడు. ఇతః పూర్వము మనకు కల్గిన ఉత్తమ అనుభూతులచే పరిష్కృతమై ఆత్మ సాత్త్వికమగుచున్నది. ఒకానొక విశిష్టానుభూతికై ప్రవృత్తము కాగా నీయాత్మ సంవేదనాత్మకముగా అభివ్యక్తమగుచున్నది. ఆత్మయొక్క రూపమగు అహంకారమునుండి వచ్చు ఈ సంవేదనము రాగాత్మకము, సాత్త్వికము గూడ. ఇట్టి సమయమున వ్యాపృతమగు బుద్ధికూడ సాత్త్వికమే. సాత్త్విక బుద్ధియే ఆత్మయగుటచే "సత్త్వ పురుషయోః శుద్ధి సామ్యే కైవల్యం" అని యోగసూత్రము చెప్పుచున్నది. ఈ సిద్ధాంతమునే రసచర్వణయందు అనవసర పారిభాషిక ప్రక్రియను వదలి ప్రపంచియున్నాము. అహంకారాది విధానముతో ప్రసక్తిలేకుండా భట్టనాయక, అభినవగుప్త, జగన్నాథులే సిద్ధాంతమునకు రాగలిగినారో దానినే భోజుడుకూ: చెప్పుచున్నాడు. రసమనగా ఆత్మ చైతన్యమని, స్ప్రు సాత్త్వికబుద్ధి గలదని స్ఫూ వ కాని దీనికి శృంగారమని నామకరణము చేయుటయే ఇందలి నవ్యత్వము.

భోజుని శృంగారవాదము సాహితీచార్వాకమునకు దారితీయుచున్నదని, "ఫ్రాయ్డ్" వాదముతో తుల్యమైనదని చెప్పనగును. సౌందర్యము, సత్యము, ధర్మము, భక్తి అనునవి ఉత్తమ పురుషార్థములు. వీటిని శృంగారముయొక్క రూపాంతరములుగా పరిగణించుట అశాస్త్రీయము.

3

శృంగారశబ్దమునకు హృదయసంవాదమను అర్థము చెప్పుటవలననే భోజాదులు రస సార్వభౌమత్వమును శృంగారమునకు ప్రతిపాదించినారు. "సర్వభావములు కామమునుండియే నిష్పన్నము లగుచున్నవి. ఇచ్ఛాగుణ సంపన్నమగు కామము బహుధా పరికల్పితము కాగా ధర్మకామము, అర్థకామము, మోక్షకామ మనునవి వచ్చుచున్నవి. స్త్రీ పురుషుల సంయోగము రతి సంభోగకారకమై శృంగారమనబడుచున్నది" అని భరతుడే పలికినాడు. వ్రత, నియమ, తపోయుక్తమై, ధర్మసమాపకమై, ఆత్మహితమగునది ధర్మశృంగారము. ఇచ్ఛాయోగమున సంప్రాప్తమగునది అర్థశృంగారము. కన్యావిలోభన కృతమై, రమ్యమై, స్త్రీ సంప్రయోగ విషయకమైనది కామశృంగారము. ఇట్లే మోక్షశృంగారము కూడ గలదని భరతుడనినాడు. ప్రమాతృ ప్రమేయములకు సిద్ధమగు అభేద ప్రతిపత్తిని తీసికొని రాగల హృదయసంవాదమే ఇక్కడ శృంగారశబ్దమున కర్థమగుచున్నది.

ఏవం విధమగు శృంగార మొక పురుషార్థము. ప్రయోజనవంతమగు మానవప్రవృత్తి నిష్ఠములు పురుషార్థములని చెప్పియున్నాము. సత్యము, ధర్మము, సౌందర్యము, భక్తి యను పురుషార్థములన్నియు నొకే ఒక తత్త్వమున పర్యవసితము లగుచున్నవి. అనుపహితమగు తత్త్వము దేశకాలాద్యుపహితము కాగా సందర్భ భేదమననుసరించి ఈ నాలుగు పురుషార్థములు వచ్చుచున్నవని "ఫోల్కెల్ట్" (*Volkelt*) చెప్పుచున్నాడు. అనుపహితమగు ఆత్మానుభూతి నుద్దేశించిన కామనయే అన్ని ప్రవృత్తులయందు సామ్యముగా కన్పించుచున్న దనవలెను. ముముక్షువై కామమును వదలినానని ఎంచువానికిగూడ మోక్షరతి గలదని:

"మోహం (=కామం) ప్రయతతే హంతుం
మోక్షమాస్థాయ పండితః
తస్య మోక్ష రతిస్తస్య
నృత్యామిచ హసామిచ"

అని అశ్వమేధపర్వమున గలదు. ఆత్మరతి, ఆత్మతృప్తి, ఆత్మతుష్టి గలవాడు ప్రవృత్తిరహితు డగుచున్నాడని గీతకూడ చెప్పుచున్నది. ఇట్టి శృంగారము నభివ్యక్తము చేయు కావ్యమున సత్యోత్తమమగు అనుభూతి కలదని స్పష్టము.

"శ్రేయః పుష్పఫలం కాష్ఠా
త్కామో ధర్మార్థయో ర్వరః
కామో ధర్మార్థయో ర్యోనిః
కామ శ్చాథ తదాత్మకః"

అని శాంతిపర్వముకూడ ధర్మార్థములకు హేతుభూతము, ధర్మార్థసంవలితము నగు కామమును ప్రస్తుతించినది. ధర్మార్థహేతుకమగు కామము ఆధ్యాత్మికమగుటచే ప్రకృష్ట పురుషార్థ మగుచున్నది. ఇదే శృంగారస్వభావమనినచో, దీనికి పూర్వము ప్రపంచింపబడిన రసస్వభావమునకు భేదము లేదనవలెను. చిత్తసంవాదరూపమగు శృంగారమే రసమనిన, సౌందర్యము, రసము, శృంగారము అభిన్నార్థకములు కాగలవు

రస ముపహితమై, నైశిష్ట్యావగాహి కాగా శృంగారహాస్యాది రూపములతో కన్పించగలదు. ఈ ఉపహితత్వమువలన నే శృంగారాదులు రసమున పర్యవసితములగుచున్నవని, ఈరసము నే శాంత మందు మని చెప్పవలెను. కేవలము సంభోగాశ్రితమగు శృంగారమునకు రసత్వము లేదని మాత్రము ఇచట గుర్తుంచుకొనవలెను. అభిజ్ఞాన శాకుంతలమున మొదటి అంకములో కన్పించు శృంగారము పోనుపోను పరిష్కృతమై చివరకు ఆధ్యాత్మికముగా ప్రకాశించుచున్నది. లౌకికరతి వాసనానువిద్ధుడగు కవి భావనావశమున లోకోత్తరముగా శృంగారమును ప్రదర్శించ గలుగుచున్నాడు.

రసముగు శృంగారము విద్యుదున్మేషమువలె క్షణికముగా భాసించిన రసము కాజాలదు. స్థావరముగా నుండవలెనని పరిసరములలో మార్పులు కన్పించినను శృంగారములో పరిణామము కన్పించరాదు. సంఘర్షణ కలిగినను చెదరకుండా నుండవలెను. ఇట్టి సంఘర్షణమే విప్రలంభమున కన్పించుచున్నది. కావుననే విరహము లేకుండా ప్రదర్శింపబడు శృంగారము హ్రస్వము కాజాలదని అభినవగుప్తుడు పలికినాడు. విప్రలంభమున [illegible] పేక్ష భావములో కరుణరస మంత [illegible] ది.

ఏవంవిధమగు శృంగారమున మాధుర్యము విశిష్టముగా కన్పించును. పరప్రహ్లాదనము, మధురము నగు రసము శృంగారము. ఈ రసమయమగు కావ్యమున నే మాధుర్యము కలదని ఆనందవర్ధను డనినాడు. విప్రలంభమున మాధుర్యమెక్కుడుగా గలదని, కరుణలో నింకను ప్రకర్షగలిగియుండునని చెప్పనాడు. మాధుర్యమున మనస్సు అర్ద్రీభావము కలిగియుండును. ద్రవీభూతమగు చిత్తము సత్త్వమయమై ఆత్మవికాసము ననుభూతము చేయగల్గుచున్నది. రాగిత్వము, అనావిష్టాత్మకత్వము అనునవి చిత్తమును వదలగా కలుగు నిజసత్త్వమయావస్థయే మాధుర్య ప్రతీతిలో గలదు. దీని నే రసచర్వణ యని పలుకుచున్నాము.

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాదకుండ తెల్లగా మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



"చూచారా నా తువ్వాలు ఎంత తెల్లగానుందో; అందుకు కారణమేమంటే అది సన్ లైట్ సబ్బుతో ఉతుకబడుటచేతనే. సన్ లైట్ నుండి త్వరగా వచ్చు నురగలు మలినమును పోగొట్టును. సన్ లైట్ తో ఉతుకుటవలన మీ బట్టలు మిక్కిలి శుభ్రముగాచేయబడుటచే అవి తళతళమని మెరయునంత తెల్లగానగును!"



"ఈదుటవలె మరేదియును నన్ను హాయిగా మంచదు. రంగు బట్టలను సన్ లైట్ సబ్బు శుభ్రముచేసేటట్టు మరేదియునుచేయదు. సన్ లైట్ యొక్క మృదువైన నురగ బట్టలను బాదకుండగనే వాటిలోని మలినమును పోగొట్టును— సన్ లైట్ మీ బట్టలను మృదువుగా ఉతుకుటచే మీ బట్టలు చాలకాలము వచ్చును.




S. 221-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

కథానిక

# * అందని లోతులు *

శ్రీ యస్. ఆర్. నంది

ఒకొక్కటే మెట్లుదిగి రోడ్డుమీద పాదం పెట్టే సరికి, శరీరంలో రక్తమంతా పాదరసంలా పరుగులు తీసింది నరనరాల్లోను. లిప్తపాటు లోకంలో వెలుగంతా గభ్భున మాయమై చిక్కటి నల్లని చీకటి తెరలు తెరలుగా ప్రాగి, క్రమేపీ వివర్ణమై యెదుటి ప్రపంచం నీడల్లా కళ్లల్లో ఆ నేసరికి, జగన్నాథం సిగ్గుపడి చప్పున కదలిపోయాడు ముందుకి.

ఎగుటపడే ప్రతీవాహనం, నడచిపోయే ప్రమనిషీ శకుంతలలాగే అగుపించారు; జట్కాల టక టక, కార్లమోత, రిక్షాల గంటలచప్పుడు ఆ అమ్మాయి మాటల్లా వినిపించేవి! ఆ పాదమస్తకం కంపించిపోతూ, చెమటలు కక్కుకుంటూ కొంత దూరంపోయి ఉద్వేగాన్ని అణచుకొని, వేగాన్ని తగించాడు.

కాలేజీనించి వస్తున్న అమ్మాయిలు అగుపించారు చేతుల్లో పుస్తకాలతో: నిన్న మొన్నటి వరకు శకుంతల గూడా అలానే పుస్తకాలు పట్టుకొని వెడుతూ వుండేది.

ఏడెనిమిదేళ్ల క్రితం శకుంతల తనతో మాటాడుతున్నపుడు తనలో ఎలాంటి మార్పూ కలగకండా, ఈవాళ మొదటి చూపులో, మొదటి మాటలో, మొదటి నవ్వులో తన కింత వింత పులకరింత కలగడం ఏమిటి!

అప్పుడు ప్రసాదరావు అంటూ వుండేవాడు: మా చెల్లెలు యూనివర్సిటీలో చదువుతోందని. కాని అప్పుడు తనా మాటని అంత లెఖ్ఖలోకి తీసుకోలేదు; అలాంటి నిర్లక్ష్యానికి ఈవాళ జగన్నాథం చాలా నొచ్చుకున్నాడు.

రోడ్డుమీద తన కాయాన్ని ఈ పారవశ్యం మోసుకపోతున్నట్టు జ్ఞాపకం లేదు. అప్రయత్నంగా ఓ మలుపుదగ్గర ఆగిపోయాడు. శరీరం వేపు చూసుకున్నాడు. అదోలా బాధతో సిగ్గుపడ్డాడు. మాసిన గడ్డం, మాసికల గుడ్డలు, అరిగిన చెప్పులు ఈ అవతారంతోనే ప్రసాదరావు యింటికివెళ్లాడు.

నిజానికి ఆ రూపవతి ఆవాళ మెయిల్లో వచ్చినట్టు తెలీదు. ఆఫీసునించి విసుదలై దొర్లుకొంటూ వచ్చేస్తూ వుంటే వాకిట్లో ప్రసాదరావునిచూసి పలకరించిపోదామని అడుగులదుక్కాని పక్కకి తిప్పి ఇటు వచ్చాడు. ఎదురుగా ఆడనవ్వు; నమస్కారం చేస్తూ అగుపించింది. క్షణంపాటు గుర్తుపట్టలేక తేరి పార చూశాడు తను ఆ శిల్పాన్ని. ఆచూపు, అబ్బ, తలచుకొంటే ఎంత వికారం అనిపించింది! ప్రతి నమస్కారంగూడా చెయ్యలేదు. మర్యాద తెలియని అడివిమనిషి అనుకొంటుంది. ఆ సోఫాలోనైనా సరిగ్గా కూచోలేకపోయాడు; స్ప్రింగిస్తున్న సోఫాగూడా తన అనాగరికతను అర్థంచేసుకొని నవ్వుకొనివుంటుంది! ఇచ్చినటీని మర్యాదకోసం తాగనన్నాడు. టీ తాగక పోవడం మర్యాదా? ఇంట్లో టీ లేకపోతే నిప్పులు తొక్కిన కోతి అవుతాడుకదా—

"అలవాటులేదా—అదృష్టవంతులు" అంది శకుంతల నవ్వుతూ, తళతళలాడే పళ్లు సగానికి కనిపించేటట్టు.

టీ తాగడం చేతకానివాడా తను? ఇంకానయం, ఏంచేస్తున్నారని అడిగింది కాదు. ఒకవేళ అడిగితే ఏమిటి చెప్పాలి? బి. ఏ., పోయింది. పూర్తి చెయ్యడానికి పేదరికం కండలు తిరిగిన వస్తాదులా ఎదురుగా నిలబడింది. జడిసి, నోరుమూసుకొని గుమస్తా ఉద్యోగాన్ని కావలించుకోవాలిసొచ్చింది-అనేనా? సిగ్గుకాదు. ఛఛ!—ఆనర్స్ పాసైవచ్చిన మగువదగ్గర.

బి. ఏ., ఆనర్స్! ఆడవాళ్లుగూడా పాసైపోతున్న పరీక్ష తను పాసవలేకపోవడం తలుచుకొని లజ్జ చెందాడు. అసలు ఆ యింట్లో వాతావరణమే వేరు. చక్కని సంప్రదాయం, అందుకు తగిన వాతావరణం ఇంకా యింకా ఎన్నో వున్నాయి ప్రతిభావంతమైన వ్యక్తిత్వాన్ని రూపొందించటానికి. ప్రసాదరావు డాక్టరు, వాళ్ళ నాన్నగారు పేరు మోసిన న్యాయవాది. వాళ్ళ నాన్నగారు సంస్కృతాంధ్ర భాషాకోవిదులు, మాతామహులు, ప్రపితామహులు అంతా ఆ కోవకి చెందినవాళ్ళే. ఇప్పటికీ ఆ యింట్లో అనువాయితీప్రకారం సదా రాజకీయ, సాంఘిక, సాహిత్య చర్చలు జరుగుతూవుంటై.

అదో ఆదర్శకుటుంబం, ఉత్తమ సభ్యతగలవంశం, పైపెచ్చు అగర్భ శ్రీమంతులు.

మరి తను? శీర్షాసనం వేసి చూ: వుంటామో దృశ్యాలు, అలానే వుంటాయి తన పరిస్థితులు, తను పెరిగి తిరిగిన పరిసరాలు. వాళ్ళ వంశంలో ఎందరు గొప్ప విద్వాంసులున్నారో, తన వంశంలో అందరు మూర్ఖాగ్రేసరులున్నారు; తనింట్లో జరిగేవి రాజకీయ చర్చలు, సాంఘిక చర్చలు, సాహిత్యచర్చలు కావు—ఇరుగు పొరుగు ప్రజల పోకడలగురించి సర్వదా జరిగే పిచ్చాపాటి కాకమ్మ కబుర్లు; వాళ్లెంత ధనవంతులో తను అంత...

ధనానికి ఉత్తమసంస్కృతికీ సంబంధమేమిటో పిచ్చిగాని!

తను ఆశించేదీ అదే: తన ఆశయాలకీ, ఆదర్శాలకీ ఓ స్వరూపం కలిగించి తన యింట్లో ఉత్తమసంస్కృతిని సృష్టించి, స్థాపించాలనుకొంటాడు. ఇంట్లో వంటకి అంకితమైపోయిన తల్లికి, పోకిరీ కుర్రాళ్లతో తిరిగే తమ్ముళ్లకీ ప్రపంచంగురించి చెప్పి వాళ్ళని మేధావులుగా తయారుచేయాలని ఉబలాటపడుతుంటాడు. కాని—

ప్రసాదరావులా తను ధనవంతుడు కాడు; వాళ్ళవంశంలా తన వంశంలో విద్యావంతులు, మేధావులు లేరు యింతకుముందు యిప్పుడూగూడా; వాళ్లలాంటి పెద్ద భవంతి లేదు; అద్దెకొంప, కార్లషెడ్డు!

ఎంత అంతరం తనకీ వాళ్ళకీ!

## 2

ఇంటికి వచ్చేసరికి యింట్లో వాతావరణం మహా చిరాకుని, కోపాన్ని కలిగించింది.

ఎక్కడుండవలసిన వస్తువులు అక్కడుండవు. దండెంమీద వుండవలసిన గుడ్డముక్కలు కింద పొర్లుతూవుంటై; మాసిన చీరలు తోరణాల్లా తలుపు రెక్కలమీద వేలాడుతూవుంటై; ఎప్పుడో—మధ్యాహ్నం తిన్న ఎంగిలిగిన్నెలులాగుంది—అలా నేవుంటై ఎండిపోయి.

వీటన్నిటికీ తోడు ఈవాళ తమ్ముడు కాళ్లు నేలకేసి కొట్టుకుంటూ ఆమూల వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. వాడి వాలకం చూసి మరిక ఆవేశం ఆగింది కాదు జగన్నాథరావుకి—చప్పున వెళ్ళి కారణమన్నా అడక్కుండా రెక్కపట్టుకొని యెత్తి నాలుగు తగల్నిచ్చాడు. వాటిని తినేసి కాళ్ళకి బుద్ధి చెప్పాడు వాడు.

అదే సమయంలో తల్లివంటింట్లోనించి రంగం మీదికి వచ్చేసరికి అగ్గిమీద గుగ్గిలం పడ్డట్టయింది.

"ఏమిటే యిల్లంతా? పందులపాకలన్నా యింత ఛండాలంగా వుండవ్—ఛీ ఛీ!"

ఏదో చెప్పబోతున్న తల్లి అలానే నోరావులించి వుండిపోయింది.

"వాడలా యిల్లెగరగొట్టేస్తోంటె చూసేందుకైనా నీకు తీరికలేదు!" కోపం మారి చిరాకులో పడింది.

"బాగుందిరా, నేనుమాత్రం చూసుకోవటం లేదూ? ఇలా శుభ్రం చేసివస్తే అలా యిల్లు నానా పాడూ చేసేస్తుంటే నన్నేం చెయ్యమంటావ్?" అందావిడ.

"ఏం చేస్తావ్!...ఆ ఎంగిలిగిన్నెలు గూడా వాళ్ళే వుంచేశారు కదూ?"

ఆవిడకేం చెప్పడానికి తోచలేదు. చప్పున గిన్నెలెత్తి లోపలికి వెళ్ళిపోయింది.

తలపట్టుకొని "ఛీ ఛీ" అనుకొంటూ అలానే కూలబడ్డాడు—ఇక్ష్వాకుల కాలంనాటి డొక్కు కుర్చీలో.

తల్లి సంచి పట్టుకొని లోపలికి రావడంతో ఈ లోకంలో పడ్డాడు.

"ఇంట్లో బియ్యం నిండుకున్నాయి", అంది, తలెత్తి జగన్నాథం చూసేసరికి.

అయితే వెళ్ళాలి బజారుకి...చిరాకుతో సంచి తీసుకొని బయలుదేరాడు.

దార్లో తారసిల్లే రకరకాల వైరుధ్యాలు: సిల్కులు, చింకి బొంతలు; నవ్వులు, ఏడ్పులు; రిక్షాలు, కార్లు—వీటి మధ్యా, వీళ్ళల్లోను తనూ ఓ మనిషి. వీళ్ళందరిలో తను గొప్పవాడు; తనకో ప్రత్యేకస్థానముంది; తన వ్యక్తిత్వం అత్యుత్తమమైనది...ఎందుకో?!

ఆగిపోయాడు రోడ్డు మధ్య చప్పున సమాధానం చెప్పుకోలేక.

నవ్వొచ్చింది! లోలో నవ్వుకొన్నాడు. నడక ప్రారంభించాడు. ఇందరు మనుష్లలో తనే గొప్పవాడన్న భావం యెందుకు కలిగిందో విచిత్రం!...

తనని యింతకుముందు ఎవరైనా పొగిడారా?...... వెంటనే జ్ఞాపకం రాలేదు...

ఒకటొకటిగా మరుపుమసితల కిందనించి మరచిన జ్ఞాపకాలన్నిటినీ దులిపి మనసులో చూసుకొన్నాడు.

ప్రసా...ఆః....శకుంతల!...నవ్వు—తియ్యనిది; కంఠం—కోయిలది; అందం—అప్సరసది; వాక్కు—మృదువైనది; ఉన్నత భావాలు.

భావావేశం నడకలో ప్రతిఫలించింది. హోటలు రేడియోలోనుంచి వినిపిస్తున్న సినిమా పాట మరింత త్వరితపరచింది.

వడివొచ్చిన నడకకు తనే సిగ్గుపడ్డాడు. తనని దిక్కుమాలిన మనుషులు చూస్తే గీస్తే ఏమనుకొంటారు? అ అనుకునే వాళ్లెవరో తనని లక్ష కళ్ళతో చూస్తూ నవ్వుతున్నట్టు బిడియపడ్డాడు. నడకలో తొట్రుపాటు వచ్చింది ఫలితంగా.

శకుంతల జ్ఞాపకం, బియ్యాన్ని బేరమన్నా ఆడనివ్వకుండా కొలిపించేసింది.

తను యిలా బజార్లో శేరాలాడుతున్నట్టు శకుంతల చూస్తే ఏమనుకొంటుంది? 'పొట్టకోసం ఎలా మామూలు మనిషిలా బేరాలాడుతున్నాడో! చవకపారు రకం అనుకోదు? ఎంత సిగ్గు!...వళ్లంతా జలదరించింది. నిటారుగా లేచి చూసుకున్నాడు పరీక్షగా కుడి ఎడమలకి. చిమ్మచీకట్లు వ్యాపించాయి.

బియ్యంతో యింటికొచ్చాడు.

గదులన్నిటినీ పొగ గాఢంగా కౌగిలించుకొని నవ్వుతోంది. రోజూ కనిపించే దృశ్యమే—అయినా ఈవాళ ప్రత్యేకమైన కోపం వచ్చింది—ఆ పొగ మీదా, తల్లిమీదా!

"అబ్బబ్బ! మనుషులు వుండా లంటారా, చావా లంటారా ఈ వెధవ పొగలో."

వంటింట్లోనించి తల్లి బయటకు వచ్చింది:

"పచ్చిమోడులు, నా తలకాయ, రాజు తేనా? ఎప్పటినించి చస్తున్నాను."

"ఆ చావడంబదులు బొగ్గుపొయ్యి పెట్టరాదూ" అంటూ అరిచాడు, నెలకి డెబ్భయ్యేరూపాయలు సంపాదించే గుమాస్తా.

ఇలా, ఈ                కస్మాత్తుగా శకుం
        చ్చస్త        పొగని, ఈ గుడ్డముక్కల్ని, కుక్కిమంచాలని, ఈ పిల్లల్ని, ఈ పాడుకొంపనీ చూసి—'ఛీ ఛీ, అసహ్యం, ఏహ్యం' అని డోక్కుంటూ తిరిగిపోదూ? శరీరం కంపించింది సిగ్గుతో.

రోజులు గడుస్తున్నకొద్దీ జగన్నాథం ప్రసాదరావు కుటుంబంతో మరీ సన్నిహితుడవుతున్నాడు. పరితూగుతూ కనిపించడానికి ప్రయత్నించేవాడు. ఒకనాడు పదిరూపాయలు ఖర్చుచేసి పిక్చరు చూపించాడు వాళ్లకి. అది తనకి తృప్తి కలిగిస్తుందనుకున్నాడు—కాని యింట్లో రెండు మూడు రోజులు తిండిఖర్చు తగ్గించుకోవలసి వచ్చేసరికి ఆ ఉల్లాసం యింట్లోవాళ్లమీద కోపంగా మారింది.

శకుంతల ఓసారి అంది: జగన్నాథంగారింటికి వెళ్ళాలి అని.

రావడం, పోవడం స్నేహధర్మమే అయినా జగన్నాథం గుండెల్లో ఫిరంగులు పేల్చినట్టయింది. తమ స్నేహంలో అంతస్థుల భేదాలున్నాయని తెలుసు. దానిని సమర్థించుకోడానికి 'మానవత్వానికి యివన్నీ యెందుకనే సుభాషితాలు మాటాడేవాడు. శకుంతల తన యింటికి వస్తానని అన్నపుడు ఆ సుభాషితం నిజానికి తను ఆచరణలో పెట్టాలి—కాని ఆమె తనింటికి వస్తే ఆ యిల్లుని చూసి అసహ్యించుకోవచ్చునని భయపడ్డాడు, బిడియపడ్డాడు: తన పేదరికం ఆవిడకు తెలీకూడదు.

మనిషి ఆశలకు ఒక్కొక్కప్పుడు ఔచిత్యానౌచిత్యాలుగూడా అగుపించవు. తను ఏ శకుంతలని తన యింటికి తీసుకరావడానికి సిగ్గుపడ్డాడో ఆ శకుంతలనే ఆయింటి కోడలుగా స్వీకరిస్తే యెంత బావుంటుంది అని ఉవ్విళ్లూరాడు. కాని అది యెంత అడియాసో వెంటనే తెలిసిపోయింది. ఆమెతో తనకున్న పరిచయాన్ని, స్నేహాన్ని ఆధారంగా తీసుకొని ఒకనాడు తనలోని అభిప్రాయాన్ని వెల్లడిచేశాడు:

"నిన్ను ప్రేమిస్తున్నాను శకుంతలా" అని—వెంటనే శరీరంలో రక్తమంతా మెదడులో కేంద్రీకరించినట్టు ఈ మాటలమీద మరింత ఉద్వేగాన్ని, ఉద్రేకాన్ని స్ఫురింపచేసింది.

శకుంతల నిర్ఘాంతపోవడం చూసి, మెదడులో రక్తమంతా పాదాల్లోకి పరుగులుతీసింది. గుండె మెషిన్‌గన్ మాదిరి కొట్టుకోసాగింది.

"క్షమించు జగన్. నీకిలాంటి అభిప్రాయం వుందని నే నెప్పుడూ అనుకోలేదు" అంది తల వంచుకొని.

నిలువునా చచ్చినంత పనయింది. బయటకు వచ్చేశాడు ముఖం దాచుకొని.

ఇంత పెద్ద 'షాక్' తగిలిన తర్వాత తన ముఖాన్ని ప్రసాదరావుకి గాని, శకుంతలకు గాని చూపించడం యెలా? ప్రసాదరావుకి తెలిస్తే యేమను కొంటాడు? రేపటినించి శకుంతల యెలా చూస్తుంది?

తన ఆశలో తప్పులేకపోవచ్చు. శకుంతల తన యింటికివస్తే తనింట్లో పెద్ద సాంస్కృతిక విప్లవం వచ్చి తన యిల్లు బాగుపడుతుందనే కాంక్ష - కాని శకుంతల గగనకుసుమని తెలిసిరాలేదు, పాపం, ఆ క్షణంలో.

ఇంటికి వచ్చేసరికి తను వూహించలేని విషయం సిద్ధంగా వుంది. తల్లి నవ్వుతూ ఆహ్వానించింది; కుర్చీలో కూచున్న పెద్దమనిషీ నవ్వుతూ ఆహ్వానించారు; ఇంట్లో చాపలమీద కూచుని మాటాడు కుంటున్న ఆడవాళ్లు చప్పున ముఖాలెత్తి చూశారు. ఈ వాతావరణంలో మాసినగుడ్డలు, తమ్ముళ్లి యేడుపులు, ఎంగిలిగిన్నెలు, పొగ—ఏవీ కనిపించలేదు. —అన్నీ ఆనందంతో, ఉల్లాసంతో, సంతోషంతో "రావయ్యా కొత్తపెళ్ళికొడకా" అన్నట్టు ఆహ్వానిస్తూవున్నాయ్. జగన్నాథం శరీరం జలదరించింది.

అమ్మాయి అందంగా వుంటుంది; సంగీతం వచ్చు; గౌరవం మర్యాదా వున్న కుటుంబమే వాళ్ళది; చురుకైన పిల్లట; ఇంటర్మీడియట్ వరకు 'ఏదో' చదువుకొందని కాబోయే మామగారు దీర్ఘం తీస్తూ చెప్పారు.

జగన్నాథం నోటికి తాళం పడ్డది; కట్నాలు గిట్నాలు లాంటివేం లేకండానే పెళ్లి నిశ్చయమయింది.

ఇంటర్మీడియట్ వరకు చదువుకున్న సుగుణతో శకుంతలమీద కోపాన్ని తీర్చుకోవాలనుకొన్నాడు. సుగుణతో తన యింటిని పూర్తిగా మార్చివేయాలనుకొన్నాడు. తన భావాలని, అభిప్రాయాలని సుగుణకు చెప్పి తన యింట్లోకి స్వర్గాన్ని రప్పించుకోవాలనుకున్నాడు.

పెళ్ళయిపోయింది.

పెళ్లినాటివరకు జగన్నాథం ప్రసాదరావింటికి వెళ్లలేదు. పెళ్లికి శకుంతలవాళ్లూ వచ్చారు; సుగుణని చూసి శకుంతల అసూయపడాలనుకున్నాడు పెళ్లి కొడుకు తాళికడుతూ. తలంబ్రాలు పోసేటప్పుడు అదోలా శకుంతలవేపు చూశాడు.

పెళ్లి అయిపోయాక శకుంతల వచ్చి—

"నువ్వు అదృష్టవంతుడవు జగన్" అని ఆవిడ యిచ్చిన దీవెన తన విజయానికి చిహ్నమనుకున్నాడు మానవుడు!

సుగుణ కాపరానికి వచ్చింది.

పూర్తిగా పరిచయం కాని ఈ ఆగంతకురాలి దగ్గర జగన్నాథానికి ఏ పని చెయ్యాలన్నా సిగ్గనిపించేది. తను భోంచేస్తున్నపుడు సుగుణ ఎదురుగా నిలబడితే యిహ నా ముద్దలు గొంతుక దిగేవి కావు; స్నానం చేయాలిసొచ్చినపుడు దగర్లో సుగుణ వాసన తగలకూడదు.

సుగుణ పెద్దకుటుంబంలో పెరక్కపోయినా కొత్తవాళ్ళతో యెలా మాటాడి స్నేహాన్ని సంపాయించాలో, నలుగుర్లో ఏవిధంగా మసులుకోవాలో, ఏ పరిస్థితుల్లో ఎలా సర్దుకోవాలో తెలుసు. ఈ చురుకుదనం శకుంతలతో గాఢ స్నేహానికి పునాదులు వేసింది.

అయితే సుగుణ శకుంతలని అంతగా పడి పడి ఆరాధించడం జగన్నాథానికి నచ్చలేదు. అసలు వాళ్ళిద్దరికీ పరిచయం చెయ్యకూడదనుకొన్నాడు. కాని శకుంతలే ఓనాడు తన యింటికి రావడంతో తన పంతం నెగ్గిందికాదు. మళ్ళా సుగుణ ఆ ఇంటికి వెళ్ళడం—ఈ రాకపోకలతో వాళ్ళ స్నేహం మరింత వృద్ధిపొందింది.

సుగుణ కాపరానికి వచ్చినతర్వాత జగన్నాథం యింట్లో పైకి చాలా మార్పులు వచ్చాయి. ద్వారాలకి, కిటికీలకి తెరలు; మధ్యగది చిన్నదే అయినా ఓచిన్న టేబిలు, రెండు మూడు కుర్చీలు, ఫ్లవర్ వేస్, గోడలకి చిత్రాలు, యిలా వాతావరణం మారింది. ఈ మార్పు జగన్నాథాన్ని కొంత తృప్తి పరచింది. తమ్ముళ్ళు గూడా కాస్తంత యింటిపట్టునుండి వదిన చెప్పే చదువు శ్రద్ధగా చదువుకొంటూవున్నారు. భారతానికి అలవాటుపడ్డ తల్లి కోడలు చదివి వినిపించే కొత్త నవలలు శ్రద్ధగా వింటోంది. సుగుణ తీసు

కొచ్చిన విప్లవం యెంతటిదో జగన్నాథానికి అర్థమయింది.

ఓనాడు ఆఫీసునుంచి త్వరత్వరగా వచ్చిన జగన్నాథం :

"టౌన్ హాల్లో సాహిత్యసభ జరుగుతోంది. త్వరగా నువ్వూ బయలుదేరు" అన్నాడు.

కాఫీ కాస్తున్న సుగుణ కాసేపు పూరుకొని మెల్లగా అంది: తను రాలేనని.

"ఏం?" అన్నాడు జగన్నాథం విస్తుపోతూ.

సమాధానం సుగుణ చెప్పలేదు వెంటనే.

సాహిత్యసభలకి వచ్చేవాళ్లందరూ ముఖ్యంగా మగాళ్లేవుంటారు. వాళ్ళమధ్య కూచుని (ఆ సాహిత్య చర్చలు అర్థమవడం, అవకపోవడం ఆతర్వాత మాట) వినడమంటే చచ్చినంత పని. పుట్టింట్లో వున్నపుడు తను యిలాంటి సభలూ, చర్చలూ చూసి ఎరగదు; అన్యాయాలయినా చూపిస్తాం రమ్మనే మనుషులు కారు; కాలేజీలో చదివిన రెండేళ్ళయినా ఒక్క ఏనవర్సిరీకే వెళ్ళగలిగింది: అదీ నలుగురు సహపాఠినులు బలవంతంచేస్తే. అలాంటి తను ఈనాడు ఒక్కసారిగా ప్రపంచం మధ్యలో కూచోమంటే, అది కంటకప్రాయంగానే తోస్తుంది మరి.

"శకుంతల వస్తోందా?"

ఈ ప్రశ్న జగన్నాథానికి మహా చిరాకుని కలిగించింది.

"ఏం, ఆవిడొస్తేనే గాని రాకూడదా?"

"అహాఁ అదికాదు"—ఏదికాదో సుగుణ సమాధానం చెప్పకోలేని సందిగ్ధంలో పడిపోయింది. కాని జగన్నాథం ముఖంలో స్పష్టంగా వ్యక్తమవుతున్న చిరాకుని, ఏవగింపుని గ్రహించి, గుండె బితుకు బితుకు మంటున్నా 'సరే' అనేసింది.

సభనించి యింటికి తిరిగివచ్చిన తర్వాత ఆలుమగల ముఖాల్లో రక్తపుచుక్క అనేది లేకండా తెల్లగా పాలిపోయివున్నాయి.

సుగుణ తిన్నగావెళ్లి పక్కమీద వాలిపోయింది—తలనొప్పికి తట్టుకోలేక. అత్తగారు వచ్చి కాస్త ఎంగిలిపడమన్నా మాటాడిందికాదు. ఇటు కొడుకు గూడా ముఖం మాడ్చుకొని కూచున్నాడు. వాళ్లిద్దర్లో మరేం జరిగిందో ఆవిడకు అర్థంకాక లోపలికి వెళ్లిపోయింది.

రాత్రి బాగా చీకటిపడ్డాక జగన్నాథం పడకగదిలో సుగుణ పక్కమీద కూచునివుంది. కళ్లు బాగా చెమ్మగిలివున్నాయి. భర్తనిచూసి దప్పున లేచి తలవంచుకొని మెల్లగా అడిగింది :

"మీకు కోపం వచ్చినట్టుంది"

సమాధానం లేదుకాని వికృతమైన నిట్టూర్పు వినిపించింది. క్షణం నిశ్శబ్దం తర్వాత—

"ఇంతో అంతో చదువుకున్నావ్, ఆమాత్రం యింగితం వుండక్కర్లా? మగాళ్ల పక్కన కూచున్నంతలో వాళ్లు నిన్ను చంపుకతినేస్తారనేనా అంతలా ముఖం ముడుచుక కూచున్నావ్!" అన్నాడు.

సుగుణ మౌనంగా తలవంచుకొంది.

జగన్నాథం యింతగా కష్టపడ్డాడేగాని, నిజానికి అక్కడ జరిగిన సంఘటన అంతబాధాకరమైంది కానేకాదు. తనకి తెలిసిన ఇద్దరు ముగ్గురు స్నేహితులతో సుగుణని పరిచయం చేశాడు. కాని, ముందు సీట్లలో కూచున్న ఆఫీసర్లు, ప్రొఫెసర్లు, పెద్దమనుషులతో పరిచయం చేయలేకపోయాననే అనే బాధ, మగాళ్లపక్కన కూచోడానికి సుగుణ తటపటాయించినపుడు కోపంగా మారి, ఉపన్యాసం జరుగుతున్నంతసేపూ విసుక్కునేట్టు చేసింది; సుగుణ చాల బాధపడ్డది; ఉపన్యాసమని సాహిత్యవిమర్శగూడా సరిగా వినలేకపోయింది. ఇక యింటికి వస్తూ దార్లో ఎంతగా చీదరించుకోవాలో అంతగానూ చీదరించుకోవడంతో సుగుణకు దుఃఖం ఆగిందికాది.

## 5

ఇలాంటి విచిత్ర సంఘటనలు జరుగుతూనే వున్నాయి వాళ్ళ జీవితంలో—జగన్నాథం విసుక్కుంటూనే వున్నాడు; కాని తన గుండెల్లో జ్వాలలు రేగే ఆ భావాల్ని విప్పిచెప్పడు ఎవరికీ.

శనివారంనాడు యెప్పుడూ ప్రొద్దుట తల్లి ఉపవాసం వుండటం పరిపాటి. ఆవాళా పూజాపునస్కారాలయిన తర్వాత శివకోవెల్లో హరికథా కాలక్షేపానికి ఆవిడ వెళ్ళిపోయింది. కోడలు యింట్లో వంటాగట్రా చేసిపెట్టింది. ప్రొద్దుట చన్నీళ్ళల్లో స్నానం చేయటంవల్ల కాబోలు సుగుణకు మధ్యాహ్నమయ్యేసరికల్లా తలనొప్పిపట్టుకొంది. అది రానురాను భరించరానిదయింది. జగన్నాథం తమ్ముళ్లిద్దరు భోజనాలకు వచ్చారు. వదినకు సుస్తీగా వుందని తెలుసుకొని

వాళ్లే వసారాలోకివెళ్ళి యింత వడ్డించుకొని, తిన్నంత తిని ఎంగిలి గిన్నెలు అక్కడే విడిచిపెట్టి ఆటకి పోయారు.

రెండు గంటలకి జగన్నాథం యింటికి రావడంతో యిల్లు యెలా వుండాలో అలా వుంది. కడుపులో ఆకలి, ఆఫీసు చిరాకు, ఈదృశ్యానికి మరింత ఉడుక్కున్నాడు. ఎదురుగా తల విరజిమ్ముకొని నిద్రపోతున్న సుగుణని చూసి ఆ ఉడుకుమోత్తనం ఆవేశపడిపోయింది. ఊర్ధ్వస్వరంతో యిల్లెగిరిపోయేట్టు అరిచాడు :

"సుగుణా!"

సుగుణ ఉలిక్కిపడి కళ్లు విప్పింది. లేవడానికి ప్రయత్నించింది జగన్నాథం కనిపించగానే. కాని తలంతా దిమ్ముగా వుండటంవల్ల లేవలేక అతనివేపు ప్రశ్నార్థకంగా చూసింది.

"ఏమిటే యిల్లంతా? ఎంగిలి గిన్నెలు చూసే తీరుబాటున్నా లేదా?"

అతని కోపానికి సుగుణ భయపడ్డది. లేవబోయింది కాని తలలో పోటు మరింత ఉధృతంకావడం వల్ల ఆ ప్రయత్నమే చెయ్యలేకపోయింది. మెల్లగా అంది:

"నేను చూడలేదు. వా[illegible]ంచుకుని వెళ్ళి పోయినట్టున్నారు!"

తన నీరసపు మాటల్ని అర్థంచేసుకోగల మనుకొంది గాని, జగన్నాథం ఆ వ్యక్తిని పరీక్షగా చూసే స్థితిలో లేడు.

పిల్లల కింత ముద్దపడేసే తీరిక గూడా లేదన్న మాట!" అంటూ ఆవేశంతో ఒక్కవూపున చొక్కా విప్పేసరికి చమటకి తడిసివుందేమో బర్ మంది; అగ్గిలో ఆజ్యం పడ్డట్టు—ఇక దాన్ని పూర్తిగా తీయకండానే చింపేసి విసిరేశాడు.

సుగుణ చాల బాధపడ్డది. ఓపికచేసుకు లేచింది. ఆ బాధలో తనకూ కోపం ఆగిందికాదు.

"అంత కోపం వస్తే నన్నే ఆ నాలుగూ అనేస్తే పోతుందిగా, నిష్కారణంగా ఆ చొక్కా చించుకొంటే వొచ్చే లాభమేమిటి?" అంది సగం స్వగతంగా.

గిర్రున తిరిగాడు జగన్నాథం. హద్దులుదాటిన ఆవేశం దౌర్జన్యానికి పూనుకోవలసిందే; కాని సుగుణ ముఖంలో ఏదో అజ్ఞాతశక్తి అతన్ని అంతపనీ చెయ్యనివ్వలేదు; అణగిపోయిన మాటలకి పెదవులు మాత్రం వణికాయి.

సుగుణ వసారాలోకి వెళ్లిపోయింది వడ్డించడానికి. వడ్డించి మధ్యగదిలోకి వచ్చి లేవమంది.

"అవసరం లేదు" అన్నాడు ముక్తసరిగా.

సుగుణ బ్రతిమాలే స్థితిలో లేదు. ప్రతీ విషయానికీ అత నింత వింతగా యెందుకు గంతుతాడో అర్థం కాదు; ఏప్పుడో తనూ హద్దులుదాటి, మాటకి మాట అనెయ్యాలని అనుకునేది. కాని అలాంటి ధైర్యం కలిగే పరిస్థితులేం సుగుణకి కలగలేదు. అయితే ఈనాడు తనవంట్లో భరించరాని బాధమీద భర్త చూపించిన నిర్లక్ష్యం, అధికారం, ఆవేశం, ఆగ్రహం సుగుణ సున్నిత హృదయాన్ని ఉద్రేకంతో వూపి, కదిపి, కలత చెందించేసరికి ఆమెకు దుఃఖం, కోపం రెండూ ఆగాయి కావు.

"మీ కంత అవసరం లేనపుడు నేను బ్రతిమాలి, కాళ్లుపట్టుకొని కంట తడిపెట్టుకొనే పతివ్రతనీ కాదు, ఆదర్శగృహిణినీ కాను. మీ రంత నిర్లక్ష్యం చూపేముందు ఎదటి మనిషికిగూడా కా[illegible] చీమూ నెత్తురూ వుందని మరచిపోకండి."

అలుగుల్లా గుండెల్లో తగిలిన ఈ మాటలకి జగన్నాథం ఆశ్చర్యపడిపోతూ తలెత్తి చూసేలోపల సుగుణ రెండుకళ్లూ అశ్రువులతో నిండిపోయాయి. మాటల వేగానికి తలనొప్పి మరింత తీవ్రమై, ఊగి నేలకు ఒరిగిపోయింది సుగుణ.

జగన్నాథం ఆమె కింద పడిపోయేవరకు తేరుకోలేకపోయాడు! క్షణం క్రితం మనస్సుని కలవరపెట్టిన కోపం, చిరాకు, [illegible] శ్రావణ మేఘాల్లా చెదిరిపోయాయి. చప్పున లేచి సుగుణను లేవదీయబోయాడు.

"అవసరం లేదులెండి" అంటూ మెల్లగా లేచి పరుపుదగ్గరకు వెళ్ళిపోయింది.

సుగుణ అతనివేపు చూడలేదు; ఎవరితోనో మాటాడుతున్నట్టు అంది:

"మనుష్యుల్ని అర్థం చేసుకునేపాటి యింగితం నా భర్తకి లేకపోవడం నా అదృష్టంలా గుంది. ఎక్కడో ఎవరివల్లో పొందిన ఆవేశానికి భార్యని గురిచెయ్యడం గూడా నా అదృష్ట మేలాగుంది"

ఈ వ్యంగ్యానికి జగన్నాథం మరింత కూలిపోయాడు.

సుగుణ గిర్రున తిరిగింది. జగన్నాథం కళ్లలోకి సూటిగా చూస్తూ అడిగింది:

"చెప్పండి: మీ కిష్టంలేకపోతే మా పుట్టింటికి వెళ్ళిపోతాను."

జగన్నాథానికి ఆమెవంక చూసే ధైర్యం లేకపోయింది. గుండె తీవ్రంగా కొట్టుకో మొదలు పెట్టింది.

ఆ ఉద్వేగంలో యింకా ఏవేవో అనవలసిందే సుగుణ, కాని దుఃఖంతో గొంతుక పూడుకుపోవడం వల ఏమనూ లోపలికి వెళ్ళిపోయింది.

నోట మాటలేక జగన్నాథం అలానే కూలబడ్డాడు కుర్చీలో. సుగుణ తలనొప్పి తనకి పట్టుకునట్టుంది: కణతలు నొక్కుకుని కళ్లు మూసుకున్నాడు.

త నేమన్నాడు ? తన మాటల్లో సుగుణకు కోపాన్ని కలిగించె అర్ధమేముంది? ఇల్లంతా గలీజుగా వుందని, ఆఫీసునించి యింటికి వచ్చేసరికి ఈ దృశ్యం తనకి కష్టాన్ని కలిగిస్తుందని అంటాడు గాని నిజానికి తనకు మాత్రం సుగుణని నొప్పించాలని వుందా?

రాత్రి చాలా పొద్దుపోయిన తరవాత పడకగదిలోకి వెళ్ళాడు. సుగుణ మెలుకువగా వుండడం చూసి ఆశ్చర్యపోయాడు; సిగ్గువేసింది కూడా; ఎదురు పడలేకపోయాడు. చాలాసేపు నిశ్శబ్దం, మౌనం. ఆమె తనకు తానుగా పలకరించకపోవడం జగన్నాథానికి పరాభవంగా, పరాజయంగా తోచినా, పశ్చాత్తాప కంఠంతో తనే పలకరించాడు:

"సుగుణా"

"ఊఁ"

"నీ మనసు కష్టపెట్టినట్టున్నాను...?"

"—నిజానికి నిన్ను బాధించాలనే వుద్దేశం కాదునాది" తలెత్తి చూసింది.

"నాకు జీవితమంటె ఎన్నో సదభిప్రాయాలున్నాయి. గౌరవించడం నాకూ తెలుసు. కాని ఎందుకో మీ రెవరూ నన్ను లక్ష్యపెట్టరు—నాకు చాలా కష్టం వేస్తోంది, అలా తలచుకొంటె"

సుగుణ సమాధానం చెప్పలేదు.

ఇంట్లో ఆయన్ని ఎవరూ లక్ష్యపెట్టరు!!! ఏమిటీ వింతశంక!!! ఈయన లేనిపోని ఊహలతో బాధపడే మనిషా? గౌరవించడంలేదని లోలోపల బాధపడటం ఎందుకు? ఇంట్లో ఆయన్ని గౌరవించని వాళ్లెవరు? కనీసం ఆయనమాటకి ఎదురైనా యెవరూ చెప్పరే! మరి ఈ వింత అనుమానం ఆయనలో కలగడానికి కారణం? ఆయన జీవితంలో ఏదో అందని వస్తువుకోసం ఆశిస్తున్నారా? ఆ నిరాశే, నిస్పృహా కలిగించేబాధా, విచారం ఈ రూపంలో వ్యక్తమవుతున్నదా? ఆయన మనసులోవున్న భావాలకి, యింట్లోవాళ్లు కలిగించే వ్యాఘాతంతో ఉద్రేకించి ఎదురుగా కనిపించే ప్రతీవాళ్ళమీదా చిరాకు పడటం: అతనికి బాహ్యప్రపంచంలో కలిగే యెదురు దెబ్బలేమో అని అనుమానించిన సుగుణ అభిప్రాయాన్ని శకుంతలకూడా ధృవపరచింది.

"నువ్వు కొన్నాళ్లపాటు పుటింటికి వెళ్ళిపోరాదు సుగుణా?" అంది శకు.

"ఎందుకు?" అంది సుగుణ

"మీ అత్తగారివంట్లో యిప్పుడెలానూ బాగులేదు. పురుడు అనే సాకుతో నువ్వు త్వరగా వెళ్ళిపోతే యింట్లో పరిస్థితులన్నీ జగన్‌కి కళ్లకి కట్టినట్లు కనిపించి నిజం తెలిసొస్తుంది"

సుగుణ మాటలు అర్థం కాలేదు. అయి మొన్న అత్తగారు వియ్యంకునికి 'అమ్మాయి [illegible] పోసుకుంది పైనెలలో వచ్చి తీసుక వెళ్ళండి' అని రాసిన మాటలు జ్ఞాపకానికి వచ్చాయి అదేవంకతో త్వరగావెళ్ళి అక్కడ నాలుగు నెలలువుండడం సుగుణకి కష్టమనిపించినా, శకుంతల:

"—నీముఖం యిలాంటప్పుడే కాస్త చాటవుతే నువ్వులేనిలోటు, దానివల్ల కలిగే వెలితీ అతనికి తెలిసొస్తుంది." అన్నమాటలకి సరే అని తల వూపింది.

ఆమర్నాడే సుగుణ పుట్టింటికి వెళ్ళిపోయింది.

ప్రియమైన సుగుణకు—

నమస్కారా లనాలో, ఆశీస్సు లివ్వాలో తెలీక, ఏదీ అనకండా 'ప్రియమైన సుగుణకి ముద్దులు' అనేస్తా; సమ్మతమేనా? ఏం నేను యిలా ముద్దులాడితే మీ ఆయన ఈర్ష్యతో ముఖం ముడుచుకుంటాడా?

సరె ఓ విషయం:

జగన్నాథం అదోలా అగుపిస్తున్నాడీమధ్య. ముఖంలో కళేం కనిపించటం లేదు. మా యింటి

గూడా రావటంలేదు. రెండు మూడుసార్లు ఆహ్వానించాను. రాలేదు: ఏవిటో గమ్మత్తుగా ఉన్నాడు. నువ్వో 'కాయ'ని మోసుకొస్తే ఇటికి గారు బాగా దారికి వచ్చేటట్టు కనిపిస్తున్నారు గాని, అతని వైచిత్ర్యాన్నీ, నిలకడలేని మనస్సునూ తలచుకొంటే కథ అడ్డం తిరుగుతుందేమోనని అనిపిస్తోంది. అయినా నువ్వేం కంగారుపడే నవసరంలేదు. మగాళ్ళకి అంత ధైర్యం లేదులే ప్రపంచాన్ని ఎదిరించడానికి.

మరో ముఖ్య విషయం:

ఏవిటో వూహించు?

నువ్వూహించలేవులే. నేనే చెప్పేస్తా:

నేను పెళ్ళాడబోతున్నాను—అంటే నాకు పెళ్ళి చేస్తున్నారు: నాకు నచ్చిన సంబంధమేలే. ఈ దిక్కుమాలిన సమాజంలో ఆడదాని చదువే ఓ సమస్య. ఇక ఇనర్స్ చదివిన నాలాంటి వాళ్ళ అందులో నడిమి తరగతివాళ్ళకి—ఆశ లెక్కువ ఆచరణ శూన్యం ప్రతీ ఆనర్స్ ఆడదానికి ఓ ఐ ఏ ఎస్ కావాలంటే ? అందువల్ల నేను త్యాగం చేశాను. (మనలో మన మాట: ఇది త్యాగం కాదులే.)

వరుడు ఇంటర్ మూడేళ్లు తన్నేశాడు. మా యింటిపక్క సీతారామయ్యగారు లేరూ, వారి కుమారుడే. కావలసినంత ఆస్తి వుంది. ఆస్తికి నేను ఆశపడలేదనుకో—ఏవిటో సుదర్శన్ అంటే నాకు చిన్నప్పటినించీ అదో యిది; చాల మంచివాడు; చాల సౌమ్యుడు కూడా—ఇలా వర్ణించుకుంటూ పోలేను కాని—ఒకటి, ఈ పెళ్ళి ఎవరికీ యిష్టం లేదు. అయితేమటుకు పెళ్ళాడేది నేనుగా: అందుకని నాన్నా, అన్నయ్యా సరే అన్నారు.

ఈ నెలాఖరునే శుభముహూర్తం. నువ్వు రాలేవు: నా కేవిటో అదోలా వుంది. నీతో స్నేహమయి కొద్దికాలమే అయినా నా కేవిటో నీలో ఓ ప్రాణ స్నేహితురాలు కనిపించింది. నా తోటివిద్యార్థినులు అందరూ వస్తారు. కాని నువ్వు లేనిది నాకంతా వెలితే. అయితే ఒక మాట—నువ్వు మాత్రం నా వివాహానికి రావద్దు. వస్తే జగన్నాథానికి కనిపించాలి. మళ్ళీ రసాభాస అవుతుంది. నీకీ వివాహం చూడాలని వుంటే నువ్వొచ్చాక మళ్లా సరదాగా తలంబ్రాలు పోసుకుంటాంలే. జవాబు రాస్తావుకదూ?

—శకు.

ఉత్తరం పోస్టులో వేశాక తిన్నగా శకుంతల జగన్నాథం యింటికి వచ్చింది.

జగన్నాథం ఆఫీసుకి వెళ్ళాడు. సీతమ్మకి వంట్లో బాగా నీరసంగా వుంది. ఓపికగా వసారాలో కూచుని వంటచేస్తోంది తలుపులన్నీ తీసే వున్నై. ఇంట్లో వస్తువులు చిందరవందరగా పడి వున్నై. జగన్నాథానికి కోపాన్ని తెప్పించే ఎంగిలి గిన్నెలు ఈనాళ్ళగూడా అలానే వున్నై. శకుంతల తిన్నగా వసారాలోకి వెళ్లింది.

సీతమ్మ చప్పునలేచి ముక్కాలిపీట వేసింది, శకుంతలను కూచోమని బలవంతం చేస్తూ.

"మీ వంట్లో యిప్పుడెలా వుందండి?" అనడిగింది శకుంతల కూచున్న తర్వాత.

"ఏం వుండడం ముసలితనం కదా. అయితే మాత్రం ఇంటిపనులు చేయక తప్పుతుందా?"

శకుంతలకు తర్వాత ఏం అడగాలో చప్పున స్ఫురించలేదు. సుగుణ మాట ఎత్తితే అది ఎలాంటి ప్రసంగంలోకి దిగుతుందో తెలీదు. దాన్ని సర్ది చెప్పడమూ, లేక వ్యతిరేకంగా మాటాడటమూ అని అనుకునే సరికల్లా భయం వేసింది.

"జగన్నాథం ఆఫీసునించి యెప్పుడొస్తాడు?" అంది, ప్రసంగాన్ని మరో త్రోవకి తీసుకరావాలని.

"ఎప్పుడో వస్తాడు...వస్తే ఇంట్లో ప్రాణాలన్నీ బిగబట్టుకొని ఏమూలో నక్కి కూర్చోవలసిందేగా."

"ఏం?"

"ఏం చెప్పాలి? మా వంశంలో యిలాంటి మనిషి ఒక్కడూ లేడు: మాటకి కోపం, చీటికి కోపం. ఉత్తిపుణ్యానికి చిర్రు బుర్రు మంటాడు. ఆ గిన్నెలు తియ్యలేదేం, ఆ బట్టలు అక్కడున్నాయేం, మీరేం చేస్తున్నారు—అబ్బబ్బ! ఒక్కటా—వచ్చిందగ్గర్నుంచి ఒకటే సణుగుడు" అని కాసేపాగి మళ్ళీ అంది:

"కోడలు వెళ్లింది—మరీ వీడి ఆగడం ఎక్కువయింది. ఆ అమ్మాయి వున్నపుడు మాత్రం ఒక్కనాడు స్తిమితంగా వున్నాడా? అదీలేదు. అలాంటి గంగిగోవును గూడా సాధించడం, కొట్టడం—"

"కొట్టాడా సుగుణని?"

"ఆఁ—అంతకంటె చేతొచ్చింది మరో టుంటేగా? ఆడపిల్ల ఉసురు తగిలే—"

"నాకు సుగుణ యిలాంటివేం చెప్పలే! ఎప్పుడు?"

"ఏమని చెబుతుంది? వాడిలాంటి పసనైతే చెబుతుంది. అయినా అంత మెత్తని మనసుగల పిల్లలు ఏ నూటికో కోటికో గాని కనిపించరు. వీడి కే జన్మలోనో చేసుకొన్న పుణ్యాన అలాంటిది దొరికితే దాన్నిలా వేధించుక తింటున్నాడు.

"ఒక టాలోచించమ్మా: వీడిచేత తన్నులు తినడానికి, వీడి నోటిమాటలు పడటానికే వాళ్లు పిల్లనిచ్చుకున్నారా? రేప్పొద్దుట వాళ్లకీ విషయం తెలిస్తే వాళ్లమనస్సు లెంత బాధపడతాయో ఆలోచించమ్మా."

"సుగుణ అలాంటిమాటలేం చెప్పదులెండి"

"నాకూ అదే ధైర్యం. ఎంత దుఃఖాన్నయినా కడుపులో దాచుకొంటుంది" అంది సీతమ్మ. తర్వాత చాలసేపటివరకు వారిద్దరిమధ్యా మాటలు లేవు. తర్వాత సీతమ్మే అడిగింది:

"అమ్మ వాళ్ళూ బాగున్నారా అమ్మా"

"బాగున్నారండి"

"ఏమిటో—ఎప్పటికప్పుడే మీయింటికి రావాలనుకొంటాను, కాని—చూస్తున్నావుకదమ్మ ఇంట్లో వీడి పిల్లిగంతులు—"

"అవి క్రమేపీ తగ్గిపోతాయిలెండి"

"ఏం తగ్గుతాయో నా ముఖం"

శకుంతల సంచిలోనుంచి కవరు తీసింది. తన చేత్తో జగన్నాథం పేరురాసిన కవరుని చూసి చిరునవ్వు నవ్వుకొంది. మాటాడకండా దాన్ని సీతమ్మ కందించింది.

"ఏమిటమ్మా?"

"శుభలేఖ"

"ఎవరిది?"

శకుంతల సన్నగా నవ్వింది.

"అరిదొంగా! ఇందుకొచ్చి—యింతవరకు మాటాడలేదు" అంటూ సీతమ్మ అప్పుడే దీవనలు ఆశీర్వాదాలు యివ్వడం మొదలుపెట్టింది. "అయితే పెళ్లికొడు కెవరు?"

శకుంతల చెప్పింది.

వెళ్లిపోయేముందు జగన్నాథాన్ని మరీమరీ గమ్మనమని చెప్పి వెళ్ళిపోయింది.

సాయంకాలం ఆఫీసునించి తిరిగొచ్చాక జగన్నాథం ఈ శుభలేఖని చదువుకొని ఓ నిట్టూర్పు విడిచాడు. అయితే అతను ఒకందుకు ఆశ్చర్యపడ్డాడు: సువర్ణరావు ఈ వివాహానికి ఒప్పుకున్నా సీతారామయ్యగారు యె న్నారని.

మూడుదినాలైనతర్వాత సీతమ్మ మంచంమీదినించి కాలు కింద పెట్టలేనిస్థితికి వచ్చింది. వంట ఇబ్బందయింది జగన్నాథానికి ఏమీ తోచక 'వీలైనంత త్వరలోవచ్చి, తల్లి జబ్బు నయమయాక మళ్లీ వెళ్లే'మని సుగుణకి ఉత్తరం రాశాడు. కాని అక్కడనించి యెలాంటి సమాధానం రాకపోవడంతో నిప్పుతొక్కిన కోతిలా గెంతాడు. తొమ్మిదిన్నరకి ఆఫీసుకి వెళ్లేలోపునే వంట తయారుచేయాలి యింటందరికీ. తనకి సహాయం చేసేవారు లేకపోవడంతో పెద్ద తమ్ముణ్ణి తోడు వుండమన్నాడు.

"మరి బడో?" అన్నాడు వాడు.

"ఏడిశావ్—మానేసెయ్ వెధవబడి"

ఏ బడిని పరమపవిత్రంగా ఎంచుకోమని తమ్ముళ్ళకు బోధిస్తూ వచ్చేవాడో, ఆ బడికి వాణ్ణి వెళ్లొద్దని ఆజ్ఞాపించడంలో తను చేస్తున్న తప్పిదం ఎంతటిదో ఆ క్షణంలో జగన్నాథానికి తెలిసిరాలేదు.

సాయంకాలం ఆఫీసునించి యింటికి రావడంతో కాఫీ తయారుగా వుండేదికాదు; స్నానానికి వేణ్ణీళ్లు వుండేవికావు; అందుకుతోడు యిద్దరు వెధవలూ తిన్న ఎంగిలిగిన్నెలు అలానే వెక్కిరిస్తూ నట్టింట్లో వుండేవి. ఒకనాడు ఇద్దర్నీ చితకబాదాడు. వాళ్ళకీ తిట్లు, తన్నులు అలవాటైపోవడంవల్లాగుంది, వీటిని అంతగా ఖాతరుచేసేవారు కారు.

## 7

రెండు నెలల తర్వాత ఒకనాడు సుగుణ తలకిస్నానంచేసి డాబామీద కూచుని దువ్వుకొంటూ వుంటే తమ్ముడు అల్లరిచేసుకొంటూ అక్కడికి వచ్చాడు.

"అబ్బ! ఏమిట్రా ఆ గావుకేకలు కాస్త నెమ్మదిగా రాలేవ్?" అంది చిరాకుగా.

"అయితే సరె, వెళ్లిపోతా" అంటూ వాడు వెనక్కి తిరిగేసరికి, సుగుణకు అనుమానంవేసి వాణ్ణి చప్పున పట్టుకొంది.

"ఏమన్నా ఉత్తరం వచ్చిం దేమిట్రా?"

"నన్ను పొమ్మన్నావ్ గా"

"నిన్ను కాదు తమ్ముడూ--ఎవరు రాశారేమిటి?"

మెత్తపడి ఉత్తరం యిచ్చేశాడు. అడ్రసు చూసి శకుంతల దస్తూరీని పోల్చుకొంది.

సుగుణా!—

ముద్దులు.

పెళ్ళికి వీరా ఆయన రాలేదు. మా అన్నయ్య గూడా మరీ మరీ చెప్పాడు. కారణం తెలీదు. మా ఆయనకీ జగన్‌కీ ప్రాణస్నేహం. పోనీ అది చూసైనా రాలేదు.

కాని మొన్న ఏమయిందంటే: మా యిద్దరం పిక్చరుకి వెళుతుంటే దార్లో కనిపించాడు. మాతో బాటు పిక్చరుకి రమ్మని బలవంతం చేశాం. చాలా సేపు నసిగి చివరికి వచ్చాడు. హాల్లో ఒక్క మాటైనా మాట్లాడాడు కాదు. పోనీ సుదర్శన్‌తోనైనా మాటాడలేదు.

మళ్ళా క్రితం శనివారం మా యింటికి వచ్చాడు—సుదర్శన్ బలవంతంమీద. ఏమిటో ప్రకృతి! అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను...ఇప్పుడు రోజూ మా యింటికి వస్తున్నాడు.

—శకు.

ఉత్తరం పూర్తయాక సుగుణ మనస్సు చెప్పరాని బాధతో బరువెక్కిపోయింది. గుండె దడ హెచ్చింది. ంతా చమట ప ంది. ఛీ ఛీ! ఏమిటివింత శంకలు! తనని తానే నిందించుకొంది.

పది దినాల క్రితం శకుంతల రాసిన ఉత్తరం జ్ఞాపకానికి వచ్చింది: ఇంత త్వరలో తనని తిరిగి రావద్దని, కనీసం జగన్నాథానికి ఉత్తరమైనా రాయొద్దని. వీటన్నిటినీ లంకెవేసి చూస్తే సుగుణకంతా అయోమయంగా కనిపించింది...వెంటనే తనని తాను నిందించుకొని మామూలుగా శకుంతలకి జవాబు రాసింది.

ఉత్తరం అందిన సమయానికి జగన్నాథం శకుంతల యింట్లో వున్నాడు. శకుంతల నవ్వుతూ ఆ ఉత్తరాన్ని అందించింది. జగన్నాథం చదువుకొని చిరునవ్వు నవ్వి వూరుకొన్నాడు.

"మరో పక్షం దినాల్లో పితృత్వం సంపాయించేస్తావ్!" అందిశకుంతల నవ్వుతూ.

జగన్నాథం శృతి కలిపాడు.

టీ తీసుకవస్తానని ఆమె లోపలికి వెళ్ళిపోవడంతో జన్నాథం ఆలోచనలో పడ్డాడు. శకుంతలలో చాలా మార్పు కనిపిస్తోంది—పెళ్లయిన దగ్గర నించి. ఇంతకుముందు యిలా గంటలతరబడి మాటాడేదికాదు; ఒంటరిగా తనతో కూచోడానికి భయపడేది; తనేమన్నా తప్పించుక తిరిగేది—కాని యిప్పుడు—!

జగన్నాథం వూహించ మొదలుపెట్టాడు: శకుకి సుదర్శన్ వల్ల సంతోషం లేదా? సుదర్శన్ని అసహ్యించుకొంటోందా? చప్పున ఏ సమాధానం చెప్పుకోలేకపోయాడు.

తను శకుంతలతో యింత చనువుగా తిరుగుతున్నా సుదర్శన్ ఏం అనుకోడేం? ఏమో మనస్సులో అనుమానిస్తున్నాడేమో!

మొదట్లో వీళ్ళ అనుకూల దాంపత్యానికి జగన్నాథం యెంతో ముచ్చటపడ్డాడు. సాయంకాలం నలుగురూ వాళ్ళింట్లో చేరి ఏదో గోష్ఠి చేస్తూవుంటే అందరిమధ్యా శకుంతలని, సుదర్శన్‌ని చూసి తనకు సుగుణ జ్ఞాపకం వచ్చేది. తను అలా కాలేడా? ఆ కుతూహలంతోనే రోజూ సుదర్శనం యింటికి

శకుంతల టీ తీసుకవచ్చి ఓ కప్పు జగన్నాథానికి అందించింది.

కప్పు అందుకొంటూ "సుదర్శన్ వచ్చేవరకు ఆగకూడదు?" అన్నాడు.

"ఆయ నెప్పుడో వస్తారు—ముందు నువ్వు తీసుకొందూ."

తాగుతున్నాడే కాని జగన్నాథానికి ఏదోగా వుంది.

"సుగుణని ఎప్పుడు తీసుకొస్తావ్?"

"ఇంకా పురుడన్నా కాలేదు—"

"తర్వాతేనయ్యా?"

"మూడో నెలలోలాగుంది—అంటారు."

శకుంతలకు వెనకటివన్నీ జ్ఞాపకానికి వచ్చి చిరునవ్వు నవ్వింది:

"సుగుణ అంత త్వరగా యెందుకు వెళ్ళిపోయిందో తెలుసా?"

"నువ్వేదో మంత్రం వేసుంటావ్" అన్నాడు నవ్వుతూ.

"సుగుణ రాసిందా?"

"సుగుణా? అప్పటినించి ఓ ఉత్తరమైనా రాయలేదు"

"నిజం?"

"నిజమే. ఆవిడకు ఉత్తరం రాసేంత తీరుబాటు గూడానా?"

శకుంతల విస్తుపోయింది. తను జగన్నాథానికి ఒక్క ఉత్తరమన్నా వ్రాయలేదని సుగుణరాస్తే నిజం అయివుండదులే అనుకొంది. అయితే సుగుణ నిజంగా తనమాటమీద నిలబడిందన్నమాట. ఫర్వా లేదు. జగన్నాథంలో మార్పొచ్చినట్టు కనిపిస్తోంది. ఇక వాళ్ళ జీవితం సాఫీగా నడిచే సూచనలు కనిపిస్తున్నాయ్.

ఉలిక్కిపడి చూసింది.

జగన్నాథం మాటాడలేదు. ఆమె కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయాడు. ఆ చూపు అర్థం కాలేదు శకుంతలకి.

"ఏమిటి?"

"శకు...!"

"ఆ కంఠం విని శకుంతల భయపడింది. జగన్నాథం నిలబడి చప్పున చెయ్యిపట్టుకున్నాడు.

"ఏమిటిది జగన్నాథం!"

సమాధానం చెప్పలేదు. చేతులు రెండూ పట్టుకొని తృష్ణతో చూడటం మొదలుపెట్టాడు. శకుంతల చివాల్న చేతులు విడిపించుకొని దూరంగా వెళ్ళిపోయింది!

"నువ్విలాంటివాడివని అనుకోలేదు జగన్. యిక్కణ్ణించి వెళ్ళిపో...యిహ యిక్కడికి రాకు" అని గిర్రున తిరిగిపోయింది.

ఇంటికి యెలా వచ్చాడో తెలీదు; వచ్చీ రాగానే పక్కమీద వాలిపోయాడు!

ఈ నెలదినాలుగా శకుంతల సమక్షంలో, ఆయింట్లో ఆ వాతావరణంలో స్వర్గం కనిపించింది; అది ఒక్కసారిగా పేకమేడలా కూలిపోయింది... తను శకుంతలని అపార్థం చేసుకున్నాడా? కాక శకుంతలే తన సౌశీల్యాన్ని చాటించుకోడానికి యిలా అన్నదా?

తర్వాత రెండు రోజులవరకు ఆఫీసుకి వెళ్ళలేదు. ఆ నలభై యెనిమిది గంటలూ శకుంతలగురించే ఆలోచిస్తూ వున్నాడు. ఈ ఆలోచనలకి యింట్లో వాళ్ళు అంతరాయం కలిగించినపుడల్లా కస్సుమని లేచేవాడు. ఈ కోపమంతా సుగుణకి ఉత్తరం రాసి తీర్చుకోబోయాడు. కాని అది పోస్టు చెయ్యడానికి మనస్కరించలేదు.

వారం దినాల మామగారు ఉత్తరం రాశారు: మగపిల్లాడని. జగన్నాథం లోలోపల ఎంత సంతోషించినా ఆ విషయాన్ని సుగుణ రాయకపోవదా అనుకొన్నాక వస్తుమంటుకొచ్చింది. ఆవిడానికి యింత పంతమా? శకుంతల మాటమీద ఉత్తరం రాయడం మానేసిన ఆవిడ తనకి భార్య! పిలయినంత త్వరలో తిరిగిరమ్మనమని రాదా మనుకొన్నాడు. కాని ఆవిడ పంతమేమిటో చూద్దామని వూరుకున్నాడు.

మామగారు ఉత్తరాలు రాస్తూనే వున్నారు— కాని యిక్కణ్ణించి జవాబులు లేవు. సుగుణ గూడా ఏం మాటాడదు. ఆ కోపం భరించరానిదయేకొద్దీ జగన్నాథం పిచ్చెత్తిపోతున్నాడు. ఒకనాడు ఏదోచిన్న తప్పుచేస్తే పిల్లలు యిద్దర్నీ చితకబాదాడు. వాళ్ళ అన్నయ్య కోపం ఒకంతట తెలిసిరాక వీపు లంకించుకొన్నారు; మరో నాలుగు పడేసరికి తల్లి లోపల నించి—

"ఎందుకురా, పెద్దబ్బాయ్, వాళ్ళ నలా చావగొడుతున్నావ్?" అంది నీరసంగా.

జగన్నాథం ఈ మాటలతో మరింత పైకి లేచాడు.

"సరేలే నువ్వు నోరు మూసుకో"

సీతమ్మ బాధతో నిట్టూర్పు విడిచి మూలిగింది. జగన్నాథం బయటకు వెళ్ళిపోయాడు.

అంతా అయోమయంగా వుంది. సుగుణ...... ఏమనుకుంది తనమటుకి? ఇంత నిర్లక్ష్యమా? ఇంత అహంభావమా? కడుపులో గోలపెడుతున్న ఎలకలు అతన్ని మరింత పిచ్చెత్తించాయి.

చప్పున తిరిగొచ్చి ఆలుగే నాలుగు ముక్కలు "నీకు భర్త కావాలనే వుద్దేశం వుంటే, ఇదే టెలిగ్రాం అనుకొని రా—లేకపోతే యిహ నువ్విక్కడికి వచ్చే అవసరంలేదు" అని రాసి పోస్టులో వేశాడు.

గుండెలమీదినించి కొన్ని టన్నుల బరువు దిగిపోయినట్టు నిట్టూర్పు విడిచాడు.

మర్నాడు వస్తుందనుకొన్న సుగుణ రాలేదు. జగన్నాథానికి క్షణక్షణానికి కోపం హెచ్చిపోతోంది. అయినా వంట చేయక తప్పింది కాదు; వంట చేశాడు; తల్లికి మందు తెచ్చాడు; ఆఫీసుకి వెళ్ళాడు; సాయంకాలం యింటికి వచ్చాడు; మళ్లా వంట; మందు; ఆఫీసు; నిద్ర—

సుగుణ రాలేదు.

ఆఫీసుకి బయలుదేరే సమయానికి శకుంతల యెదురుపడింది.

జగన్నాథం ఆశ్చర్యపడే ఆస్కారాన్నయినా కలగనివ్వకుండా అడిగింది:

"ఆఫీసుకా?"

తల వూపాడు.

"ఒకసారి లోపలికి రా, మాటాడాలి నీతో"

అప్రయత్నంగా శకుంతల వెనకాల వెళ్లాడు. లోపలికి వెళ్లాక ఆమె గదినంతనీ పట్టిపట్టి చూడటం జగన్నాథానికి నచ్చలేదు.

"రావడానికి కారణం త్వరగా చెప్పేస్తే—"

అర్ధోక్తిలో అందుకొని శకుంతల అంది "మీరు వెళ్లిపోతారు!"

"నాకు టైం లేదు—"

"సరె...సుగుణ నాకు ఉత్తరం రాసింది"

జగన్నాథం ముఖం పాలిపోయినా, ఆశ్చర్యాన్ని అణచుకో ప్రయత్నించాడు.

"ఈవాళ చాల పనిపట్టుకొనే యిక్కడికి వచ్చాను...మీరు రాస్తున్న వుత్తరాలన్నీ సుగుణకి అందుతున్నాయి. కాని వాటికి జవాబు యివ్వొద్దని నేనే అభ్యంతర పెట్టాను."

"ఎందుకో!"

ఆ 'ఎందుకో' శకుంతల సమాధానం చెప్ప లేదు.

"సుగుణ యిప్పుడు టైఫాయిడ్‌తో మంచం పట్టింది. నేను చూడ్డానికి వెడుతున్నా"

సుగుణ జ్వరానికి ఆశ్చర్యపోని జగన్నాథానికి 'నేను వెడుతున్నాను' అన్న ఆవిడమాటలు అలుగుల్లా తగిలేసరికి పౌరుషం పుట్టుకొచ్చింది.

"వీల్లేదు"

"ఏం?"

"వీల్లేదు"

"అదే ఎందుకు?...నీకు భర్తగా ఆవిడమీద హక్కువుంటే వుండొచ్చు కాని నన్ను వెళ్లొద్దని ఆజ్ఞాపించడంలో అర్థం లేదు"

జగన్నాథం మరో మాట ఆడేలోపునే శకుంతల అడిగింది:

"ఆదర్శానికీ, ఆచరణకీ మధ్య మనిషి కుండే ఓర్మి ఓపికకు గల విలువ యెంతటిదో నీకు తెలుసా?"

"ఆ ప్రశ్న నన్నెందు కడగవలసి వచ్చిందో?"

"ప్రస్తుతం నీ పరిస్థితికి ఆ ఓర్మి, ఓపిక లోపించటమే మూలం కావటంవల్ల, నిజానికి నీ భావాలు వున్నతమైనవే కావచ్చు, అయితే ఆచరణ విసుక్కోవడంవల్ల సులభసాధ్యమవుతుందా? పోనీ, ఇంట్లో వాళ్లకి నీ భావాలు యివీ అని నచ్చచెప్పడానికి ప్రయత్నించావా? అసలు నీకు సంస్కృతి అంటే ఏం అర్థమయింది?"

జగన్నాథం సమాధానం చెప్పలేదు.

"డబ్బున్నవాళ్లని చూస్తారు. వాళ్ల కుటుంబాలని, యిళ్లని చూస్తారు; అవన్నీ చూసి అదే ఉత్తమ సంస్కృతి అనే భ్రమలో పడిపోతున్నారు.

'అలా ఆశించడంలో తప్పులేదు; అయితే నీదృష్టిలో యింత భేదం యెందుకు కలగాలి? ఈయిళ్లని, మనుష్యుల్ని చూశాక, మీయింటిమీదా, మీవాళ్లమీదా ఎందుకంత చిన్నచూపు, కోపం, ఏహ్యం కలగాలి? ఆ మన స్తత్వంతో వాళ్లని నానా మాటలని, వాళ్లు బాధపడేకొద్దీ రెచ్చిపోవడంలో నువ్వెంత తప్పుచేస్తున్నావో ఓనాడైనా ఆలోచించావా?"

జగన్నాథం తడబడ్డాడు.

"సాహిత్యసభలకి సుగుణని తీసుకవెళ్లడం తప్పనను. అయితే ఆమె మగాళ్లపక్కన కూచోడానికి సంకోచించినంతలో నువ్వామెమీద విసుచుకపడటం నీకున్న 'సంస్కృతి'కి మచ్చకాదా?" అని క్షణమాగి శకుంతల అంది:

"పాపం! సుగుణ యివేం యెవరితో చెప్పుకునేది కాదు. ఒకరోజున మరీ ఆగలేక నాతో చెప్పుకుంది. నే నిచ్చిన సలహా: పుట్టింటికి వెళ్లమని. ఆమె కొంతకాలం కనుచాటయితే నీ స్వరూపం నీకు తెలిసొస్తుందేమో అని భ్రమించాను కాని నువ్వు విడాకులవరకు వెళ్లిపోవడం నీ విద్యకే అపచారం కాదూ? ఆలోచించు."

శకుంతలఆగిపోయేసరికి జగన్నాథం తలెత్తాడు.

"నా కింకా ప్రపంచమంటే ఏమిటో తెలిసి రాలేదు శకుంతలా" అన్నాడు పశ్చాత్తాపపడుతున్నట్టు.

"తెలిసిరాలేదనకు; తెలిసికోడానికి ప్రయత్నించలేదను. ఆవాళ నన్ను బలవంతం చేయడం నీకు నేను అర్థం కాకపోవడంవల్లే. అలానే సుగుణ గూడా." అని ఓ నిట్టూర్పు విడిచి—

"సరే నాకు టైమవుతోంది—ఈబండికే వెళ్లకపోతే సుగుణని చూడలేనేమో" అంది.

జగన్నాథం నిలువెల్లా కంపించిపోయాడు ఈ చివరి మాటలకి. తనూ లేచిపోయి—

"నేనూ వస్తున్నా" అన్నాడు.

# యక్షగానములు *

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

"చిత్ర విచిత్ర కార్యకలాపములతో నిండి యున్న ప్రకృతిరామణీయకమును చూచి ఆనందపరవశుడైన ప్రాచీనమానవుడు ఉత్సాహాతిశయముతో గంతులువేయుచు వానిని అనుకరించుచు పాడిన పాటయే మానవలోకములో దృశ్యకావ్యావిర్భావమునకు అంకురార్పణము. నిదానముగా ఆలోచించి చూచినచో ఇందులో రెండు కళాంశము లున్నవి—ఆట పాట. కాలాంతరములో ఈయాట పాటలు పొందిన సమష్టిరూపమే నృత్తగీతము *(Ballad dance)*"

ఇది మానవుని నిత్యజీవితములో విలాసమునకును వినోదమునకును ఎంతో ఉపకరించేది. అతడు ఈ యాటపాటలలో ఇతర మానవ సుఖదుఃఖాది భావచేష్టలనుకూడ అనుకరించుచుండెడువాడు. కేవలము తానొక్కడే అనుకరించి ఆనందించుటయే గాక అదియొక ప్రత్యేకరూపములో ప్రదర్శించి ఇతరులనుగూడ వినోదింపజేయవలయుననెడి కుతూహలము క్రమముగా నతనికి పొడమినది. అరణ్యమృగ చర్మములు ఆటబొమ్మలుగా చేసి, తాను తెర వెనుకనిలిచి, అన్యమానవుల సంతోషోత్సాహములను సుఖదుఃఖములను ఆటపాటలలో అనుకరించుచు ఆయా సన్నివేశములను ఆ తోలుబొమ్మలద్వారా ప్రేక్షకులకు చూపి చెప్పి వినోదింపజేసినాడు. దీని ప్రతిఫలమే తోలుబొమ్మలాట.

ఈవిధముగా తెరవెనుక నిలిచి ప్రాణములేని రంగుబొమ్మలను ఆడించి వినోదించిన మనుజునకు కాలాంతరములో సజీవప్రతిమలిచ్చే ప్రదర్శనముపై ముచ్చట పొడమినది. బొమ్మలకు వేయు రంగు తానే పూసికొని, తెర తొలగించి, స్వయముగా రంగమధ్యమున అవతరించి, వివిధములైన హావభావ ప్రకటనములతో అంగభంగిములతో ఆటపాటలతో ఆయా అనుకరణములను ప్రదర్శించి చూపరులను వినోదింపజేసినాడు. ఇది చైతన్యవంతమైన ఒక క్రొత్తరూపక ప్రదర్శనము.

ఈ నూత్న ప్రదర్శనము వేలాది ప్రజలను ఆకర్షించినది. చెంచులు జక్కులు మొదలగు ఆటవిక జాతులవారు ఇదేవృత్తిగా దేశమంతట సంచారము మొదలుపెట్టిరి. క్రమముగా వానిపై నాగరకలోకమునకుగూడ మోజు పుట్టినది. అంతతో వానికి అనుస్యూతమైన యితివృత్తమూ, నియమబద్ధమైన రచనా, కవులసాహాయ్యమూ లభించినవి. ఈ యాలంబనముతో ఆరూపకములు రంగభోగమూ, పార్వ్రతిక సౌభాగ్యమూ, ఆహార్యపటుత్వమూ సంతరించుకొని ఉత్తమ సాహిత్యములో ప్రవేశించినవి. ఇవి ప్రాయికముగా జక్కులవారివలన ప్రచారితము లగుటచే మొదట జక్కుల పాటలుగా వెలసి తరువాత తరువాత సంస్కృతిపరుల చేతులలో "యక్షగానములుగా" మారియుండును. 'కొరవంజి', 'కథాకళి' అనునవి యించుకంత భేదముతో వీని రూపాంతరములే యని కొందరి యూహ.

కాగా, ప్రాచీన మానవుని అనుకరణవిశిష్టమైన నృత్తగీతమే నేటి సర్వాంగసుందరమైన యక్షగానముగా రూపొందియుండునని స్థూలముగా నిర్దేశించి చెప్పవచ్చును. మధ్య మధ్య దశలలో పొందిన ఆయా అవాంతర రూపములు మాత్రము నేటికిని నిదర్శనముగా ఆటపాటలు, తోలుబొమ్మలాటలు, వీధి భాగవతములు, పగటి వేషములు, ఏకపాత్రాభినయములు, చెంచునాటకములు ఆదిగా ప్రత్యేక నామములతో పల్లెపట్టులంగు కొనప్రాణములతో నిలిచియున్నవి.

యక్షగానములు కాకతీయ యుగము నాటికే సాహిత్య గౌరవమును పొంది దృశ్యకావ్యములుగా వెలసియుండునని శ్రీనాథుని వీధినాటకమునుబట్టి యూహింపవచ్చును. గ్రంథరూపములో వెలసిన మొట్టమొదటి యక్షగానము 'సౌభరిచరితము.' దీనిని రచించినయతడు ప్రోలగంటి చెన్నకవి. ఇతడు 16 వ శతాబ్దములో విజయనగరమును పాలించిన వీరనరసింహరాయల కాలమువాడు. రెండవది కృష్ణదేవరాయలకాలమువాడగు కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయము. ఈ కాలమువాడే పింగళి సూరన్న తన ప్రభావతీ ప్రద్యుమ్నములో "గంగావతరణ నాటక ప్రదర్శన"మును పేర్కొనినాడుగాని ఆ గ్రంథ మింతవరకు లభింపలేదు. కాగా, అజ్ఞాత

యుగములో అంకురించి, కాకతీయుల కవటాకుతో డిగ్గి, పదునారవ శతాబ్దములో పల్లవించిన యక్షగానము, ఆంధ్రనాయక రాజుల పోషణలో చిలువలుపలవలై శాఖోపశాఖలుగా వర్ధిల్లినది.

లలితకళలను పోషించిన తంజాపురాంధ్ర నాయకులలో మొట్టమొదట చెప్పుకొనదగినవాడు రఘునాథరాయలు. ఆ కాలములో ఈతని సభాంగణము కవిగాయక నటనటీవర్గముతో కలకలలాడుచు శారదామందిరముగా రమానటీ నర్తన రంగశాలగా రూపొందినది. ఈ మహారాజు తన కోటలో నాటకశాలలను కట్టించి యక్షగానములను ప్రదర్శింపజేసి సపరివారముగా వినోదించువాడట. ఇతడు అచ్యుతాభ్యుదయాది కావ్యములనేగాక పారిజాతాపహరణాది నాటకములనుగూడ రచించినట్లు తెలియుచున్నది. కాని దృశ్యకావ్యములుతప్ప శ్రవ్యములేవియు నితని రచనలు లభింపలేదు. అయినను ఇతని కాలములో వెలసిన యక్షగానములు లేకపోలేదు. అవి రఘునాథనాయకాభ్యుదయము, రుక్మిణీపరిణయము మొదలైనవి. వీనిని సంతరించినవాడు ఇతని కుమారుడగు విజయరాఘవుడు.

ఇతడు సంగీత సాహిత్యరసికత్వములో తండ్రిని మించినవాడు. ముఖ్యముగా యక్షగాన పితామహుడు. ఇతని చేతిలో యక్షగానమున కొక కొత్త చెలువమూ చిరస్థాయీ లభించినవి స్వయముగా 23రూపకములను రచించినాడు. వానిలో రఘునాథ నాయకాభ్యుదయము, కాళీయమర్దనము, ప్రహ్లాదచరిత్ర, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్ర అను 5 యక్షగానములుమాత్రము లభించినవి. విజయరాఘవుడు కేవల గ్రంథకర్తయే కాడు. అల్లిక, కొరవంజి, చౌపదము, దురుపదము మొదలైన నాట్యభేదములను నిర్మించిన నాట్యకళావిశారదుడుకూడ. ఇతని పట్టపుకవి కోనేటి దీక్షితచంద్రుడు "సంగీత సాహిత్య విద్యాధురీణుడు". ఇతడు 'విజయరాఘవ కల్యాణ' యక్షగానమును రచించినాడు. ఆస్థాన కవులగు కామరసు వెంకటపతి సోమయాజి 'విజయరాఘవ చంద్రికా విలాసము'ను, పురుషోత్తమదీక్షితుడు 'తంజాపురాన్నదాన మహానాటకము'ను రచించిరి.

విజయరాఘవుని కొలువులో సంగీత సాహిత్య విద్యాధరులైన సారంగలోచనలు కూడ ఎందరో ఉండెడివారు. వారిలో చంద్రరేఖ, కృష్ణాజి, రంగాజి అనువారు పేరెన్నికగన్నవారు. రంగాజి మన్నారు దాసవిలాసయక్షగానమును రచించి విజయరాఘవునిచే కనకాభిషేక గౌరవమును పొందినది. వీరు గాక భరతాది విద్యలలో ఆరితేరిన రూపవతి రత్నగిరి కోమలవల్లి లోకనాయిక మున్నగు నట్టువరాండ్రెందరో దండలాస్యాది నాట్యబంధములతో యక్షగానములను ప్రదర్శించువారట. ఈ ప్రదర్శనములలో రబాబు, ముఖవీణె, రావణహస్తము, స్వరమండలము, చెందు, దండె, మొదలైన జంత్ర వాద్యములను ప్రత్యేక ప్రవీణత గల జవరాండ్రు వాయించుచుండెడివారట. ఈరీతిగా యక్షగాన రచనయు ప్రదర్శనమును విజయరాఘవుని ఆస్థానిలో ఉన్నతస్థాయికిపోయి మహోన్నత వైభవమును చూరగొనినవి.

ఇతనితరువాత తంజపురీపాలన చక్కగొన్న శాహరాజు, తుళుజాజీ, ఏకోజీ మున్నగు మహారాష్ట్ర రాజులుకూడ ఆంధ్రభాషాపోషకులే. యక్షగాన ప్రియులే. కేవలము శాహజీరచనలే కిరాత విలాసము, జలక్రీడలు, వల్లీకల్యాణము, విష్ణుపల్లకి సేవా ప్రబంధము మున్నగునవి యిరువదివరకు నున్నవి. వీరి చేతియందు ఆస్థానమందు, సమకాలములోను వెలసినవి ఏబదికి మించినవి. మొత్తముపై తంజావూరి పాలకుల కాలములో బయల్వెడలిన యక్షగానములు నూటికి పైనున్నవి. ఇప్పటికి లభించినవి డెబ్బదియేడు మాత్రము.

ఇతివృత్తమును ఆలంబనముగా చేసికొని పై యక్షగానములను పరిశీలింపగా పౌరాణికములు చారిత్రకములు సాంఘికములు వినోదవృత్తములు వేదాంతపరములు అని అయిదుభాగములుగా గోచరించును. పురాణములలోని కథలను తీసికొని వానియందలి రసవద్ఘట్టములనో విచిత్ర సన్నివేశములనో నిరూపించునవి పౌరాణికములు—శచీపురందరము, కాళీయమర్దనము, హేమాబ్జనాయికా స్వయంవరము, శివపారిజాతము, భీమసేన విజయము మున్నగునవి. రఘునాథనాయకాభ్యుదయము, విజయరాఘవ చంద్రికా విలాసము, లీలావతీ శాహరాజీయము మున్నగునవి చారిత్రకములు. వీనిలో ఆ రాజుల యొకనాటి దినచర్యయు, అలంకరణ విశేషములును, సభాసన్నివేశములును, స్వారి వెడలుటయు మొదలగునవి మనోహరముగా నిరూపింపబడినవి. సాంఘికము లన్నవి సతీపతి దానవిలాసము, సతిదానశూరము వంటివి. ఒక విప్రపుంగవుడు మాతంగకన్యను ప్రేమించుటయు, ఆమె బంధువు లీ విషయమును గుర్తించి యతని కామె నొసగుటయు వీనిలోని యితివృత్తము. ఇక వేదాంతపరములు ముక్తికాంతా పరిణయాదులు. ఇవి కేవలము వేదాంత ప్రచార ప్రబోధములకు పుట్టిన యక్షగాన

ములు. రాజుల కొలువులోని నట్టువరాండ్రు వారోప వాసమూలకమైన నృత్యగీతాది ప్రదర్శనమో, నాట్య సంగీతప్రభావ ప్రకటనమో, స్త్రాధికారి ఆగంతుక విప్రులూ పరిచారికలూ ఏదిముచ్చ నడచిన ప్రసంగములలోని పరిహాసఘట్టమో వస్తువుగా స్వీక రించి సంతరింపబడిన నాటకములు విశేషముగా సృష్టించబడెను. వాదజయము, పంచరత్న ప్రబంధము, తంజాపురాన్న దాన మహానాటకము ఈ గణములో చేరును. వీనిలో కొన్ని సంకలితములుగా మాపట్టుచున్నవి. అనగా, ఆయా ప్రబంధములనుండి మంచి మంచి పద్యములు ఏరి, అనుస్యూతమైన యొక కథలో నిమిడ్చి, కథా గమనమునకు వీలుగా మధ్యమధ్య వచనములు దరువులు అతికి తయారుచేయబడినవి. రుక్మాంగదము మొదలగు నవి యీ తరగతికి చెందిన రచనలు.

పై వానిలో కొన్ని నాటకములను పేరుతో నుదహరింపబడినను చాలవరకు అన్నియు యక్షగాన సరణిలోనే నడచినవి. వీని యన్నిటను త్రిపుట, రేకులు, జంపె, ధవళము, ఏలలు, త్రిస్తబకలు మొద లైన దేశీయ పదబంధము లుపయోగింపబడినవి. ఇవ న్నియు గేయప్రధానములు అభినయాత్మకములును. యక్షగానములకు తక్కిన రూపకములలో ప్రత్యేక తయు, ఆంధ్రవాఙ్మయములో విశిష్ట స్థానమును చేకూ ర్చిన వానిలో ఇవి ముఖ్యములు. వీనిలో మనవారు నేడుపయోగించుచున్న ముత్యాలసరములవంటి చిన్న చిన్న ఛందస్సులు ఎన్నో ఇమిడియున్నవి. మచ్చునకు కొన్ని :

త్రిపుట :

1. "అతివ నిటువలెఁ గొలువులోపల
నగడు సేయఁగఁ జూచు మగతన
మేల ధర్మము చాల నెటువలెఁ
దాళవచ్చున్."

2. "నీతి ధర్మము లావుకూరత
నేర్పుగల గంధర్వపతులే
రీతి నోర్చిరి నన్ను నొకఁడీ
రీతి సేయన్."

ఏకతాళి :

"చేతులు చాపుచుఁ జెప్పెదు సుద్దులు
పాతరకత్తియ బాగున నెదుటన్."

జంపె :

"చెలఁగి వంకరగోర సిగ సున్నగా దువ్వు
తళుకు సున్నంపుగోడల నీడఁజూచున్."

అర్ధచంద్రిక :

1. "కొనముక్కుపై నాను మొనరంగ విన్నన్
కనుగొనుః చెంపలను సంగంబు మెచ్చెన్."

2. "క్రొన్నె - - క్కిలు పలుపుమురుపున తొంగిచూడున్
మొక్కబోదక సెక్కి - పలుఁ గలయుఁజూచున్"

3. "సువిగొన డిగులున గడగడ వణఁకున్
పదముల తొట్రిలఁ బెదవులు తడపున్."

సాధారణముగా ప్రతి యక్షగానమును దేవతా ప్రార్థన కవిస్తుతులతో ప్రారంభమగును. తరువాత :

"శ్రీ రాజగోపాల సేవాధురీణ! సీమంతినీ జనమోహన పంచబాణ

సకలధరా భారభరణ సముద్దండ భుజదండ! శౌర్యవిజిత గాండీవ కోదండ! శ్రీనివాస తాతాచార్య పదపద్మ ధ్యానగాయమానాంతరంగ! చతుర విలాస వతీ రంజిత నాట్యరంగ! అఖండ చోళమండల రక్షణ దీక్షా విచక్షణ! అఖిలావయవ సంశోభిత శుభలక్షణ! విజయరాఘవ మహీపాల! విజయ లక్ష్మీలోల! దత్తావధానుండవై చిత్తగింపుము" ఇత్యేవమాదిగా కైవారము చేసి కథను క్లుప్తముగా వివరించి మేళనకర్త (*Stage Director*) పాత్ర ప్రవేశమును సూచించును. కొన్ని యక్షగానము లలో కథాప్రస్తావన కైవారము నుండవు. దేవతా స్తుత్యనంతరము పాత్రప్రవేశము సూచితమై రూప కము ప్రారంభింపబడును.

రూపకము ప్రదర్శింపబడుచుండగా మధ్య మధ్య విడిచిన సన్నివేశములను కథాంశములను తన మాటలతో అతుకుచు మేళనకర్త పాత్రాంతర ప్రవేశ మునకును కథాగమనమునకును తోడ్పడుచుండును. రంగనిర్దేశము క్వాచిత్కముగా సూచితమైనను, అంకవిభాగముగాని, ప్రవేశ విష్కంభకములుగాని యక్షగానములలో ఉండవు. ఇవి లేనిలోపము కని పించకుండ కథాతంతువు తెగకుండ ప్రదర్శనము తుదిముట్టునట్లు మేళనకర్తయే తగిన సూచనలు చేయుచుండును. అక్కడక్కడ చోపుదార్లనియు, కటికవారనియు సంస్కృత నాటకములలోని విదూ షకుడు కంచుకివంటి పాత్రలు ప్రవేశించి వినో దముగా ప్రసంగించుచు కథను రక్తికట్టించు చుందురు.

మేళన కర్త ప్రమేయ మంతగా నక్కరలే కుండ పాత్రలచేతనే సంభాషింపజేసి కథను నాటకీ యముగా నడపించు సంప్రదాయము విజయరాఘవు

డును ఈతని ననుసరించి రంగాజమ్మయు ప్రవేశ పెట్టినారు.

"హరిభక్తి తప్పింతునా -
నాపై ననురక్తి పుట్టింతునా।
పరమపావనుఁ డీ బాపండు నినుజూచి -
భ్రమసే వాడుగాడే ఓ చెల్లి॥
విటునిగా నడపింతునా దాసరి
నటనలు విడిపింతునా।
కటకట నీకింత గర్వమేలే వీ-
డటువంటివాడుగాడె॥
గీతము వినిపింతునా మరునికై-
జీతము మొనయింతునా।
నాతిరో హరికీర్తనకు సొక్కువాడు నీ-
గీతములకు చిక్కునా॥

విప్రనారాయణుని కైవసము చేసికొనదలచిన దేవదేవితో నామె సోదరి ప్రసంగించుచున్న వాక్యోపవాక్యరూపమగు పై కీర్తనము విజయ రాఘవుని విప్రనారాయణ చరిత్రలోనిది.

రాజసభలో భట్టులుచేయు కైవారము కూడ విజయరాఘవుని చేతిలోనే రంగమున కెక్కినది. ద్విపదలు రగడలు కందాది పద్యములు దరువులుగా పాడి వినిపించుటకూడ విజయరాఘవుడు ప్రవేశ పెట్టిన క్రొత్తపద్ధతులలో నొకటి. ఏకోజీ రచనలలో పారిపార్శ్వకుడు తలచూపినాడు. అక్కడక్కడ సంస్కృతశ్లోకములు, భరతవాక్యములు ఈతని యక్ష గానములలో కనిపించుచున్నవి. శాహజీకూడ చాల వరకు ఈ పద్ధతిలోనివాడే. మహారాష్ట్రి రాజులకాలములో రమారమి కడపటి రచన యగు మాతృభూతకవి రచించిన పారిజాతాప హరణము పేరునకు యక్షగానమేగాని వస్తుతత్వ మునకు అయిదంకముల దృశ్యప్రబంధము. బహుశా యీ మార్పు సంస్కృత నాటకప్రభావమువలన కలిగియుండవచ్చును.

ప్రబంధములవలె యక్షగానములు కూడా ప్రాయికముగా శృంగార ప్రధానములే. కొన్నిటిలో మాత్రము ఆటవికులు గొల్లలు ఎఱుకత కేతినాయడు మొదలైన ప్రాకృత పాత్రలను ప్రవేశపెట్టి వారిచే వినోద ప్రసంగములు చేయించుచు హాస్యమునుగూడ చవిచూపినవి లేకపోలేదు. వారి భాషకూడ పాత్రో చితముగా వాడుట గమనింపదగిన విషయము. మచ్చు నకు కొన్ని ఘట్టములు:

చెంచులమాటలు:

"వోరే వోరే సిన్న, వోరే వోరే లక్క, వోరే వోరే కుళ్లి, ఈ మొగసాలవాకిట ఎంతపొడవురా!

"ఒరే యెర్రినరక, యీ పొలాన యింతలేసి మానులు తిరుగుద్రా!"

"ఒరే వోరీ పోగా పోగా ఎన్ని కొంకర వంకరలురా!"

"వోరే వోరె నూడు అమాస్సికి ఆకు మేపుతా వుండ్రా."

"వోరే యీ గాడెబుట్టలోను రెండు పాశాలా మూసి కొట్టేదేమిరా!"

"వోరే మన మనుబోతులనోటికి తళ్యాతగులూ తగిలిస్సి పైని యేమో యేసుకుని కాళ్ళ సందున ఇరి కిస్సికొని పారాడేరు నూడరా!"

ఎఱుకత :

"శ్రీరాజగోపాల! చెండలంకార! దక్షిణద్వార కావాస! చక్కనిసామి! నీవె నేనై, నా వాక్కున నిలిసి, నా తలపున నిలిసి, చల్లని వాక్కిచ్చి, చక్కని వాక్కిచ్చి, ఈయమ్మ తలచిన తలపు తార్కాణగా పలుకవయ్యా సామి! అమ్మాయమ్మ! ఎరుఖాదు గెరు ఖాదుగోయమ్మ! చెయ్యంటే మగడు, భుజమంటే తోడు, కడుపంటే బిడ్డ, నీ యాలోచన చెప్పేగాని, ఈ బుడుతనికి బువ్వపెట్టలేదుండి. అది యెటువంటి దని అడుగతావుండావె. నీ మగ డెటువంటివాడని అడుగుతావుండావె. అయితే చెప్పే వినవేయమ్మ"

గొల్లల భాష :

"ఒరే ఒరే సిన్నెంక, ఒరే వోరే పెద్దెంక, మన కిచ్చమ్మకు వచ్చిన గాచారం తీరెనే మనకా యిచారం వద్దురా వోరి."

"కిచ్చమ్మ కేమి గాచారం వచ్చెరా!"

"ఒరే నువ్వేడ నుంటివిరా!"

"ఒరే నేనే పొనపొనపొనపొనా, కోడెమ్మ గుంటకాడ గొర్రెలమంద ఉండదే ఆ మందకాడ ఒక గుడ్డిమానిసి మరకపోతావుండగా ఆ అంటూ చూస్తూ ఉంటిరా."

విద్వాంసుల వివాదము:

"ఈ మాటలు మధ్యస్థులు వింటిరా!"

"నీవు విన్నదిగాక మధ్యస్థులూ వినవలెనా!"

"అదిగాదయ్యా, నేను సమానాధికరణంగా ప్రసంగిస్తే వీడు వ్యధికరణంగా కూతలు పెట్టుచున్నాడు."

"ఓరీ, నీవే విద్వాంసుని కొడుకవురా!"

"ఓరీ, నీవు నిన్నటివరకూ పిల్లగాడితనం చేసి నేడు కుళ్ళాయి పెట్టుకుంటేనే విద్వాంసుని కొడుకవైతివిరా!"

ముత్తైదువల ముచ్చటలు:

"ఏమమ్మ ముత్తైదువలు! ఇంతసేపూరకుండవలె"

"ఔనా నాగావధానుల యెల్లమ్మ పెండిపందిట్లోకి వచ్చి ఒకపాట నుడుగు పాడాడు. ఎన్నిమార్లు పిలిపించుకున్నావె"

"అవునమ్మ తిప్పావధానుల యెల్లమ్మా, నేను అషువలె పలుమార్లు పిలిపించుకోనేదాన నమ్మా!"

"అవునమ్మా వదినగారూ, మీ రిషువలె పరియాచకాలు చేయవలె."

"నీకిచ్చిన వక్కలాకులు ఎషు దాచుకుంటివే"

"విడేలు వేసుకోను పొద్దు వున్నదమ్మా."

కటికవాని ప్రసంగము:

"అపురా ఇప్పుడు ఎవరు రాకయున్నారు! నట్టువరాండ్రు రాలేద! భోగంవాండ్లు రాలేద! ఇంకా కావలివాండ్లు రాలేద! పరిచారికలు రాలేద! అందరున్ను సూర్యోదయానికే వచ్చి కాచుకొనియున్నారే!"

కేవలము ప్రబంధములను అనుకరించి వ్రాయబడిన యే కొన్నిటిలోనో తప్ప సాధారణముగా తంజావూరి యక్షగానము లన్నిటిలోను భాష ప్రసన్నముగాను సర్వజనసంవేద్యముగాను నడచినది. పద్యములు గ్రాంధిక భాషలో నున్నను చాలవరకు ప్రసంగములు, కొంతవరకు దరువులు నాటి వ్యావహారిక భాషలోనే వ్రాయబడినవి. అవసరము ఔచిత్యము అనుసరించి అరవము కన్నడము మహారాష్ట్రము సంస్కృతముకూడ నుపయోగింపబడిన రచనలు కొన్ని యున్నవి.

వాని నన్నిటిని సమగ్రముగను జాగ్రత్తగను చినచో ఆంధ్రవాఙ్మయములో యక్షగానములకున్న విశిష్టత గోచరించుటయేగాక, ఆ కాలపు తంజాపురీపాలకుల వైభవము, రాజభవనముల సౌందర్యము, పట్టణసౌభాగ్యము, ప్రజల ఆచారవ్యవహారములు, కవి గాయక నట నటీమణుల సంగీత సాహిత్య నాట్య నాటక ప్రదర్శనలు కన్నులకు కట్టినట్లు చిత్రించుకొనవచ్చును.

వ్యాయోగము:

# * ఊరుభంగము *

## భాసమహాకవి సంస్కృతకృతికి అనువాదము


## శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి


### : స్థాపన :

[నాన్ద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి]

సూత్రధారుఁడు : ఓ సామాజికులారా!

మ॥ గురు గాంగేయులు గట్లు కర్ణశకునుల్
ఘూర్ణాంబు కల్లోలముల్
గురుపుత్రుండును సైంధవాదులు మొస
ళ్ళున్ దుమ్మ్లఁడున్ రాజరా
జూరు వేగంబును నైన శత్రునది, నే
యోగేశుఁ డన్తెప్పతోఁ
దరియించె న్నరుఁ డాపరాత్మ కృప నం
తశ్శత్రులన్ గెల్వఁడీ!

(శబ్దశ్రవణ మభినయించి) ఏవో మాటలు విన వచ్చుచున్నవి—ఏమిటి?—సరే కానీ! చూతము.

(తెరలో) ఇదిగో చేరినామయ్యా చేరినాము.

సూత్ర : ఆఁ! సరే! తెలిసినది.

పారిపార్శ్వకుఁడు : (ప్రవేశించి) బావా!

మ॥ కరిదంతంబులపోట్లు బాణముల వ్రే
కల్ గత్తివాట్లుం దలం
పరు, తా మొక్కరి శౌర్య మొక్కరు గణిం
పంబోరు దర్పోద్ధతిన్
సురలోకంబున కోర్కి యుద్ధమున మే
నుల్ వేల్వఁగా జూతు రె
వ్వరొక్కో వీరిపు డందు నందును జరిం
పం గారణం బేమొకో?

సూత్ర : మారిషా! నయనహీనుఁడు శత తనయశూన్యుఁడు నైన ధృతరాష్ట్రునిపక్షమున దుర్యోధనుఁడొక్కఁడే మిగిలెను. యుధిష్ఠిరపక్షమున పంచపాండవులును జనార్దనుఁడును మిగిలినారు. శమంతపంచకమంతయు రణనిహతులైనరాజుల కళేబరములతో నిండియున్నది. ఈ మాట నీ వెఱుఁగవా?

చ॥ సమరహతాశ్వహస్తినృప
సంకులమై క్రమహీన మైన లే
ఖ్యములఁ జెలంగు చిత్రపట
మట్లు కనంబడునిందు కోపరూ
పము లనఁ గౌరవాగ్రజుఁడు
వాయుజుఁడున్ గద లెత్తి పోరునీ
సమయ మెఱింగి యుద్ధఫల
సాక్షులుగా నరుదెంచి రాభటుల్.

(అని నిష్క్రమించిరి)

### : విష్కంభము :

[అంతట భటులు ముగ్గురు ప్రవేశింతురు.]

ముగ్గురు: ఇదిగోనయ్యా చేరినాము.

ప్రథ :

చ॥ పురుషయశోఽభిమానఫల
భూమి, విరోధము పాకశాల, ని
ర్జరపురిదారి, దర్పనిక
షం, బసుయాగము నప్సరస్స్వయం
వరసభ, శూరభూవరుల
వార్ధకమందలి వీరశయ్య, నాఁ
బరఁగెడు పావనాశ్రమము
ఖండనరంగము చేరినా మిదే.

ద్వితీ: బళీ! మాబాగా వర్ణించినావు! మఱి యీ పొలికలను చూడండి.

చ॥ సమర తలంబునం దెగిన
సామజసైంధవ సైనికాళి ర
క్తము నదు లయ్యెఁ, గ్రుంగిన ర
థంబులు గద్దల గూడు లయ్యె, మొం

డెము లవె నెత్తుటేఱుల వ
డింబడి దొర్లుచునుండె, వీరనా
కము గనినట్టి భూవరుల
కాయము లయ్యవె తేజరిల్లెడున్."

తృతీ: సత్యము సత్యము.

ఉ॥ తొండము లెల్ల యూపములు,
తోమర బాణ గణంబు దర్భ, వే
దండతతుల్ సమిచ్చయము
దఁగ విరోధను వహ్ని, వీరవా
క్చండ రవంబు మంత్రములు
గా, మనుజాళి పశువ్రజంబు గా,
ఖండనము న్మహాక్రతువు
పారము గాంచెను గాదె యిచ్చటన్!

ప్రథ: ఇదిగో మంచి వింత—

గీ॥ ఔర! అన్యోన్యశరహతి నవనిఁ బడిన
మనుజనాథుల మాంసంబు తినుచుఁ దినుచు
వారియొడ లంటియున్న బంగారు నగల
నొలుచుచున్నారు విహగనాథులు కనుండు.

ద్వితీ: అటు నిరీక్షింపుఁడు—

గీ॥ బాణచాపాదిసమరసంభార మమర
నాయుధాగార మన నొప్పు నాగజంబు
ఖడ్గవిద్ధంబు శిరభిన్న కవచ మగుచుఁ
గూలె నచ్చోట లోహంపుఁగొండ యనఁగ.

తృతీ: ఇదిగో వింతలలో వింత—

ఉ॥ ధ్వజముననుండి పడ్డపువు
దండె శిరంబు నలంకరింపఁ జే
తఁ జెలఁగ రత్న బాణ మర
దంబునఁ గూలినశూరు నల్లునిన్
బుజములు పట్టి బంధుగులు
ముద్దుగఁ బల్లకి దింపురీతి న
క్కజముగ దింపుచుండిరి
సృగాలకులాగ్రణు లాదరంబునన్.

ముగ్గురు: ఆహాహా! ఈశమంతపంచక మిపు
డెంతభయంకరముగా నున్నదో! ఎటుచూచినా వెద
చల్లినట్లు విఱిగిన రథములే, తురగముల తుండెములే,
ఏన్గుల మొండెములే, పదాతి పాదోరుబాహువులే.
రక్తకర్దమం బైన యీ రణరంగ మంతయు ఛత్ర
చామర కవచశకలములతోను కార్ముకకుంతతోమర
నారాచశూలముసలాద్యాయుధ ఖండములతోను
నిండి యెంత బీభత్సముగా నున్నదో! వర్ణింప నలవి
గాకున్నది.

ప్రథ: ఆ నైపున జరుగుహతశేషప్రాణి
కృత్యము లాలోకింపుఁడు—

చ॥ ఇరువురు బంట్లు రక్తనది
నీల్గిన యేన్గులమీఁద దాఁటి, ర
క్తురగము శూన్య మౌరథము
తో నటు పోవుచునుండె, నిమ్మద
ద్విరదము మావటీఁడు కడ
తేఱుటచేఁ జెలరేఁగెఁ జూడుఁడీ
పగఁగిడుచుండె మొండెము సె
బా సిపుడే తల యూడి యుండెడున్.

ద్వితీ: ఇటు చూచితిరా?

గీ॥ ఇప్పపూ మొగ్గ లనఁ గన్ను లొప్ప, వంక
యంకుశంబులు నా ముక్కు లమర నెక్క
లలరఁ బగడాల విసనకఱ్ఱలవిధాన,
నెగురు నంబరమున గ్రద్ద లవె కనుండు."

తృతీ: ఇది చక్కని దృశ్యము—సందర్శిం
పుడు—

గీ॥ హతరథికసూతహస్తి హయాన్వితంబు
బహువిధాయుధఖండ విభాజితంబు
నైన యీభూమి రవికరవ్యక్త మగుచు
వెలయు, దిగినట్టె నక్షత్రవీథి యనఁగ.

ప్రథ: అసువుల నెడఁబాసిన యావస్థలోఁ
గూడా క్షత్రియవీరుల శరీరములు శోభారహితములు
గాక విరాజిల్లుట వింతకాదా! చూడండి.

గీ॥ కనుబొమలు కేసరంబులు కన్ను లళులు
నోష్ఠములు పత్రములుఁ గాఁగ నొప్పు రాజ
వదనకమలంబు లలరు నీ కదనభూమి
మెట్టతామరతీఁగ నా మెఱయుచుండె."

ఇట్టి రాజమహారాజులను గూడా
మృత్యువు తన పొట్టను బెట్టుకొన్నదిగదా! ఔరా!
ఎంతటి ధీరు లైన నేమి? ఎట్టి శూరు లైన నేమి? దైవము
ప్రతికూల మైనపుడు మృత్యువును దప్పించుకొనఁ
జాలుదురా?

తృతీ: అరే! ఈ రాజశూరులను మృత్యువే
మ్రింగె నందువా?

ప్రథ: సందేహ మేమి?

ద్వితీ: కాదు కాదు. అట్లనకు—

సీ॥ నాకాధినాథాభిషేకాంతరాయ ని
శాటదోర్గర్వాప హారణచణము

ఖాండవధూమ సంక్రమ ధూసరితమూర్తి,
సంశప్తకౌఘవ్యయోత్పాదనంబు,
ద్వంద్వసంగ్రామ సందర్భాభినందిత
శంభుదయా పునస్సమధిగతము,
అమరలోకాక్రంపనాపహారి, నివాత
కవచ దుష్టప్రాణ ఖండనంబు,

గీ॥ ఐన గాండీవముం గొని యర్జునుండు
హరుని గొట్టంగ మిగిలిన శరము లెత్తి
ముందువెనుకలు చూడక మొత్తి మొత్తి
వీరనృపులను మృత్యువునోరఁ గూరె."

తృతీ: సెబాసు సెబాసు !!

ముగ్గురు: (ధ్వని వినుట యభినయించి) అరే! ఏమీ మహాశబ్దము !

చ॥ ధరణి వణంకి క్రుంగి నదు
దారికి రెండుగ వ్రయ్య లయ్యెనా?
సురవిభు చేతివాలఁ బడి
సోకుటఁ గొండలు పిండియయ్యెనా?
మొరసెన కాలమేఘము? స
ముద్గత సింధుతరంగజాల భీ
కర నినదంబు మందరము
కందరపంక్తుల మాఱుమ్రోగెనా?

కానిండు చూతము (అందరు పరిక్రమింతురు.)

ప్రథ: సరే తెలిసినదయ్యా! ద్రౌపదిని సభలోని కీడ్పించె నన్న క్రోధముతో భీమసేనుఁడును, తన నూర్వురు తమ్ములను సంహరించె నన్న కోపముతో దుర్యోధనుఁడును కురుకులయదుకుల దైవతములగు కృష్ణద్వైపాయన హలాయుధులును శ్రీకృష్ణ విదురాదులును చూచుచుండ గదాయుద్ధ మారంభించినారు.

ద్వితీ :

గీ॥ హైమపీఠోన్నతం బగుభీమునురము
కరికరకఠోర మగు కురువరునిమూఁపు
నేటువడి యొక్కమాఱుగ బీఁటవాఱఁ
దద్గదాఘాతరవము రోదసి నగల్చె."

తృతీ : ఇదుగో మహారాజా.

చ॥ కనుఁగవ నిప్పులొల్కఁగ, మొ
గంబున రౌద్రము చిందులాడ, మ
న్వనుకలు క్రిందుమీఁదు రిపు
వీరునికై గుఱిచూచు నీ సుయో
ధను భుజదండమందలి గ
దం గనుఁ డారజతాద్రికోటి నం
టిన యమరేంద్రు నాయుధము
చేవ నెసంగెడు శోణకోణమై.

ప్రథ : అబ్బా! ఏమి ధైర్యస్థైర్యములు? ఇటు చూడండి—

గీ॥ కౌరవగదాప్రహార నిర్ఘాతహతుల
నొడల నెల్లెడ శోణిత మొలుకుచుండ
ధాతురాగాఢ్య నిర్ఝరధార వెలయు
మేరుగిరిమాడ్కి వెలయు సమీరజుండు.

ద్వితీ : బళీ ఏమి చాతుర్యము?

చ॥ ధరణివిభుండు చూపెడి గ
దా రణభంగులు చూడుఁడీ! వృకో
దరుగద వ్రేటు తప్పుకొనె
దాఁటెఁ, బయింబడి కొట్టె, నార్చె, వీ
ల్దొరకొన వేచి మేలొడుపు
దోఁప నెదుర్కొనె, నైన నేమి? భీ
కరబలసంపదన్ వినుతి
గాంచె మహాబలనందనుం డిలన్.

తృతీ : ఏమి మహాబలనందనుఁడో! ఔరా! చూచినారా?

గీ॥ కురువిభుఁడు చాచికొట్టిన గుదియదెబ్బఁ
దలపగిలి మేన నెత్తుటిధార లొలుక
నంతబలశౌర్యశాలియు నవనిఁ బడియె
నశనిహతిఁ గూలు హేమకూటాద్రికరణి.

గాఢగదాభిఘాతముల శరీరము శిథిలమై క్రుంగఁ గూలఁబడుచున్న భీము నవలోకించు పెద్దలచర్య లాలోకించితిరా?

ఉ॥ ముక్కున వ్రేలు వేసికొని
మోడ్పడె వ్యాసమహర్షి—

ద్వితీ :

........................దైవమే
దిక్కని మ్రొక్కె ధర్మజుఁడు
దీనమతిన్, విదురుండు వంతమై
బిక్కమొగంబు వేసె,

...రిపుభీకరమూర్తి నరుండు గాండివం
బెక్కిడఁజూచె, మిన్ను గనెఁ గ

ముగ్గు:
.........శిష్యునిమీఁదిప్రేమ చే
రెక్కఁగ సీరపాణి హల
మిట్టటుఁ ద్రిప్పెను సంతసంబునన్.

ప్రథ: బళీ! ఇపుడు భీము నుద్దేశించి పలికిన రాజుమాటలు వినండి.

అనుపమధైర్యసాహస
నయాభరణుం డభిమాని శూరుఁడున్
వినయవివేకశాలి యని
విశ్రుతి కెక్కినవాఁడ నే సుయో
ధనుఁడ, భయంబు నొందకుము
తమ్ముఁడ! ఆహవశూరుఁ డైనవాఁ
డనిఁబడినట్టి దీనపయి
నాయుధ మెత్తఁడు నమ్మమీ మదిన్.

ద్వితీ: ఔను. ఇ ట్లపహసింపఁబడిన వృకోదరుని చూచి జనార్దనుఁడు తన తొడ చఱచి యేదో సంజ్ఞ చేసినాఁడు.

తృతీ: నిజము నిజము. ఆ సైగవల్ల నే యూఱడిల్లి తేఱుకొనుచున్న మారుతి నాలోకింపుఁడు.

చ॥ కనుఁగవ కెంపువాఱ, నళి
కంబునఁ గన్బొమ లాడ భీకరా
ననుఁ డయి సింహగర్జన మొ
నర్చి భుజాన గదన్ ధరించి, తం
డ్రిని మది నెంచి, తత్కృప శ
రీర బలంబు మనోజవంబుతో
నినుమడి గాఁగ లేచెఁ గల
నెల్ల వణంకఁ బదాభిఘట్టనన్.

ప్రథ: అయ్యో! మరల యుద్ధ మారంభమైనది గదా! ఔరా! అనిలాత్మజుఁడు—

చ॥ కొఱకొఱ లాడుచున్ బెదవి
గోఱుచుఁ జేతులు నేల రాచి బి
ట్టఱచి భుజంబులం జఱచి,
యాహవధర్మము లుజ్జగించి యే
డైఱ గద త్రిప్పిత్రిప్పి కసి
దీఱఁగఁ దొంటి ప్రతిజ్ఞ దీరఁగా
నఱికె సుయోధనోరువు,
లనంత మగర్చెను సింహగర్జనన్.

ముగ్గు: కటకటా! పుడమిఱేఁడు పుడమిఁ బడెను.

తృతీ: నెత్తురు గాఱుచు నేలఁ గూలుచున్న కురుభూవరుని చూచుచునే కృష్ణద్వైపాయనుఁ డెగిరి గంతువేసెను గంటిరా? మఱియు నటు చూడండి.

చ॥ కురుపతి యిట్లనూరుఁ డయి
కూలుట చూచి క్రుధావమాననా
భరమునఁ గన్మొగిడ్చె బల
భద్రుఁడు, దానికి జంకుచున్ వృకో
దరుఁ గని కన్ను గీఁటె ముని
తల్లజు, డయ్యది గాంచి పాండవుల్
వెఱపునఁ జుట్టుఁ జేరఁ గని
భీముని గైకొని యేగెఁ గృష్ణుఁడున్.

ప్రథ: కోపోద్రేకంబున మరలఁ గన్నులు తెఱచి హలాయుధుఁడు భీముని నిర్గమనము నిరీక్షించుచు నిటే వచ్చుచున్నాఁడు. కొండటి తొందర నడక గూడా అందముగానే యుండునుజుఁడీ! చూడుఁ డీ బలదేవుఁడు—

చ॥ కదలుచునుండె జుట్టుముడి
కన్గవ చెంగలువై చెలంగఁ, దు
మ్మెదల నదల్చి యంసముల
మీఁదికిఁ బువ్వులదండ లాగుచున్
వదులయి జాఱునల్లవలు
వన్ బయిఁబట్టుచు వచ్చు, నీలతో
యదపరివేష్టితుం డగు సు
ధాంశుఁడు భూమికి డిగ్గనో యనన్.

ద్వితీ: అయితే రండు మనము మహారాజు చెంతకు పోవుదము.

ఇద్దు: బాగున్నది. అది యుక్తమైనపని—
(అందఱు నిష్క్రమింతురు)

[విష్కంభము సమాప్తము]

[అటుపిదప బలదేవుఁడు ప్రవేశించును]

బల: ఓ భూవరులారా! ఇది యెంతమాత్రము తగినపని కాదు.

చ॥ తలఁపఁ డధర్మయుద్ధ మని,
దగ్గఱ నున్న ననుం గనండు, దో
ర్బలమదమత్త శత్రువుల
పాలిటి యంతకుఁ డైన నాదు లాం
గలము గణింపఁ డా దురిత
కర్ముఁడు భీముఁడు ధర్మపద్ధతిన్
దలపడు రాజు నూరువు ల
ధర్మగతిన్ దెగఁగొట్టెఁ గానరే?

ఓయీ! దుర్యోధనా! ముహూర్తమాత్రము ప్రాణము నిలుపుము—ఇదిగో (నాఁగలి యెత్తి)

చ॥ మునుమిడి సాళ్వసౌభపురి
ముక్కలు చెక్కలు చేసినట్లు, దు

ర్జునుఁ డగు నమ్మహాసురు పురంబును
నేలకుఁ గూల్చినట్టి, బ
ల్మిని యమునా ప్రవంతిఁ జెక
లించిన యట్టియు, ఘను పేరు రం
బును మడిమాడ్కి గున్కి యటుఁ
బొంగెడు నెత్తుట దమ్మిచేసెదన్.

(తెరలో) బలదేవా మహానుభావా! అనుగ్రహింపుఁడు.

బల: (తెరవంక చూచి) అయ్యో పాపము! ఈ యవస్థలోఁ గూడా నామాట చెవిని బడినంతనే దుర్యోధనుఁ డిటు వచ్చుచున్నాఁడు—ఔరా!

చ॥ ఒడలికి వీరచందనము
నొప్పఁగన్ రుధిరంబు, నేలపన్
బుడుతని మాడ్కిఁ జేతులను
బొట్టయి నాన్చుచుఁ బ్రాఁకి వచ్చునీ
తఁడు సరిపోలుఁ బాల్కడలి
త్రచ్చి సురల్ వినువంగ మందరం
బెడలి వలంగినట్టియొడ
లీడ్చుచుఁ బ్రాకినయట్టి వాసుకిన్.

[అంత యథోక్తముగా దుర్యోధనుఁడు ప్రవేశించును]

దుర్యో: అయ్యా! నేను సుయోధనుఁడను—

గీ॥ యుద్ధసమయంబు దాఁటి వృకోదరుండు
కలుకుగద యెత్తి నా తొడల్ విఱుగఁగొట్టె
దానఁ జచ్చిన యాసగమేను కూడఁ
బ్రాఁకుచున్నట్టి నాకీడ్వవలసివచ్చె.

పూజ్యపాదా హలాయుధా! అనుగ్రహింపుఁడు.

చ॥ గురువర! ఊరుభంగమునఁ
గూలిన నాతల ముందుగా భవ
చ్చరణములందు మోపితిఁ బ్ర
సన్నుఁడవై దిగ్రమింగు రోషమున్
ధర నిఁక మేము లే, మఱఁగెఁ
దత్కథ లెల్ల, నిఁకేల? వారలన్
కురుకులజన్ములౌ నృపుల
కుం దిలతర్పణ మీయ నుండనీ!

బల: ఓయీ దుర్యోధనా! ఒక్క నిమిషము జీవించియుండుము. ఇదిగో—

దుర్యో: మహాత్మా! ఏమి చేయుదురు?

బల: ఏమి చేయుదునో విను—

ఉ॥ రోఁకలి యెత్తి మూర్ధములు
బ్రొమ్ములు మూఁపులుబాది దానిపే
రాఁకలి దీర్చి, నాఁగలి త
దంగ విహారమునన్ సుఖింప వా
యేఁకట దీర్చి, పాండవుల
నేవురఁ బచ్చెద నాకమేగుచో
నీ కనుదోయికై నకుల
నీవగదీర దివంబు జేర్చెదన్.

దుర్యో: మహాత్మా! వద్దు వద్దు—

గీ॥ ప్రతిన నెఱవేర్చుకొనియె నా పవనసుతుఁడు
నాదు తమ్ములు నూర్వురు నాక మరిగి
రరుగుచున్నాను నే నిప్డు డమరపురికి
నెందుకీ యుద్ధ మిఁక దీని కేమి ఫలము?

బల: అట్లందువేమి? నా కన్నులయెదుట భీముఁడు నిన్ను వంచించుటచే నారోషము పైకుబికినది. ఇది యూరక యణఁగునా?

దుర్యో: భీముఁడు నన్ను మోసముచేసెనని మీరు భావించుచున్నారా?

బల: సందేహమేమి?

దుర్యో: అయితే, నా ప్రాణాలకు తగిన మూల్యము ముట్టినదన్నమాటే. ఏమందురా,

చ॥ ఘనబలశాలి, లక్కయిలు
కాలిన యప్పుడు బుద్ధిచాతురి
న్దనరినదిట్టు, యక్షగణ దర్ప
మణంచిన శూరుఁ, డాహిడిం
బుని బోరిగొన్న మేటి నను
మోసము చేసెనయేని, వాఁడు గె
ల్పొనరినవాఁడు గాఁడచట,
నోడినవాఁడను గాను నేనిటన్.

బల: ఆ మాట నిజమేకాని, నిన్ను మోసగించిన భీముఁడు జీవించియుండ నగునా?

దుర్యో: అచ్యుతాగ్రజా! ఇంతకు నన్ను వంచించినవాఁడు బలుఁడనియే తలఁచుచున్నారా?

బల: అట్లుకాకపోతే, నిన్నీగతికి తెచ్చినవాఁడెవఁడందువు?

దుర్యో: ఆఁ! అట్లడగండి

ఉ॥ ఎవ్వఁడు యోగనిద్ర నటి
యించె యుగాంతమునన్ మహాబ్దిలో?
ఎవ్వఁడు పారిజాతతరు
వింద్రునిమానముతోఁ బెకల్చె? నా

కవ్వడిమిత్రుఁడా హరి జ
గత్పతి భీమ గదాప్రవిష్టుఁడై
యివ్విధిఁ గూల్చె ధర్మమతి
నెక్కటికయ్య మొనర్చు నన్నిటన్.

(తెరలో) ఒత్తిగిలండి, ఒత్తిగిలండి—

బల: (అటు గూచి) అయ్యో! గాంధారియు కోడ ళ్ళిద్దఱును వెంబడింప, దుర్జయుఁ డుత్తరీయము పట్టి ముందు నడచుచుండ, పూజ్యుఁడగు ధృతరాష్ట్రుఁడు శోకమూర్తి నా నిటు వచ్చుచుండె.

మ॥ కనక స్తంభములట్టు బాహువు లెసం
గన్ మూర్తిమద్వీర్యమో
యన నొప్పారు నితండు, నాకమున క
ధ్యక్షుండుగా నోపునం
చనుమానించిన యింద్రు తప్పుపని చే
సంఘుండు గాఁ బుట్టియున్
దనయుల్ కన్నులు గాఁ జరించె, నకటా!
దైవంబు వారింగొనెన్.

[ధృతరాష్ట్రుడు గాంధారి సుయోధనుని దేవీద్వయమును, దుర్జయుఁడును ప్రవేశింతురు.]

ధృత: పుత్రా! ఎక్కడున్నావు నాయనా!

గాంధా: కుమారా! ఎందున్నావు తండ్రీ!

దేవీ: మహారాజా! దర్శన మివ్వరా?

ధృత: హా పుత్రా! కష్టము కష్టము.

గీ॥ సమరమున భీమసేనుని సమయభంగ
మూరుభంగం బొనర్పఁగా బోర నీవు
పడినవార్తను నప్రసంబు పొడమఁ బొడమ
వంధమగు నాముఖం బయ్యె నంధతరము.

గాంధారీ! బ్రతికియున్నావా?

గాంధా: భాగ్యహీనురాలు బ్రతికియుండదా?

దేవీ: మహారాజా! మహారాజా! ఎక్కడ?

దుర్యో: అబ్బా! కష్టము, నా ప్రియురాండ్రు విలపించుచున్నారు.

చ॥ తలఁపఁగ నైతి నింతకు గ
దాహతిఁ గల్గిన బాధ, కాని నా
కులసతు లిద్ద ఱంతిపురి
గుమ్మము దాటి పరాకునన్ ముసుం
గులు తొలఁగన్ విషాదమునఁ
గుందుచు నీ రణభూమిఁ జొచ్చుటన్
గలిగిన నెవ్వగం గలసి
గట్టిగ నొంచుచు నుండె నామదిన్.

ధృత: గాంధారీ! దుర్యోధన నామధేయుఁ డైన కులమాని నీకుఁ గనఁబడుచున్నాఁడా?

గాంధా: లేదు లేదు మహారాజా!

ధృత: ఏమీ కనఁబడలేదా? అయ్యో! రాఁదగిన సమయమందు వచ్చి కొడుకును చూడలేకపోయినాను. ఛీ దురాత్ముఁడా కృతాంతా!

చ॥ వినయ వివేకమాన భుజ
బలాఢ్యులు శత్రువీరము
ర్దనచణు లైన పుత్త్రుల శ
తంబును గన్న విచిత్ర నం
దనుఁ డొకపుత్త్రుఁ డైని తిల
తర్పణ మూ నొకసారియేని తృ
ప్తిని బడుచుండఁ జేసితె వి
ధీ! కుల మెల్లను బెల్లగించితే.?

గాంధా: నాయనా సుయోధనా! బదులు పల్కవా? పుత్త్రిశోకహతులగు మీ జనకపాదుల నూఱడింపవా?

బల: పాపము! పూజ్యురాలు గాంధారి—

మ॥ కలనం గూలిన పుత్రపౌత్రతతికిన్
కంపిల్లి దుఃఖార్తి వి
హ్వలతం జెంది, సుయోధనాస్తమయ
దుర్వార్తా హతస్వాంతయై
కలఁగంబాఱె, తదశ్రుధారఁ దడియంగా
నేత్రబంధంబు, చే
తులపై ముందల వాల్చి వచ్చు నకటా!
దుర్దాంత దుఃఖం బనన్.

ధృత: హా తనూజా! అష్టాదశాక్షౌహిణీమహారాజా! ఎందున్నావు నాయనా?

దుర్యో: ఇపుడు కూడా మహారాజనా! తండ్రీ?

ధృత: పుత్త్రిశతజ్యేష్ఠా! కంటఁబడవా తండ్రీ?

దుర్యో: ఈ మాటలు నాకు లజ్జ కలిగించుచున్నవి. ప్రసంగము మాఱిన బాగుండును.

ధృత: రా కుమారా! నాకు నమస్కరింపుము—

దుర్యో: ఇదిగో వచ్చుచున్నాను. (లేవఁబోయి పడును) ఔరా కష్టము కష్టము! ఇది రెండవ గట్టిదెబ్బ.

దారుణం బైన భీమగదాప్రహార
మూరు భంగంబు గావించి యూరకొనెన?

జనకపాదాభివందనంబునకుఁ గూడ
భంగ మొనరించె నక్కటా పాపనియతి!

గాంధా: పిల్లలారా!

దేవీ: ఉన్నా మమ్మా! ఉన్నాము.

గాంధా: మీ భర్తను వెదకండమ్మా!

దేవీ: (దుఃఖముతో) అట్లు చేయుదు మమ్మా!

ధృత: నా యుత్తరీయము పట్టుకొన్నవాఁ డెవఁడురా?

దుర్జ: తాతా! నేను—దుర్జయుఁడను.

ధృత: ఓరీ తాతా! నీవఁటరా! మీ నాన్నను వెదకు బాబూ!

దుర్జ: తాతా! అలసిపోయినాను. తిరుగలేను—

ధృత: వెదకి పట్టుకోరా! మీ నాన్న తొడ మీఁదఁ గూర్చుండుదువు గాని—

దుర్జ: సరే. (అటు వెళ్ళి) నాన్నా! ఎక్కడున్నావు?

దుర్యో: అయ్యో! వీఁడుకూడా వచ్చినాఁడా? ఎట్టి దురవస్థయందైనను పుత్రస్నేహము హృదయమును విడువదుగదా! అది నన్నిపుడు దహించుచున్నది.

గీ॥ దుఃఖ మనుమాట యెఱుఁగఁడు, తొడలమీఁదఁ
బండుకొనువాఁడు నా చిన్ని బాలకుండు,
పుడమిఁ బడి యిట్టు లున్న నాయొడలు చూచి
యేమి యడుగునో? యని మనం బెరియుచుండె.

దుర్జ: (వెదకుచు) ఇదుగో మా నాన్న. నేల మీఁదఁ గూర్చున్నాఁడు.

దుర్యో: అబ్బాయీ! నీ వెందుకు వచ్చినావురా!

దుర్జ: నీ వాలస్యము చేయుచున్నావని—

దుర్యో: హాహా! పుత్రప్రేమ హృదయమును కాల్చుచున్నది.

దుర్జ: నాన్నోయి! నీ తొడమీఁదఁ గూర్చుంటాను.

దుర్యో: అబ్బాయీ! వద్దు వద్దు—హా కష్టము!!

గీ॥ నాదు హృదయంబులోని యానందరసము
నాకనుంగవపండువు నాదుప్రేమ
యైన యీ బాలచంద్రుఁ డియ్యవసరమునఁ
గానవచ్చెడు వహ్నియై కాలుచుహిమ.

దుర్జ: తొడ యెక్కవద్దన్నా వేమి నాన్నా?

దుర్యో:

గీ॥ ఓరి నాతండ్రి! మును నీవు కూరుచుండు
నంకపీఠంబు లేదు, నీ కింక రాదు,
ఎక్కడైనను గూర్చుండు మెక్కగడియ
చూచుకొనవచ్చు వే జొక్క చోటు రేపు.

దుర్జ: నాన్నా! నీ వెక్కడికి వెళ్లెదవు?

దుర్యో: నా తమ్ములదగ్గఱకు—

దుర్జ: నన్నుఁ గూడా తీసుకొని వెళ్ళు—

దుర్యో: అయితే వెళ్లి భీము నడుగు.

దుర్జ: అయితే నీవుకూడా రా! నీకోసము వెదకుచున్నారు.

దుర్యో: ఎవరు నాయనా?

దుర్జ: ఎవ రేమిటి? తాత, మామ్మ, అమ్మలు, అందఱూ—

దుర్యో: నీవు వెళ్లు నాయనా నేను రాలేను—

దుర్జ: నేను తీసుకొని వెళ్లెదను, లే!

దుర్యో: నీవు కుఱ్ఱవాఁడవురా!

దుర్జ: (పరిక్రమించి చూచి) ఆఁ వారే వచ్చారు. ఓ తాతోయి! ఓ మామ్మా! ఇదుగో మా నాన్న!

దేవీ: ఏరీ ఏరీ? మహారాజు!

ధృత: ఎక్కడరా నాన్న తాతా?

గాంధా: ఎక్కడమ్మా? నాతండ్రి యెక్కడ?

దుర్జ: ఇదుగో ఇక్కడ—నేలమీఁద కూర్చున్నాఁడు.

ధృత: అయ్యో! రాజాధిరాజు క్రిందఁ గూర్చున్నాఁడా?

గీ॥ సర్వభూతల మేలిన సార్వభౌముఁ
డక్కటా! యెట్టిదురవస్థ నధిగమించె?
కాంచనస్తంభరాజంబు కాలగతిని
ద్వారమునఁ బాఁతు కుంజగా మాఱినట్లు.

గాంధా: నాయనా సుయోధనా! అలసిపోయినావా?

దుర్యో: అమ్మా! నేను నీ కడుపునఁ బుట్టినవాఁడ నమ్మా!

ధృత: ఎవ రీవిడ?

గాంధా: కౌరవనాథా! మీకు భీతి యెఱుఁగని పుత్రరత్నముల నిచ్చినదానను.

దుర్యో: అమ్మా! నేను నీ కడుపున నిపుడు పుట్టినట్లు పొంగిపోవుచున్నాను—తాతపాదా! వింటిరా? మీ కీ భయ మేల? ఈ విషాద మేల?

ధృత: నా తండ్రీ! నా కేమి దుఃఖమురా? నా కింక భయ మేమిటిరా?

ఆహవాధ్వర దీక్షితు లైన నీదు
సోదరులు నూర్వురును నాకసుఖము గనిరి
నీ వొకండవు మిగిలితి వీవు పోవ
నాంబికేయుం డపుత్రకుం డై నశించు.

(అని పడిపోవును)

దుర్యో: అయ్యో అయ్యో!! పడిపోయినారా? పూజ్యపాదా!—మీరు లేచి మాతల్లి నూఱడింపరా?

ధృత: (లేచి) ఏమని యూఱడింపను రా నాయనా?

దుర్యో: నీ కొడుకు వైరులకు వీపు చూపక రణభూమిని కూలఁబడినాఁ డని—తాతపాదా! మఱొక్క మాట. నాయెడ దయచేసి మీరు శోకమును నిగ్రహింతురు గాక.

చ॥ గురుజన పాదపద్మముల
కున్ శిరసా ప్రణమిల్లి యావ్వరో
దరకృత మైనవంచన మె
దం దలపోయక యింద్రు వీటికిన్
దర లెద, నెట్టిమానమున
ధాత్రి జనించితి నట్టిమాన మే
మరణము వేళఁ గూడఁ బర
మాప్తుని కైవడిఁ నన్నుఁ గొల్వఁగన్.

ధృత: అబ్బా! భరింపఁజాల. పుత్రశోకము తీవ్రమై ధైర్యము నణఁగఁద్రొక్కి నాహృదయ మాక్రమించి ప్రజ్వరిల్లుచున్నది.

బల: పాపము! పెద్దవాఁడు, అంధుఁడు. తుదకు దుర్యోధనునిమీఁది యాశ కూడా అడుగంటినది. ఈ దురవస్థలో నున్న యితని నేమని పలుకరింతును?

దుర్యో: అమ్మా! నా దొక్క విన్నపము.

గాంధా: అదేమి తండ్రీ?

దుర్యో: మాతృదేవీ! నమస్కారము. నేను పుణ్యము చేసితి నేని జన్మాంతరమందు కూడా నీవే నాకు తల్లి వగునట్లనుగ్రహింపుము.

గాంధా: నా మనస్సులోని కోరికయే నీనోట వచ్చినదిరా నాయనా!

దుర్యో: మాలవీ! కంట నీరు పెట్టుచున్నావా? వీరవనితవు కావా! ఇది తగునా?

ఉ॥ ఫాలము కన్బొమల్ రుధిర
పంకిలమయ్యెను, ఓమ్మ నల్లడన్
గాలువగట్టె నెత్తురిదె,
కన్గొను నాదు బుజంబులం దివే
మేలిమియంగదంబు లన
మించెగదా వ్రణరేఖ లిట్టిచో
నేల విలాప, మిందనుక
నేడ్తెఱఁ బోరితి సంతసింపుమీ.

మాల: సహధర్మచారిణి నగుటచే నార్యపుత్రుని కష్టపాటెఱిఁగి యించుక విలపించితి నంతే. (కన్నులొత్తుకొనును)

దుర్యో: పౌరవీ! నేనిపుడు చెప్పెడుమాటలు విని నీవంటి రాజస్త్రీలు విలపించుట తగునో తగదో నిరయించుకొనుము.

చ॥ అనుపమదీక్ష వేదవిహి
తాఖిలయాగము లాచరించితిన్
మనిచితి నెల్లబంధువుల
మాన్యుల నెల్లర సత్కరించితిన్
చెనఁగి యలంచితిన్ బదియు
నెన్మిదినేనలవారి నట్టి భ
ర్తను నను మాని యంచు నెడఁ
దన్ వినుతింపక యిటు లేడు వే?

పౌర: (కన్నులొత్తుకొని) ఔను. అగ్ని ప్రవేశమునకు సిద్ధముగుచున్న నేను విలపించుట యనుచితమే మహారాజా!

దుర్యో: తనయా దుర్జయా!

ధృత: గాంధారీ! వజ్జివాని కేమి చెప్పనో?

గాంధా: నేనుకూడా అదే ఆలోచించుచున్నాను.

దుర్యో: కుమారా! ఇంతటినుండి ధర్మరాజాదులే నీ తండ్రు లనుకో. ద్రౌపదీ సుభద్రలే నీ తల్లు లనుకో. పూజ్యురాలైన కుంతీదేవి నీ మామ్మ యనుకో! వారిని సేవించుచు వారు చెప్పినట్లు నడచుకొనుము. నాయనా! ఇంకొక్క మాట—

చ॥ సిరిఁ దులఁదూఁగినట్టి న్నప
శేఖరు నత్యభిమాని నాపితన్
బొరిగొనె భీముఁ డన్న వగ
పున్ విడనాడుము, ధర్మరాజు నా
దరమును గాంచి యాన్నపుఁడు
తర్పణముల్ పచరించు వేళ మా

కురుతరభక్తియుక్తిని దిలోదక
మిమ్మొగిఁ బేరు చెప్పుచున్.

బల: అహో! వైరము పశ్చాత్తాపముగాఁ బరిణమించెఁగదా! (చెవియొగ్గి) అరే! ఏమీధ్వని?

చ॥ శరములు చాపముల్ కవచ
చామర తోమరముల్ రథంబులున్
గరిహయసూతయోధమృత
కాయములున్ బడియున్న శూన్యసం
గరతలమందు దుందుభియుఁ
గాహళి మ్రోఁగినయట్లు మ్రోఁగు ని
య్యురుతర కార్ముకం బెవరి
దో చద లెల్లను మాఱుమ్రోఁగెడున్.

[తెరలో — వింటిమ్రోఁత — పిదప]

ఆదిని విల్లు మ్రోఁగించుచు దుర్యోధనుంగూడి యీ సంగ్రామరంగమునఁ బ్రవేశించితిని. అంతమున మరల విల్లు మ్రోఁగించుచు దుర్యోధనుం గూడ నిందు ప్రవేశించుచున్నాను.

బల: ఓ! గురుపుత్రుఁ డశ్వత్థామ, ఇటు వచ్చుచున్నాఁడు.

గీ॥ కమలపత్రంబులం గేరు కన్నుదోయి
ధర్మయూపంబులం ద్రోయు బాహుయుగము
వెలయ గురుపుత్రుఁ డలరారు విల్లు పూని
శృంగలగ్నేంద్రచాపగిరీంద్ర మనఁగ.

[అంత నశ్వత్థామ ప్రవేశించును]

గీ॥ ఎందు దుర్యోధనుంగూడి యేను మొదట
విల్లు చేపట్టి పాదంబు పెట్టినానో!
మహితసంగ్రామయజ్ఞసమాప్తివేళ
నడుగువెట్టితి మరల నాయాగశాల.

(పాలికలను పరికించి) ఉభయసేనా సముద్రంబుల పరస్పరసంఘర్షణసమయమున నానావిధాయుధనక్రగ్రాహక్షతాంగులై నేలఁగూలిన రాజకుమారులలోఁ గొందఱింకను కొనయూపిరితో నున్నట్లు కనవచ్చుచున్నారు. కానీ! వారికే విన్నవించెద. ఓ రణవీరులైన రాజులారా!

చ॥ కపటమునం దొడల్ తెగిన
కౌరవరాజును గాను నేను, శా
పపువడి నస్త్రముల్ చెడిన
భాస్కరసూనుఁడఁ గాను నేను, శ
స్త్రపుఁ బస చూపి చాపశర
శక్తిని జూపి రణాంగణంబునం
దిపుడు జయధ్వజంబు నెగ
యింపఁగ వచ్చిన ద్రోణపుత్త్రుఁడన్.

విఖ్యాతినిగాని విజయమునుగాని చేకూర్పని శస్త్రాస్త్రచాతుర్యమును సంగ్రామనైపుణ్యమును నాకున్న నేమి లేకున్న నేమి? (పరిక్రమించి) నేను పితృకర్మ చేయుచు రణరంగమునకు దూరముగా నున్నాను గావున భీముఁడు మోసముచేసి కురురాజును గొట్టఁగలిగినాఁడు—అయితే నేమి? ఇపు డామాట యెవ రందురు? ఎవరు నమ్మెదరు? ఇట్టియెడ నాపరాక్రమము వ్యర్థము కావలసినదేనా? అహో కాలవైపరీత్యము!

మ॥ అల యేకాదశవాహినీపతులు గజేం
ద్రారూఢులై స్యందన
స్థులునై యేవిభు నానతిన్ శిరములం
దుం దాల్చిరో, జామద
గ్న్యులతోఁ బోరినభీష్ముఁ డొక్కయెడ ద్రో
ణుం డొక్కెడన్ దోడురాఁ
గలనం జొచ్చిన యా సుయోధను నిసీ!
కాలంబు మ్రింగెంగదా!

కానీ! ఆ గాంధారీనందనుఁ డెందుండెనో వెదకెదం గాక (పరిక్రమించి చూచి) అఁడుగో దుర్యోధనుఁడు. పడిపోయిన గజతురగాదులు, విఱిగిన రథాదులు పెట్టని ప్రాకారములై నల్దెసఁ గనవచ్చుచుండ, నడుమ సంగ్రామసాగరపారంగతుఁ డైన కురువీరుఁడు కూర్చున్నాఁడు. అక్కటా!

గీ॥ అస్తగిరిమీఁదితటమునం దధివసించు
నుష్ణరశ్మి యనంగ దుర్యోధనుండు
రుధిరసిక్తాంగుఁ డరుణ శిరోజుఁ డగుచుఁ
గలఁగి కూర్చుండి యున్నాఁడు కటికి నేల.

(సమీపించి) కురురాజా! ఏమిది?

దుర్యో: గురుపుత్రా! అసంతుష్టికి ఫల మిది—

అశ్వ: అయితే నిందు సంతోషము కలుగునట్లు సత్కార మొనరించెదను.

దుర్యో: నీ విపు డేమి చేయఁగలవయ్యా?

అశ్వ: అయితే మఱి విను—

చ॥ అనిమొన కేఁగుదెంచువనఁ
జాతుఁ జతుర్భుజు నాఖగేంద్ర వా
హను మునుముందుగా సునిశి
తాస్త్రములం బడఁగొట్టి పాండునం
దనుల నొకొక్కబాణమున
దర్ప మణంచుచు నేలఁ గూల్చి, వా

హానముల నుగ్గు చేసి, సమ
రాంగణముక్ ౹గముహీనరూపలే
ఖనములతోడ చిత్తరువు గాఁ గయి
చేసెద నీకుఁ గాన్కగా.

దుర్యో: వద్దు వద్దు గురుపుత్రా! ముందు విల్లు విడిచి పెట్టు—

గీ॥ నరపతు లస్తమించిరి మ
నంజేఁక భీష్ముఁడు, కర్ణుఁడుక్ ధను
ర్గురుఁడు గతించినారు, భట
కోటియుఁ దమ్ములు నూర్వురున్న శిం
చిరి, యిపు డేను నాకమును
జేరఁగ నుంటి నిఁకేల యుద్ధ? మె
వ్వరి నలరింతు? వెవ్వనికిఁ
బట్టము గట్టెదు ద్రోణనందనా?

అశ్వ: కురువీరా! అట్లనెద వేమి?

గీ॥ నీతి విడనాడి తెగఁగొట్టి నీదుతొడలు,
ధర్మముక్ దిగనాడి నీతలయుఁ దన్ని,
నీదుదర్పం బణంచిన యాదురాత్మ
సంహరింపక విడుతునే చాప మిపుడు?

దుర్యో: అట్లనరాదు. రాజులు మానశరీరులు, నేను మానముతోఁ జేసే పోరు సల్పితిని అంతే. ఇఁక నీవిచార మేల? ఇంతకును విను మొక్కటి—

చ॥ కరుణ దొలంగి లక్కయిలు
గాల్చితి మీసున ద్రౌపదిక్ దురో
దరసభలోని కీడ్చితి మ
ధర్మ జయంబున ధర్మజాదులక్
సిరి కెడలించి తోలితి మి
సీ! కడ ర్చితి మర్జునాత్మజుక్
గురుసుత! మా యకార్యముల
కుక్ సరివచ్చునె వారి దోషముల్?

అయితే, ఇపుడు నన్నేమి చేయు మందువు? "చీఁకటియుద్ధము చేసి పాండవులఁ బరి మార్చెద"నని యింతకును నేఁ ప్రతిజ్ఞ చేసియున్నాను. నీతోడు నాతోడు వీరలోకముతోడు. ఈమాట ముమ్మాటికి సత్యము సత్యము.

బల: అశ్వత్థామమాటనుబట్టి నిశాసమరము జరిగి తీరును.

అశ్వ: (అటుచూచి) ఓహో! పూజ్యుఁడైన హాలాయుధుఁడా!

ధృత: సరే కానీ! గురుపుత్రుని ప్రతిజ్ఞావాక్య మునకు గొప్పవాఁడు సాక్షి యైనాఁడు.

అశ్వ: దుర్జయా! ఇటు రమ్ము.

దుర్జ: (దగ్గఱకు వచ్చును)

అశ్వ: (చేయి పట్టుకొని)

గీ॥ ప్రాజ్య మీ హ స్తినగరసామ్రాజ్య మిపుడు
నిగ్రహంబున నార్జించె నీదు తండ్రి,
దీని కిఁకఁ రాజవై తేజరిల్లు
బ్రాహ్మణో క్తియె నీకు సర్వము కుమార!

దుర్యో: సరే! నామనోఽభీష్టము నెఱవేఱినది—నాప్రాణములు నన్ను విడుచుచున్నవి. (మీఁదు చూచుచు) అదిగో నాతాతముత్తాతలు శంతనుప్రముఖులు. వారే కర్ణపురస్సరులైన నాసోదరులు. ఇఁదిగో జనపాల కుఱ్ఱవాఁ డభిమన్యుఁడు, ఐరావతముమీఁద నింద్రునిప్రక్కఁగూర్చుండి కోపముతో నావంక చూచుచున్నాఁడు. అదిగో ఊర్వశీ రంభా తిలోత్త మాదులు నా కెదురు వచ్చుచున్నారు. అవిగో మహా సముద్రములు, ఇవిగో గంగా గోదావర్యాది మహా నదులు, ఇదిగో యమధర్మరాజు నాకోసము పంపిన వీరవాహిని యనెడి వేయి హంసల విమానము — ఇదిగో! వచ్చుచున్నాను. (యవనికాన్తరితుఁడగును)

ధృత:

గీ॥ ఈ తనయశూన్యరాజ్య మిస్సీ! యిఁకేల?
వృద్ధమునివాటికలకుఁ జేరెదను గాక,

సౌప్తికవధార్త మింక నేఁ జనెదఁ గాక.

అందఱు: [భరతవాక్యము]

ధర్మపరిపాలనక్ ధాత్రి దనరుఁ గాక.

# హిందీ సాహిత్యము ప్రాచీన యుగము

## శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

'హిందీ' అను శబ్దము అతివ్యాపకమైన అర్థమున వాడబడుచున్నది. ఇందు అనేకభాషలు, ఉపభాషలు, విభాషలును గలవు. అందు ముఖ్యమైనవి బ్రజభాష, 'అవధీ', 'రాజస్థానీ', 'మైథిలీ', 'భోజపురీ' మొదలైనవి. నేడు భాషగ చలామణీ అగుచున్న హిందీ 'ఖడీబోలీ' అను భాషయొక్క వికసితరూపము. ఇది తొలుదొల్త మేరట్ ప్రాంతమున మాటలాడబడుచుండెడిది. ప్రాచీన వాఙ్మయమున ఖడీబోలీకంతటి ప్రాధాన్యము లేదు. అయిన నొక ప్రశ్న ఉదయింపవచ్చును. ఇన్ని భాషలు, ఉపభాషలను గలిపి 'హిందీ' అని ఒకే నామధేయమున వ్యవహరించుట ఎట్లు? అని. తరువాతి ప్రశ్నము ఇవి పరస్పరము బోధ్యబోధకములా అని. ప్రసిద్ధ సంస్కృత హిందీ పండితుడగు బాబూ రామసాక్సేనా (తన యమూల్య గ్రంథమైన *Evolution of Avadhi* లో) ఈ సందేహమును క్రిందిపంక్తులద్వారా నిరాకరించెదను.

[*Finally it should be borne in mind that the various dialects of Hindi, Western or Eastern are mutually intelligible not only with regard to neighbouring dialects but others also. A speaker of 'Braj' can make himself intellgible in Oudh even to the uneducated people. The strict purity of the dialect is not ordinarily insisted upon.*]

"విభిన్నములుగా కానవచ్చు నీ పశ్చిమ ప్రాంతభాషలు కాని, ప్రాచ్యప్రాంతభాషలు కాని, యిరుగుపొరుగువారికే కాక దూరప్రాంతముల వారికికూడ సులభముగా బోధపడును. అని మనము నిశ్చితముగా గ్రహింపవలెను. బ్రజభాషను మాటలాడినచో అవధ ప్రాంతమందలి నిరక్షరకుక్షికికూడ బోధపడును. మాటలాడువారు ఆయా భాషలయందలి పరమ పారిశుద్ధ్యమునకై అంతగా పెనగులాడరు". పరస్పరము ఈ భాషలు బోధపడుటకై ఇవి అతిసన్నిహితములై, సులభమైన అర్థవ్యక్తిని కలిగియుండవలెను కదా. కనుకనే ఆయా భాషలయందలి సాహిత్యములకంతటికిని హిందీ సాహిత్యము అను పేరు విస్తృతమైన అర్థమున చలామణీ అగుచున్నది.

హిందీ సాహిత్య చరిత్రమును ప్రధానముగా నాలుగు యుగముల క్రింద వింగడింతురు. 1. వీరగాథా యుగము లేక చారణయుగము, 2. భక్తి ప్రధాన యుగము, 3. శృంగారయుగము (రీతికాలము), 4. ఆధునిక యుగము.

వీరగాథాయుగమునకుముందు పూర్వరంగముగా అపభ్రంశసాహిత్యము కలదు. కొందరు చరిత్రకారులు ఈ రెండుకాలముల మేళవించి ఆదికాలము అని వ్యవహరింతురు.1 మఱికొందరు వీరగాథాయుగమును చారణకాలమనియు 2 పేర్కొందురు. ఈ విభిన్న నామనిర్దేశములు రుచివైచిత్ర్యమును వెల్లడించునే కాని తద్వారా లభించు ప్రయోజన పర్యవసానము లించుమించుసమానమే.

నేటి హిందీకి అవ్యవహిత పూర్వకాలమున వర్ధిల్లిన భాష అపభ్రంశము. ఈ అపభ్రంశము చతురసేనాచార్యునిమతమున నాటి ఉత్తర భారతమునకంతటికి సామాన్యభాష.3 ఈ అపభ్రంశమునందలి వైవిధ్యమునుగూర్చి ముచ్చటించుట ఇప్పటి మనపని కాదు. ఈ భాషయందు ముఖ్యముగా బౌద్ధమతమునకు సంబంధించినవి, జైనమతమునకు సంబంధించినవి, పాత్రములు వెలువడినవి.

బౌద్ధమతము నాటికి వెర్రితలలు వేసినది. మహాయానము నాటి బౌద్ధము రానురాను తంత్రమార్గ ప్రధానమగు వజ్రయానముగను, అంతకంటెను వికృతమై సహజయానముగను పరిణామమును చెందినది. ఈ శాఖలకు చెందిన రచయితలు తమ రచనలను అపభ్రంశమునందే సాగించుచు వచ్చిరి. తొలినాటి అపభ్రంశము తద్భవపదబహుళమై, సంస్కృతశబ్దదూరమై సాగినది. పదునాలుగవశతాబ్దమునుండి అపభ్రంశమున తత్కాల పరిస్థితుల కనుగుణముగ సంస్కృతశబ్దములు నెలవు చేసికొన జొచ్చినవి. ఈ సాహిత్యనిర్మాణమున తొలినాళ్ల బౌద్ధులు, మలినాళ్ల జైనులు, కడనాళ్ల

1. హిందీకా సుబోధ్ ఇతిహాస్ — గులాబ్ రాయ్.

2. హిందీకా ఆలోచనాత్మక ఇతిహాస్ — రామకుమార్ వర్మ.

3. హిందీభాషా ఔర్ సాహిత్యకా ఇతిహాస్.

హిందువులు ఎక్కువగా తోడుపడినట్లు కానవచ్చెడిని. అట్లగుటకు కారణము ఆయామతస్థుల ప్రాబల్యము క్రమముగా క్షీణించుటయే కావచ్చును. ఎనిమిదవ తొమ్మిదవశతాబ్దములలో సిద్ధుల రచనలు కనబడెడి. పదునొకొండవ శతాబ్దము తరువాత బౌద్ధ సిద్ధుల రచనలు మంచునకైనఁ గానరావు. అట్లే పండ్రెండు పదుమూఁడవ శతములతరువాత ప్రసిద్ధ జైనకవి యెవడును మనకు పొడగట్టడు.

## : సరహపా :

బౌద్ధసిద్ధులలో సరహపా అనువాడు మొదటగా పేర్కొనదగిన కవి. ఇతని రచనాకాలము క్రీ. శ. 760 కానోపును. మహాపండిత రాహుల సాంకృత్యాయనుని మతమున ఇతడే తొలి హిందీ కవి. ఇతడు జాతిచే బ్రాహ్మణుడు. సాధనచేత బౌద్ధసిద్ధుడు. నలందా విశ్వవిద్యాలయమున తన బోధామృతమును శిష్య సంతానమునకు దోసిళ్లుగా కురిసిన మహానుభావుడు. భిక్షుజీవనమురోసి, తను వలచిన రంభను గైసేసి, సహజయానమును స్థాపించిన రసజీవి. ఐహిక సుఖముల రెండుచేతుల నాహ్వానించిన ధైర్యశాలి. ఈతని రచనములలో 'డాకినీగుహ్యవజ్రగీతి', 'తత్త్వోపదేశ శిఖరదోహాకోష్', 'వసంతతిలకదోహాకోష్' మొదలగునవి ముఖ్యములు. వాటి రచనావిధాన మీతీరుగా నున్నది :

ణ ఉ ణ ఉ దోహాచ్ఛన్దేణ, కహవి కిమ్పి గోప్ప
పణ్డిఅ వోఅహు ఖమహుమహు, విత్థుణ కిఅఇవి అప్పు
జోగురు బిఅణే మఇసుఅఉ; తహి కింకహమి సుగోప్పు.

"నవనవములైన ఊహోచ్ఛందముల గోప్యమైన విషయమును చెప్పవలెను. పండితులారా నన్ను క్షమింపుడు

## : స్వయంభూకవి (790. క్రీ. శ) :

పుట్టుకచేత బ్రాహ్మణుడు. మతముచేత జైనుడు రాష్ట్రకూటుల ఆశ్రయమున పెరిగిన మనిషి. రామాయణ మహాభారతముల రెంటిని మహాకావ్యములుగా తీర్చి దిద్దినశిల్పి. తులాదృష్టి (*Balanced View*) తో పదముల గుంఫించినవాడు. ప్రవహమానమగు శైలిలో, సజీవమగు భాషలో రచన సాగించిన సిద్ధహస్తుడు. ప్రకృతి వర్ణనమునందేమి, రాజవైభవముల చిత్రించుటయందేమి, అనితరసాధారణమైన ప్రతిభ వెలార్చినదిట్టు. ఇతని ప్రముఖమైన గ్రంథము 'పఉమ చరిఉ' (రామాయణము) దీనిలో 90 సంధులు (సరలు) కలవు. 83 తాను రచించినవి. మిగిలిన ఏడు తన పుత్రుడు త్రిభువనుడు పూర్తిచేసినవి. రచనాతంత్రమున పరవర్తి గ్రంథమగు తులసీరామాయణమునకు మార్గదర్శకము. చేపాయీ దోహాపద్ధతియే అనుసరింపబడినది. ఇతడు రచించిన 'హరివంశ పురాణము'ను మిగుల ఉపాదేయమైనది. రాష్ట్రకూటుల శుద్ధాంతములందలి భవనవిలాసముల నాకళించికొనినభోగికనుక నే ఈతడు తన కావ్యములయందు వైభవ ప్రాభవములకు నిలయములైన పట్టుల తన కలమును అత్యంత జయప్రదముగా నడుపగలిగినాడు.

## : కవిపుష్పదంతుడు (956 - 72 క్రీ. శ) :

స్వయంభువు కవి తరువాత ఎన్నదగిన ప్రతిభావంతుడు. ఈతని పౌరుష నామము 'అభిమాన మేరు' అన్వర్థమై యున్నది. స్వతంత్రప్రవృత్తి. స్వచ్ఛంద భావములు నీతని సొమ్ములు. వివిధవిషయములందును, అనుభవసాక్షాత్కార మితనికి గలదు. రాష్ట్రకూట చక్రవర్తి యగు కృష్ణుని సమకాలికుడు. నాడు కృష్ణభూపాలుని కతిపదునునకు కన్యాకుమారీ పర్యంత భూభాగము వెలుగొనియుండెను. పుష్పదంతుని జన్మము రోహతక్ ప్రాంతమునైనను రచనము దక్షిణమునందలి హైదరాబాదు రాజ్యమునందలి మాన్యఖేటయందుజరిగెను. మతమున జైనుడు. ఈ కవి రచనములలో 'తిసట్ఠి మహాపురిస గుణాలంకార' 'జసహర చరిఉ'(యశోధరచరిత్రము) అనునవిమాన్యములు.

## : ఇరువురు సర్వజ్ఞులు :

(1) శాంతిపా (1000 క్రీ. శ) (2) హేమచంద్రసూరి (1088 - 1176 క్రీ. శ) ఇందు మొదటివాఁడైన శాంతిపాదుడు బౌద్ధసిద్ధుఁడు. విక్రమశిలా విశ్వవిద్యాలయాధ్యక్షుడు. కూలంకషములైన పాండితీ ప్రాగల్భ్యములు కలవాడు. ఈతని గ్రంథము 'ఛందోరత్నాకరము' 'సుఖదుఃఖద్వయ పరిత్యాగ దృష్టి' ప్రసిద్ధములు. రెండవ సర్వజ్ఞుఁడైన హేమచంద్రసూరి జన్మమున వైశ్యుడు - మతమున జైనుఁడు. గుజరాతుప్రాంతమునందలి ధవక్కల పురము జన్మభూమి. ఈతని మూడు గ్రంథములు 1. ప్రాకృత వ్యాకరణము, 2 ఛందోనుశాసనము, 3. దేశీనామమాల ప్రసిద్ధములు. అనహిలవాడాయందలి సోలంకి రాజులు కర్ణుడు, కుమారపాలుడు మొదలగువా రీతని సమకాలికులు. కుమారపాలు డితని గురువుగా మన్నించెను.

## : అబ్దుర్ రహమాన్ (1010 క్రీ. శ) :

పదునొకండవ శతాబ్దారంభములో నే ఈ మహమ్మదీయ కవి తన రసస్నిగ్ధరచనములచేత సహృదయుల మెప్పించెను, ఇప్పటికి తెలిసినంతవరకు ప్రథమ

మహమ్మదీయ హిందీకవి ఈతడే యనవచ్చును. ఈతని కావ్యము 'సనేహరాసియ' రసవంతమైన దూత కావ్యము.

## జైనాచార్య మేరుతుంగకవి (11వ శతాబ్దము)

ఈతని 'ప్రబంధచింతామణి' చాల ప్రసిద్ధము. చాళుక్యరాజగు తైలపునిద్వారా పరాభూతుడైన ముంజుని దయనీయవృత్తాంతము ఈ హస్తమున గలదు. ఇది సంస్కృతమునందలి 'భోజప్రబంధము'ను అనుకరించును. ఉదాహరణము.

'ముంజ భణఇ, ముణాలవఇ,
జుబ్బణగయుం నఝూరి
జఇ సక్కర సయ ఖండ థియతోయిసీ మీఠీ ఖీ॥'

'ఓమృణాలవతి! చేజారిన యౌవనము గూర్చి చింతింపకుము. పంచదార నూరుఖండములుగా పొడి పొడిగా చేయబడినను దాని మాధుర్యమునకు కొఱంత యేమి' అని ముంజుడనుచున్నాడు.

## : కవిశార్ఙ్గధరుడు :

ఈతని 'శార్ఙ్గధర పద్ధతి' అను సుభాషితముల గ్రంథము ప్రసిద్ధము. ఇదిగాక ఈ కవి 'హంవీరరాసో' అను వీర రసప్రధాన కావ్యమునుగూడ రచించినట్లు పరంపరయా వినవచ్చుచున్నది. పుస్తకముమాత్రము నేటికిని అనుపలబ్ధము.

'శార్ఙ్గధరపద్ధతి' యందలి భాషాశైలి విచిత్రముగా నుండును. అటనట దేశభాషా శబ్దముల మేళగింపు కానవచ్చెడు. మల్లదేవ ప్రభు ప్రశంసార్థము వ్రాసిన వృత్తమును గాంచుడు:

'నూనం బాదల ఛాఇ ఖేహ పసరీ
నిశ్శ్రాణ శబ్దఃఖరః,
శత్రుం పాడిలుటాలి తోడ హనిసాం
ఏవంభణత్యుద్భటాః'

## : సోమప్రభ సూరి :

అపభ్రంశ సాహిత్యమున పేరొందదగిన రచయితలలో సోమప్రభ సూరి యొకడు. ఇతని కుమారపాలప్రతిబోధ యను గద్య పద్యమయ సంస్కృత ప్రాకృత కావ్యము ఎన్నదగిన రచనా పాటవమున వన్నెకెక్కినది. ఈ రచనమున సిద్ధపాలుడను కవి కూడ కొంతభాగమును పంచికొనినాడు.

'రావణ జాయఉ జహిం ది
అహిద హముహ ఏక సిరీరు
చింతా వియత ఇయహిం
జణణి కవణు పియావ ఉంఖీరు'

'పదితలల రావణునకు జన్మించిన దినముననే ఆతనితల్లి ఈబిడ్డకు ఏనోటితో పాలు త్రాగించవలెనబ్బా! యని తల్లడిల్లెను'

అపభ్రంశ రచనాపరంపర సమాప్తమైనపిమ్మట, ఒక ఏబది అరువది సంవత్సరముల తరువాత తన రచనల ద్వారమున పునఃతత్సంప్రదాయోద్ధారము కావించిన వారిలో 'మైథిలి కోకిల' 'అభినవ జయదేవ' బిరుదాంకుడు శ్రీ విద్యాపతి కవిశేఖరుడు (1400 క్రీ. శ) ప్రముఖస్థానము వహించుచున్నాడు. దేశభాషా కావ్యధారయొక్క ఉద్గమకాలమునను, అపభ్రంశ సాహిత్యధారావసాన కాలమునను నిలఁబడి నైపుణ్యము తెరిగిన తన కలము చిందులతో సాహితీ సరణుల రెంటికిని పుష్టి, తుష్టి చేకూర్చిన సిద్ధహస్తుడు. ఏతత్కవికృతములైన 'కీర్తిలతా' 'కీర్తిపతాకలు' అపభ్రంశమున ప్రసిద్ధములు. 'కీర్తిలత' యను గ్రంథము యొక్క జాడ కనిపెట్టినవారు సుగృహీత నామధేయులగు మహామహోపాధ్యాయ శ్రీ హరప్రసాద శాస్త్రి వర్యులు. నేపాలునందలి రాజకీయ గ్రంథాలయమున మఱుగుపడియున్న దానిని వెలుగునకుఁ దార్చిరి. ఈ హస్తమున తిర్ హుత్ భూపాలుడైన కీర్తిసింహుని ధైర్య స్థైర్య బలపరాక్రమాదులు అభివర్ణితములు. చేపాయి, ఛప్పయి, దోహా మొదలగు ఛందములు నిబంధింపఁబడినవి భాషాదృష్టితో చూచినయెడల అపభ్రంశము తొలినాళ్ల సంస్కృత పదజాలమును తీవ్రముగా బహిష్కరించి పైచినది. రానురాను సంస్కృత వైముఖ్యము తొలగి తత్సమపదస్వీకారము జరిగినది. విద్యాపతి కావ్యముల పరికించితిమేని ఈ సత్యము ప్రమాణిత మగును. విద్యాపతి కావ్యభాషయందు దేశభాషాపదజాలముకూడ అధికముగనే కానవచ్చుట మరియు శుభసూచనము. 'నగర' మునకు 'నఅర్' అని 'విద్య' కు 'విజ్జా' అని 'వచన' మునకు 'వఅణ' అని మాత్రమే చెప్పికొను కాఠిన్యము తొలగినది. ఉత్తరకాలమున దేశీయ పదజాలముతోబాటు తత్సమశబ్దములకుకూడ యథోచితమైన అవకాశము కల్పింపబడినది. కాగా విద్యాపతి కావ్యభాష కేవల ప్రాకృతనిబంధనలకు లోబడక కొంత స్వాతంత్ర్యము ప్రకటించినదని మనము గ్రహింపవలెను.

ఉదాహరణము:—

'పురిసత్తేణ, పురిసఉ, నహి పురిసఉ జమ్మమత్తేన
జలదానేనహు జలజో, నహుజలజో పుంజిజోధూమో!'

"పురుషకారము చేత పురుషుడగును కాని, జన్మమాత్రము చే పురుషుడనిపించికోఁదగఁడు. జలదము, జలములనిచ్చి సార్థకమగును కేవల పుంజీభూత ధూమమును జలదమనలేము"

జర్మన్ కథ

# * కవిగారి తోట *

## వెర్నర్ బెర్గెన్‌గ్రూ

మార్కస్ రూట్స్ రేవాల్* నగరంలో పుట్టాడు. వీళ్ళ నాయన ఆనగరంలో పేరు ప్రఖ్యాతులను గడించిన వర్తక శిరోమణి. వంశపారంపర్యంగా వస్తూవున్న వర్తకంమీద రూట్స్‌కు మనసు పోలేదు. చిన్నప్పటినుంచీ కవిత్వధోరణిలోపడ్డాడు. ఎన్నో నాటకాలను రచించాడు. వాటిని ఆప్రాంతాలలోని నాటకశాలలు జయప్రదంగా ప్రదర్శించాయి. దాంతో రూట్స్ వెర్రి మితిమీరిపోయింది. తానే పెద్దకవిననీ, నాటకాలను వ్రాయటంలో, పద్యాలను అల్లటంలో తనదే సిద్ధహస్తమని రూట్స్ నిరంతరమూ అనుకుంటూ వుండేవాడు.

ఇట్టి తలపు మనసులో నాటిన తరువాత ఇక దాన్ని అరికట్టటానికి ఎవరికి సాధ్యమవుతుంది? లత మాదిరి శరీరాన్నంతా గబగబా ప్రాకిపోతుంది. మన ధ్యానమంతా దానిమీదే! అది వేసే ఆకులను చూస్తూ వుంటే, వాటిలోనుంచి పైకి వచ్చే మొగ్గలనూ, పూలనూ చూస్తూవుంటే, ఇక తక్కిన ప్రపంచం సంగతి ఆలోచనలోకి ఎలా వస్తుంది?

కొంచెం పెద్దవాడయ్యాక రూట్స్ తన మాతృదేశానికి ఒక నమస్కారం పెట్టి ఇటలీదేశానికి వచ్చేశాడు. కన్నులపండువుగావున్న ఇటలీ సముద్రతీరానున్న ఒక కుగ్రామంలో జీవితం సుఖంగా గడుపుకోటానికి నివాస మేర్పాటుచుకొన్నాడు. తాను కట్టిన ఇంటికి "విల్లా పర్నాసో" అని పేరుపెట్టాడు. ఇంటి చుట్టూ పెద్దతోటను వేశాడు. దానో ఎన్నో రకాల ఫల వృక్షాలను పెంచాడు. పురాతన రోమను శిల్పాలను సంపాదించి, తోట మధ్యనే వాటి అందచందాలకు అనుగుణ్యములైన వేదికలను నిర్మించి, వాటిమీదే ఈశిల్పాలను అమర్చి ఆనందించాడు. గ్రీసులూ, రోమన్లూ, పూర్వకాలాన కవిసామ్రాట్లను సత్కరించటానికి ఉపయోగించుతూ వుండే, పూలమొక్కలను సేకరించి ఈతోటంతా నాటి పెంచాడు.

దీన్తో తాను కళోపాసకుడననిన్నీ, ప్రాచీన కవుల మాదిరే కవిత్వాన్ని ఏకధారగా అల్లగల్గే శక్తి సంపద తనకే అబ్బిందని భ్రాంతి పడ్డాడు. కాని, పాపం ఈవూరికి వచ్చినప్పటినుంచీ కవితా రచనకుమాత్రం అవకాశం దొరికింది కాదు. తండ్రిపోయ్యాక, కుటుంబ ఆస్తి అంతా రూట్స్‌కే వచ్చింది. దాంతో కాలుమీద కాలు వేసుకొని హాయిగా జీవితరథాన్ని నడపేటప్పుడు కవిత్వంఅల్లి బ్రతకవలసిన అవసర మేముంది మరి. జీవితమే రసోపేతం. దాన్ని అహోరాత్రాలు ఆస్వాదించుతూవున్నప్పుడు ఈ లోకంతో మరేం అవసరం? ఈ కవిత్వరసమే తన బలసంపత్తి. శక్తి సంపత్తి. తన రచనలు డాంటే, బైరనుపథాలనే అనుసరించాయి. వాళ్లు కవితాప్రపంచాన అగ్రతాంబూ

* రేవాల్ నగరం బాల్టిక్ తీర దేశాల్లో ప్రసిద్ధికెక్కిన ఎస్టోనియా ముఖ్య పట్టణం. నాలుగైదువందల సంవత్సరాలనుండి జర్మనులు ఈప్రాంతాలకు వలసపోయి దేశమందలి ముఖ్యస్థానాలన్నిటినీ ఆక్రమించుకొన్నారు. సామాన్య ప్రజాంగం రష్యను భాషనుంచి వచ్చిన ఎస్టోనియన్ను మాట్లాడుతూ వున్నా వలసవచ్చిన జర్మన్లు జర్మను భాషలోనే అనుదిన వ్యవహారాలను జరుపుకొంటారు. పాఠశాలల్లో, కళాశాలల్లో జర్మనుభాషకే ప్రాధాన్యతను ఇచ్చారు. అధికారవర్గమూ జర్మనుభాషనే తప్పక నేర్చుకొని తీరాలి. ఎస్టోనియన్లూ జర్మను భాషనే తప్పని సరిగా నేర్చివుండాలి.

అనువాదం: శ్రీ వి. యస్. శర్మ

లాన్ని పుచ్చుకొని చిరంజీవు లయ్యారు. తన కవితామృతాన్ని తన దేశీయులు గుర్తించి ఆనందించే భాగ్యం లేకపోయినా ... ఫరవాలేదు. భవిష్యత్తే దీన్ని క్రమేణా తెలుసుకొంటుంది ... అంతవరకూ వోపికపట్టి వుండితీరాలని రూట్స్ అప్పుడప్పుడూ అనుకొనేవాడు...

రూట్స్ వల్లించే పద్యాలు అర్థం కాకపోయినా, తన గొప్పతనాన్ని గురించి పదేపదే ఇచ్చే వుపన్యాసాలు — అన్నీ జర్మను భాషలోనే కాదూ మరి? — బొత్తిగా అర్థం చేసుకోటానికి శక్తి లేకపోయినా, రూట్స్‌కు ఉపచారాలు చేస్తూవున్న ఇటలీ స్త్రీ మాత్రం ఆయన్ను ఎంతో మెచ్చుకొనేది. తన ఇటలీ సంస్కృతికీ, ఆతని స్లావిషు సంస్కృతికీ ఎంతో తారతమ్యమున్నా, ఆవిడకు రూట్స్ అంటే పరమప్రాణం. అట్టి కవి సామ్రాట్టుకు సేవచేసే భాగ్యం తనవంటి బీదస్త్రీకీ, మూర్ఖురాలికీ, లభించడం అదృష్టం కాక మరేమని దాన్ని అనాలి! ఆవూళ్లో వాళ్ల సంగతో? వాళ్ళూ ఆయన్ను ఎంతో మర్యాదతో చూచేవారు. ఆయన చెప్పే మాటలనుబట్టే ఆయన ఇప్పుడు వీళ్లమధ్య నడిపే జీవితమార్గాన్ని పట్టే ఆయన పెద్దకవే అయివుండాలి. తాను వ్రాసిన కావ్యాలద్వారా ఎంతో ధనాన్ని ఆర్జించుతూ వుండాలి అని తలంచేవారు. ...

రూట్స్‌కు పై పటాటోపం ఎంత వున్నా స్వాభావరీత్యా మనిషి మంచివాడే. సరసుడే. ఉదారవంతుడే. గ్రామీణుల కష్టనిష్ఠురాలను తనవిగా నేభావించి వాళ్ళకెప్పుడూ ఏదోవిధంగా సహాయం చేస్తూవుండేవాడే. అటు కవి, కళారాధకుడు. ఇటు జాలిగుండెగలవాడూ, త్యాగీ — ఇట్టి కవికుమారుడు తమ గ్రామంలోనే నివసించటం తమ భాగ్యమనే ఆవూరిలోని అమాయకులు అనుకుంటూవుండేవారు.

ప్రవక్తకైనా తన స్వదేశంలో గౌరవ మర్యాద లేమాత్రం వుండవనే ఆర్యోక్తి రూట్స్‌కు బాగా తెలుసు. అంతేగాదు? దాని నిజతత్వాన్ని తన జీవిత ఘట్టాల్లోనే గుర్తించాడు కూడా!

అందుచేత నేకాబోలు, క్రింది పాఠశాలలోని చదువూ, ఉన్నతవిద్యాలయంలోని శిక్షణా పూర్తి చేశాక, మామూలుగా రేవాలు నగరంలోని విద్యార్థులందరిలాగా ఆనగరానికి సమీపంలోవున్న డోర్పాటు విశ్వవిద్యాలయంలో అడుగు బెట్టక, స్వదేశాన్ని పూర్తిగా వదిలిపెట్టి జర్మనీదేశానికి వెళ్లిపొయ్యాడు.

తన మాతృనగరమైన రేవాల్ సంగతి తల పెట్టినవాడే కాదు.

తమ నగరంలో పుట్టి పెరిగి పరాయిదేశంలో తమ వూరివాడే జీవితయాత్రను గడపుతూవున్నాడనీ, ఆమనిషి ఏవో నాటకాలను వ్రాశాడనీ, వాటిలో కొన్నిటిని పరాయిదేశీయులే చదివి ఆనందించుతూ వున్నారనీ, కొన్ని నాటకశాలలు వీటిని ప్రదర్శించుతూవున్నాయనీ, రేవాలునగరవాసులు చూచాయగా విన్నారేకాని, అట్టి కవిరత్నం ఎక్కడ వున్నాడు, ఇప్పుడతడేమి చేస్తున్నాడు అనే సంగతిని మాత్రం ఎవరూ పట్టించుకోలేదు.

దీంతో రూట్స్‌కు తన స్వంత వూరివాళ్లే తన్నింత చిన్నచూపును చూస్తున్నందుకు పటరాని కోపం వచ్చింది. ఇక బంధుమిత్రాదులమీద రూట్స్‌కు రేగిన మాత్సర్యాన్ని వివరించాలా? రేవాలు నగరవాసులు అజ్ఞానులు. తన గొప్పదనాన్ని అట్టి మూర్ఖులు ఎలా తెలుసుకోగల్గుతారు? ఇక ఆ నగరపు నాటకశాల విషయాన్ని తలచుకొంటే — తన కవిత్వాన్ని ప్రపంచమంతా శ్లాఘించుతూ వున్నది! తాను వ్రాసిన నాటకాలను అన్నిదేశాలవారు నాటకశాలల్లో ఆడి ఆనందించుతూవున్నారు! కాని తన స్వగ్రామంవారో! ఆ వూళ్ళో పెద్ద నాటకరంగం వున్నా, పరాయివాళ్ల నాటకాలను ఆడుతూవుండి కూడా, తన నాటకాల్లో ఒక్కదానినైనా అంగీకరించి ప్రదర్శించినవారు కారు. ఈ విషయం ఆలోచిస్తూ వున్నప్పుడు రూట్సు ఆకారాన్ని చూచి తీరాలి! ఆ రూపాన్ని చిత్రించటం అంత సులభం కాదు.

రేవాలు నగరవాసులకు సంస్కృతిమీద ఏమాత్రం అభిమానం లేదని వాళ్ళను తిట్టిపోసేవాడు. వాళ్ల ధ్యానం అహోరాత్రాలు డబ్బుమీదే! దాని మీద వున్నంత కాంక్ష మరి దేనిమీదా బొత్తిగా లేదు. అట్టి పశువులు ఈలోకాన ఎందుకు పుట్టాలి?.. ముసలితనం దాపరించిన తరువాతకూడా రూట్సు ఈ అవమానాన్ని మరిచిపోలేదు. తన వూరివాళ్లే తనవంటి మహాకవిని అవమానపరుచుతున్నారే అన్న బాధ మితిమీరిపోయింది. వాళ్ల అజ్ఞానాన్నీ, లోభత్వాన్నీ హేళనచేస్తూ ఆ వృద్ధాప్యంలో రూట్సు కొన్ని పద్యాలను అల్లి తనలో రేగిపోతూవున్న కోపాన్నంతా వెళ్లగక్కివేశాడు. అంతతో శాంతించలేదు. తన గొప్పదనాన్ని గుర్తించజాలని ఈ మూర్ఖులకు బుద్ధి చెప్పాలి! ఆలా చేస్తేనే గాని వాళ్లు తమ నగరంలోనే ఒక కవి జన్మించాడనీ, అతని కీర్తి

అన్ని దేశాల్లో వ్యాపించి తమ నగరానికి పేరు ప్రతిష్ఠలను తెస్తున్నదనీ, తద్వారా తమ రేవాల్ నగరం పేరు ప్రపంచ పటంలో శాశ్వతంగా వుండిపోతున్నదనే గర్వం, భక్తివిశ్వాసాలు వాళ్లకు కుదరవు......దీనికోసం ఏంచెయ్యాలి? ఇదే ఆలోచన రాత్రింబగళ్లూ, ఎంతో కాలం ఆలోచించాడు! ఒకరోజున ఈ ఆలోచనా సముద్రంలో యీదుతూ వుండగా తళుక్కున మెరుపులా ఒక అభిప్రాయం తోచింది.

తాతముత్తాతలు కట్టించిన లోగిలి రేవాల నగరంలో రున్‌వీధిలో తన స్వాధీనంలోనే వుంది. దాన్ని కొంచెం విశాలవంతంగా చేసి పెద్ద కర్మాగారంక్రింద మార్చివేశారు. తాను పుట్టింది ఆ ఇంట్లోనే. బాల్యదశనంతా గడిపిందీ అక్కడే. దాన్నే తాను స్వాధీనం చేసుకోవాలి, అక్కడే రూట్సు మ్యూజియాన్ని స్థాపించాలి. అలా మార్చటానికి ఎంతఖర్చయినా పరవాలేదు. ఆ పనినే నిర్విఘ్నంగా కొనసాగించితే, తన ప్రణాళిక కార్యరూపాన నిలిచిపోతుంది. అందు ఏయే సామగ్రిని వుంచితే బాగుంటుందో ఆ విషయాలన్నీ చక్కగా ఆలోచించాడు........

తానా వృద్ధాప్యంలో వున్నాడు. ఈ ఘటం గతుక్కున ఎప్పుడు పోతుందో? ఆ సంగతీ కొంచెం ఆలోచించటం మంచిదే కాదూ? తన కళేబరాన్ని ఎక్కడ భూస్థాపన చేస్తే బాగుంటుందో ఆ విషయాన్ని చక్కగా ఆలోచించాడు. తాను ఇప్పుడు నివసిస్తూవున్న విల్లా పార్నాసోకు సమీపాన్నే ఈ పనికి అనుకూలమైన స్థలాన్ని కొన్నాడు. దేహం భూస్థాపితమైన తర్వాతి దానిమీద కట్టవలసిన సమాధికి సంబంధించిన ప్లానులను తయారుచేశాడు. సమాధి చుట్టూ చక్కగా నీడనిచ్చే చెట్లను నాటాడు. పూలంటే తన కెంతో ప్రాణం. ఎన్నో పుష్పలతలను దానిచుట్టూ నాటాడు. సమాధిమీద అఖండం ఎప్పుడూ వెలుగుతూ వుండాలి. ఆ చుట్టుప్రక్కల గ్రామాలవారికి ఆ వూరిమీదుగా ఇతరవూళ్లకు వెళ్లే రాత్రి కాలంలో ఈ దీపమే దోవచూపుతుంది. దాన్ని చూస్తూ అందరూ ఈ ప్రాంతంలో కూడా తన పేరును నిరంతరం స్మరించుతూ వుంటారు.

అక్కడే తన భౌతికదేహం శాశ్వతంగా విశ్రాంతి బుచ్చుకోవాలి. ఇక తల సంగతి?...దాన్ని దేహాన్నుంచి వేరుచెయ్యాలి. మందు ద్రావకాలతో దాన్ని జాగ్రత్తచేసి తన జన్మస్థానానికి పంపాలి. అక్కడి సాహిత్యసంఘపు పెద్దలు మ్యూజియం తయారయేవరకూ తమదగ్గిరే వుంచుకొని, భక్తిశ్రద్ధలతో మ్యూజియం హాలులో ప్రత్యేకంగా దీనికోసరం ఒక వేదికనుకట్టి దానిమీద అమర్చాలి. రేవాలు నగరంలో చదువుసంధ్యలు నేర్చినవారు కొద్దిగానేవున్నా, అందరూ సాహిత్యపరులమనే ప్రగల్భాలు కొట్టేవాళ్ళే. ఆ నగరపు సాహిత్యసంఘంలో కూడా ఇట్టివాళ్లదే పెత్తనం. వలసవచ్చిన జర్మనుపండితులూ సామాన్య జనమూ, అనాది నుండీ వస్తూవున్న ఈ సంప్రదాయాన్ని ఏమాత్రం మార్పుచేసినవాళ్లు కాదు. తానూ వాళ్ల మార్గాన్నే నడిచి ఆ మ్యూజియాన్ని నిర్మించవలసిన బాధ్యత, తన తలను అందులో ప్రదర్శించవలసిన బాధ్యతా అంతా ఆ నగరవాసులకే అంటగట్టాలి. దాంతో వాళ్ళూ తృప్తిపడుతారు. తన పేరునూ చిరస్థాయిగా తద్వారా నిలుపటానికి చేయవలసిన కట్టుదిట్టాలనూ చక్కగానే చూచుకొంటారు......

ప్లానులను వేయటంలో రూట్సుకు పెట్టిందే పేరు. ఊరికే ప్లానులను వేయడంతోనే ఆనందించే ఘటంకాదు. వాటిని కార్యాచరణలో పెట్టటంలో కూడా రూట్సు ఎంతో చాకచక్యం గలవాడు...

ఆ వూరికి కొంచెం దూరంలోనే వెరోనా పట్టణంవుంది. మజినీ వీధిలో సెర్రా సోదరుల కంపెనీ వుంది. ఈ కంపెనీవాళ్లకు ద్రావకాలతో మృతకళేబరాలను చక్కచేసి జాగ్రత్త చెయ్యటంలో ఎంతో నేర్పువుంది. వీళ్లకే ఆ పనిని వదిలివేస్తే మంచిది! దానికి అవసరమైన సొమ్మును కంపెనీవాళ్ళకు పంపాడు. వీళ్లే తలను బహు జాగ్రత్తగా అమర్చటానికి కావలసిన పెట్టెనూ — అది ఏ సైజులో వుండాలో, తలను దాన్లో ప్యాకుచేసేటప్పుడు ఏయే పూలనూ, ఆకులనూ ఏవిధంగా వాడాలో అన్ని వివరాలను కంపెనీవారికే రూట్సు వ్రాతమూలకంగా తెలిపాడు. ... ఈ ప్రాంతాలవాళ్ళకు భూగోళజ్ఞానము బొత్తిగా లేదు. తమదేశంలో ఫలాని నగరం ఎక్కడవుందో తెలుసుకోటానికే కషపడ్డారు. పేరుకు ఒకటీ రెండూ పట్టణాలున్నా, ఈ ప్రాంతంలో వున్నవి అన్నీ కుగ్రామాలే. అట్టి అవస్థలో వాళ్ళకు రేవాలు నగరం ఎక్కడవుందో ఎలా తెలుస్తుంది పాపం? అయిరోపా పటాన్ని వ్రాశాడు. తానున్న గ్రామం ఎక్కడ వుందో దాన్లో గుర్తు పెట్టాడు. అక్కడినుంచి పెద్ద ఓడరేవుపట్టణం చేరటానికి దోవను చూపాడు. ఆదోవలోనుంచే ఆస్ట్రియామార్గాన ఎలా ప్రయాణం

చేసి వెళ్లితే రేవాలు నగరానికి చేరుకోవచ్చునో ఆ వివరాన్ని పటంలోనే చక్కగా చూపాడు. ఈ పెట్టె రేవాలునగరానికి చేరేటంతవరకూ ఆ రహస్యాన్ని ఎవరికీ తెలుపకూడదని ఇంటావిడకు చెప్పాడు. ఆ కాగితాన్ని సీలుచేసి ఆవిడ చేతికి వప్పచెప్పాడు. ఆవిడ సంగతి నేమాత్రం మరిచిపోయ్యేవాడ్ని కానని ఆవిడ జీవనోపాధికి కావలసిన సదుపాయాలనూ వీలునామాలో పుసహరించాననీ చెప్పి, ఆవిడను ఎంతో తృప్తిపరిచాడు.

## 3

పుట్టినవాళ్లందరూ చచ్చిపోతారు. ఇది ప్రకృతి సహజం! దీన్ని ఎవరు ఆపగలరు?

మన కవి మిత్రుడు రూట్స్ మరణించాడు. మరణశాసనాన్ని అధికారులు అంగీకరించారు. శవపేటికను సిద్ధం చేశారు. మరునాటి మధ్యాహ్నకాలాన అంత్యక్రియలను జరపాలి; ముసలావిడ ఆ సాయంకాలాన బెనాటీ ఇంటికి స్వయంగా వెళ్లింది.

బెనాటీ ఆవూళ్లో మంగలిపని చేసేవాడు. ఇటలీ దేశీయులు — పెద్ద నగరాల్లో నివసించేవాళ్లే కాదు — గ్రామాల్లో వున్న వాళ్లు కూడా కవిత్వమంటే చెవికోసుకొంటారు. ఈ గాలే మన బెనాటీకీ సోకింది. దాంతో పరాయిదేశపు మహాకవి తన గ్రామంలోనే వున్నాడు. గనుక ఆయన క్షురకర్మను ఇంతకాలమూ బెనాటీయే స్వయంగా చూచుకొనేవాడు. కవితా ధోరణిని గురించే రూట్సుతో ఆ పని చేసేటప్పుడు చర్చించుతూవుండేవాడు. వృత్తిరీత్యా మంగలి అయినా బెనాటీ కవితా పుత్రుడు కాక మరేం అవుతాడు? తన మాతృభాషలోనే ఎన్నో పద్యాలను అల్లాడు...ఆ వూరి మతాచార్యుని షష్ఠిపూర్తి మహోత్సవం సందర్భాన పెద్ద సభ జరిగినప్పుడు బెనాటీ తానూ పెద్దకవినే అనిపించుకోటానికి ఆయన త్యాగాన్ని ప్రశంసిస్తూ కొన్ని పద్యాలను వ్రాశాడు. చేరువనున్న పట్టణంలో సంగీత విద్యాలయంలో సంగీతశాస్త్రాన్ని అభ్యసించుతూ వున్న అమ్మాయి, పెద్ద ముస్తాబు చేసుకొని సభావేదికపైకెక్కి బెనాటీ వ్రాసిన పద్యాలను రాగయుక్తంగా చదివి సభలోవున్న వాళ్లందరినీ ఆనంద సముద్రంలో ముంచివేసింది.

ఆముసలావిడ బెనాటీని కలుసుకొని ఇకముందు జరుగవలసిన కర్మకలాపాన్నంతా వివరించి చెప్పింది. ఆ పనినంతా తానే చూచుకొంటానని — మహాకవి శిష్యుడు కాదూ ఈ బెనాటీకవి కూడా — అభయ హస్తమిచ్చాడు.

సీలుచేయబడ్డ ఉత్తరాన్ని బెనాటీ చేతి కిచ్చింది. దాన్ని తెరిచాడు...సాంతంగా చదివాడు. దిన్ని గురువుగారే స్వదస్తూరితో వ్రాశాడు...బల్లను గట్టిగా గుద్దేశాడు. తల వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. దేహమంతా కంపించిపోయింది......తన ముందున్న అద్దంలో తన వికారపు రూపాన్ని ఒక్కసారి చూచుకొన్నాడు...గుండెలు గబగబా కొట్టుకోసాగాయి. కళ్లు తిరిగిపోయ్యాయి నోటినుంచి మాట వస్తే కాదూ? ..కొంచెంసేపటికి ఈ గాభరా నుంచి తప్పుకొన్నాడు. "అలా చేయడమా?...... అసంభవం! అసంభవం! దాన్ని నేనే చెయ్యాలా మరి?" అని అరిచాడు. "ఎంత ఇచ్చినా ఇలాటి పని చేయగలనా? నన్నే నా చేయమంటాడు" అని వుద్రేకంగా అన్నాడు.

ఈ లోకంలో ఎంత వుంటే నేం? దాన్నంతా ఏం చేశాడు? ఎవరికి ఇచ్చివేశాడు? ఆయనకు ఇన్నాళ్లూ శిష్యత్వం చేశాను. ఆ వాత్సల్యానికీ ఆ విశ్వాసానికీ, ప్రతిఫలంగా — అందు ముఖ్యంగా ఇలాంటి పని చేయటానికి ఆయన ప్రతిఫలంగా ఇచ్చేది మూడువందల లీర్లేనా? (మన చెలామణిలో ఏభయి రూపాయలు మాత్రమే)...ఈ గొడవనే అర్ధ గంటసేపు బెనాటీ ఆవిడతో తర్జనభర్జనలు చేశాడు. పాపం ఆవిడ ఏం చేస్తుంది? ఏమని జవాబిస్తుంది?... గొణుక్కొంటూ ఆవిడ వెనకాలే విల్లా పర్నాసోకు బయలుదేరాడు ......

సూర్యుడు అస్తమించాడు. జోరున వాన; హోరుగాలి. దానికితగ్గట్టు చీకటి; ఇద్దరూ బాగా తడిశారు. చలి, చెప్పరానంత చలి. దాన్ని భరించలేక పోయ్యారు. ఏలాగయితే నేం ఈ పెనుభూతాన్ని తప్పించుకొని విల్లాపర్నాసోకు చేరుకొన్నారు.

బల్లమీద అన్నం అమర్చబడివుంది. ఘాటైన పానీయాలు బల్లమీద వున్నాయి. వాటిని చూచేటప్పటికి బెనాటి ప్రపంచాన్నే మరిచిపొయ్యాడు. తాను వానలో తడిశానని, చలిలో బాధపడ్డానని, వీటిని చూచినతక్షణమే విస్మరించాడు. ఇక ఆ వుత్తరంలోని విషయాలు ఎలా జ్ఞాపకానికి వస్తాయి?

బెనాటీకి పానీయాలంటే, ముఖ్యంగా ద్రాక్షాసవమంటే ఎంతో ఇష్టం. దాన్ని రుచి చూట్టానికి ప్రారంభించడా, సర్వం మరచిపోతాడు! ఆవిడకు

ఈ రహస్యం చక్కగా తెలుసు. ఎన్నోరకాల ద్రాక్షరసాలను చేర్చి గ్రప్పా పానీయాన్ని బెనాటే కోసమే ఆనాడు సిద్ధంచేసి వుంచింది. దీన్ని కొంచెం పుచ్చుకోండి బలం వస్తుంది. కొత్తశక్తి వస్తుంది. లోనికి రావటమే తరువాయి బల్లదగ్గిర కూర్చున్నాడు. అన్నాన్ని ముట్టాడో లేదో...గ్రప్పా పానీయాన్ని ఎంత పుచ్చుకున్నాడో చెప్పలేం. బల్లమీది సీసాలన్నీ ఖాళీ అయ్యాయి. ఇంకొక సీసాను తెచ్చిఇచ్చింది. దాన్ని చేతిలోకి తీసుకొని బెనాటే లేచాడు. కవిగారి గదిలోకి ప్రవేశించాడు. శవపేటిక అక్కడేవుంది. మూతను తీశాడు. ముఖానికి కప్పబడ్డ గుడ్డనుతీసి రూట్సు ప్రేతంవంక ఒక్కసారి చూచాడు. ఔనౌను చావుకళలు బాగానే అవుపడుతున్నాయి అన్నాడు. ఆవిడ ప్రక్క గదిలో కూర్చుని మేజోళ్ల మరమ్మత్తులో నిమగ్నురాలయి వుంది. కాని ఆవిడ ధ్యానమంతా ఆ వంకే...బెనాటే అంటున్న మాటలను వింటూనే వుంది. అలా అనటం మంచిదికాదు. కవి ఆత్మ ఆయన సమీపాన్నే వుంటుంది. అలా అంటే ఆయన ఆత్మకు ఎంతో బాధ కలుగుతుంది. దీన్ని బెనాటే తెలుసుకోవాలి అని తనలో తానే గొణుగుకోసాగింది...

వేకువజామునే లేచాడు. బయట కారుమబ్బులు. వాన జోరుగా కురుస్తున్నది. చలి, చలి, ...వొళ్లంతా వణికిపోతున్నది...బెనాటే లేచేటప్పటికే వేడివేడి కాఫీ తయారుచేసి ఇచ్చింది. దాన్ని పుచ్చుకున్నాడు. దాంతో పాటు గ్రప్పారసాన్ని తనివితీర రుచిచూచాడు. బయట ఎలావున్నా మనస్సు స్థిమితపడ్డది...

చేయవలసిన కర్మకలాపాన్నంతా గత రాత్రే పూర్తిగా ముగించాడు. అక్కడే పండుకొన్నాడు. నిద్రరాదు, ఎలా వస్తుంది మరి? ఆ ఘట్టాలను తలంచుకొంటూ వుంటే? కొన్ని నిమిషాలు కళ్ళు మూసుకోటానికి ప్రయత్నించాడు. కాని నిద్రవస్తే కదూ!...

ఇక ఆలస్యమేమాత్రం చేయకూడదు. పడవల రేవుకు శీఘ్రంగా నడవాలి. అప్పుడు బయలుదేరే పడవలో వెళ్ళితేనేగాని వెరోనా బండికి చేరుకోలేడు. ఆవిడవద్ద సెలవు పుచ్చుకొని, ఆ జోరువానలోనే రేవు స్థలానికి గబగబ నడిచాడు.

## 4

రేవుదగ్గిరా సందడే. పడవ ఇంకో అర్ధగంటలో బయలుదేరాలి. ఆ ప్రాంతాల్లో కొనుగోలయిన సరకులను—ముఖ్యంగా పొగాకును—రకరకాల పెట్టెల్లో ప్యాకుచేసి, సీలువేసి పడవలో సరుకూ వున్నారు. అంగళ్లలో ఈ సరుకు కొనాలంటే ఎంతో ఖరీదు పెట్టాలి. ఇక్కడయితే, చౌకగా కొనవచ్చు. ఇందుకోసం సమావేశమైనవాళ్ళు ఎంతో మంది; ఇంకా తెల్లవారకపోయినా వచ్చి బేరమాడుతూ వున్నారు.

బెనాటే పడవెక్కాడు. అట్టే రకపు పెట్టే, చక్కగా సీలుచేయబడ్డది—గమ్యస్థానాన్ని తెలుపు అడ్రసూ వగైరాలు అతికించబడ్డది అతని చంకలో వుంది. జేబులో మూడువందల లీరాలు. తల తిరుగుతూనే వుంది ఆ బ్రాందీ మైకం మూలకంగా... లోపలా చలే. బయట పొగమంచూ. దాంతో చీకటే. మూల చిన్నదీపం వెలుగుతున్నది. అక్కడ కాంటీను వుంది. లోపలినుంచి కాఫీని సప్లయిచేస్తూ వున్నారు. కావలసినంత గ్రప్పా బ్రాందీని అమ్ముతున్నారు. పడవలో ప్రయాణం చేస్తూవున్న వాళ్లందరూ ఈ కాంటీనుముందరే హాజరయి పానీయాలను రుచిచూస్తూ కాలక్షేపం చేస్తూవున్నారు. బెనాటే వాళ్ళదగ్గిరకి చేరాడు—చుట్టూ అమర్చబడివున్న బల్లలదగ్గిరకి వచ్చాడు. ఒక బల్లమీద కూర్చున్నాడు. చంకలో వున్న పెట్టెను దానిమీదే వుంచాడు. ఆ పానీయాలను సేవిస్తూ వీళ్లందరూ రణగుణ ధ్వని చేస్తున్నారు. ఒకరి మాట మరొకరికి వినిపించటం లేదు......బెనాటేకి పరిచయమైనవాళ్ళూ అక్కడ వున్నారు. వాళ్లతో కబుర్లు చెప్పుతూ—ఆ రాత్రి జరిగిన కథనే పూర్తిగా మరిచిపోవటానికి గ్లాసులను ఖాళీచేస్తూ వాళ్ల ప్రపంచంలోనే పడిపోయాడు...

పొగమంచు మూలంగానైతేనేం, ఆ గాలివానవల్లనైతేనేం, పడవ మందగమనంతోనే నడుస్తూ వుంది...బ డా అని ఎలాగైతేనేం, దాని వడితోనే పడవ రేవుపట్నానికి చేరుకొన్నది. అది అక్కడ లంగరు దించేలోపుగానే వెరోనా నగరానికి పోవలసిన రెలుబండీ స్టేషను వదలిపెట్టి బయలుదేరి వెళ్లిపోయింది. గడియారం చూచారు. పడవను అంత ఆలస్యంగా రేవుకు చేర్చినందుకు, పడవవాళ్లను చెడామడా తిట్టేశారు. కాని లాభమేమిటి? ఎన్నో గంటలసేపు స్టేషన్లోనే మరో బండికి వేచివుండాలి...... బెనాటే, అతనివెంట ప్రయాణంచేసిన మిత్రులూ స్టేషను చేరుకొన్నారు. స్టేషను ఆవరణలోనే వున్న హోటల్లో ప్రవేశించారు. హోటల్లో ఎంతో సందడిగావుంది. మెల్లగా ఎవ్వరూ మాట్లాడరే? ఏం! కొంప మునిగిపోయిందని ఆ తర్జనభర్జనలు? అందరూ

ఒకేసారి మాట్లాడాలా?ఒకడు చెప్పేమాటను మరొకడ్ని విననిచ్చినపాపాన బోవటంలేదు.

మన మిత్రులూ ఒకమూల కూర్చున్నారు. గ్రప్పాపానీయాన్ని రుచిమాట్టానికి ఆరంభించారు. వాళ్ళ కిరుప్రక్కల్లో ఈలాంటి మహనీయులే ఎంతో మంది ఆసీనులై వున్నారు. వాళ్లలో ఒకడు తాను వరోనాలో చేసే వర్తకాన్ని గురించి చెప్పటానికి ప్రారంభించాడు. ఈ భాగ్యమంతా తాను ప్రేమిం చుతూవున్న పిల్లదానివల్లే లభ్యమయిందట. ఇంకొకాయన తాపీమేస్త్రీ. ఆయన అమెరికా దేశంలోని చిత్రాలను వర్ణించసాగాడు. అమెరికాలో తయారైన చాకులు తెప్పించి వ్యాపారం చేస్తూవుంటాడు. ఆ కత్తులు అనేకవిధాలుగా ఉపయోగపడతాయి. దేనినైనా అవలీలగా కోసివేయవచ్చు. గోళ్ళను సున్నితంగా తీయవచ్చు. అంతేకాదు? ఎట్టి సీళ్ళనైనా సులభంగా తీయవచ్చు; బిరడాలను చులకనగా లాగివెయ్యవచ్చు. దాన్ని రంపంగాకూడా ఉపయోగించుకొనవచ్చు. ఎట్టి గట్టి పెట్టెల మేకులనైనా ఒక్క నిమిషంలో పెరికివేయవచ్చు. అమెరికావాళ్ల గారడీవిద్యఅంతా ఈ కత్తిపిడిలోనే చూడవచ్చు అని తన సరకుయొక్క నాణ్యాన్ని గుక్కతిప్పుకోకుండా చెప్పటానికి ప్రారంభించాడు.

బెనాటీ దీనినంతా వింటూనే వున్నాడు. లోపల గుండె గభీలుమంటున్నది. కాని ఆ పానీయాల మత్తులో ఆ బాధనంతా మరిచేపొయ్యాడు. అమెరికా వాళ్ళను గురించి ఎంతో అత్యద్భుతంగా చిత్రింపబడ్డ పుస్తకాలను చదివాడు! సినిమాల్ననూ ఎన్నో చూచాడు! వాటిని చదివినప్పటినుంచీ, కన్నులార చూచినప్పటినుంచీ, తానూ పెద్దరచయిత కావాలని ఆశ! ఏ అమెరికను స్టూడియోవాళ్ళయిన తనకే అవకాశమిచ్చితే, ఎన్నో కథలను, వీటికన్నా మంచివాటినే వ్రాయాలి, తద్వారా పెట్టెడు డబ్బును ఆర్జించాలని బెనాటీ ఆశ...వీళ్లా వర్తకులు, ఆవూరికీ ఈవూరికీ వెళ్ళి తాము బయటకొన్న సామాన్లలను ఇతర్లకు పెచ్చులాభంతో అంటగట్టటానికి విశ్వప్రయత్నాలు చేసేవాళ్లు. తన కెందుకొచ్చింది యీ బాదరబందీ అంతా? వీళ్ళలోకం వేరూ, తన లోకము మరొక్కటి. వీళ్లలోకం యంత్రంమాదిరి నడిచిపోతుంది. ఇవ్వాళ చేసిన తంత్రాన్నే, రేపూ చేస్తారు, ఎల్లుండీ చేస్తారు. అలా చేయటంలోనే వుంది వాళ్ళ ఉబలాటమంతా! ఇక తానో, ఇంకో ప్రపంచంలోకినడుస్తున్నాడు. అక్కడ ఏ మిత్రుపల్లాలు ఉంటాయో? తన బాధ్యతా, వీళ్లకన్నా ఎంతో మహత్తరమయింది. కవిసామ్రాట్టుయొక్క కడపటి కోరికను నెరవ్చేటానికి బయలుదేరాడు! దాన్ని సాంతంగా నెరవేర్చటంలో వున్నయ్, తాను ఆయన పట్ల చూపాలసిన భక్తివిశ్వాసాలు!...ఆ విషయాన్ని తలుచుకు నేటప్పటికి గాబరాపడిపోతున్నాడు. గుండె దబదబ కొట్టుకొంటున్నది...

వీళు చెప్పే కబుర్లను వింటున్నాడు. వింటున్నాడు. అంతే, ఏమీ జవాబు చెప్పడు. బెనాటీ స్వభావరిత్యా మాటల కోరే. కాని ఇప్పుడు మౌనసముద్రంలో మునిగి పొయ్యాడు. ఆ పరిస్థితిలో ఎన్ని ఆలోచనలు వచ్చాయి! అవే ఆతన్ని పీల్చి పిప్పిచేస్తున్నాయి. వాటిని తప్పుకోటానికి గ్రప్పాను విధీవిరామం లేకండా తాగుతున్నాడు. కళ్లముందట మసకలు. చెప్పరానన్ని తెరలు రావటం, అదృశ్యం కావటం చూస్తున్నాడు. ఈ అయోమయంలో పడ్డ బెనాటీకి నోటినుంచి మాటా పలుకూ ఎలావస్తుంది మరి?...

ఆ తాపీమేస్త్రీ కొలాంతకుడు. బెనాటీ వంక తదేకదృష్టితో చూస్తున్నాడు. ఆతని దృష్టి బెనాటీ ప్రక్కనున్న పెట్టెమీదకే పోయింది. ఆ పెట్టె చూట్టానికి ఎంతో బాగావుంది! అంత గట్టి మేకులను ఎందుకోసరం బిగించారు? ఆసీళ్లు ఎందుకువేశారు?... తన కత్తుల ప్రభావాన్ని దానిమీదే చూపి అందరినీ సంతోషపెట్టాలి? తద్వారా తన సరకునూ వీళ్లకి అంటగట్టుటానికీ ఇంకేం కష్టముంటుంది?

ఆ పెట్టెమిటిఅని బెనాటీనే ప్రశ్నించాడు, ఏ రూపాన్నయితేనేం? బెనాటీ ఆ మైకపు హుషారులోనే తన కథను పూర్తిగా చెప్పివేశాడు......మేస్త్రీ తన కత్తిపిడిలో నున్న సామగ్రితోనే మేకులను సునాయాసంగా తీసివేశాడు. పెట్టెనూ తెరిచాడు. దాన్ని చూచేటప్పటికి అందరూ పకపక నవ్వటానికి మొదలుపెట్టారు. వీడు మంగలివాడు. తమ ముందరేనా ఆ సొరకాయలను కోయటం?...అందులో ఏం వున్నవనుకున్నారు మరి? చాలా అరుదుగా ఈ దేశంలో లభించే నాలుగు తేనెసీసాలు. వాటిని తొణకనీయకుండా రంపపు పొడితో, ఎండు గడ్డితో అతిజాగ్రత్తతో ప్యాకుచేసి వుంచారు...

బెనాటీ వీటిని చూచి విభ్రాంతుడయ్యాడని వేరె చెప్పాలా? ఈ తమాషాను చూస్తూ వాళ్లు అంతా ఆనందించుతూవున్నా మాటా పలుకూ వాడి నోటినుంచి వచ్చిందే కాదు! తల తిరిగిపోయిందనే

చెప్పాలి!....ప్రయాణాన్ని ఆపేసి ఆ రాత్రి ఆ పట్నంలోనే గడిపాడు. వేకువఝామునే ఆ వూరి నుంచి బయలుదేరే పడవలో ఎక్కి ఇంటిమార్గం పట్టాడు. రేవుదగ్గిర ఆ ముసలావిడ బెనాటీకోసమే కనిపెట్టుకొనివుంది. పడవ దిగి బయటపడేటప్పటికి ఆవిడే పలకరించింది :

"అంతా సరిచేసి వచ్చావా?"

"హాఁ! అంతా సరిచేసే వచ్చాను"

## 5

తాను చేసే పని మంచిదయినా చెడ్డదయినా, అంతా మంచిదే అని చెప్పటం బెనాటీకి అలవాటు; అహోరాత్రాలూ చేసేది మంగలి వృత్తే! ఈ సాధనమే చేతిలోవుండకపోతే ఆబండి ఎలా నడుస్తుంది. క్షురకర్మకోసం తనదగ్గిరకు వచ్చేవాళ్లందరితో తేనెనుగురించి శ్లాఘించటానికి ఆరంభించాడు.

"మనం రుచిచూచేటటువంటిది కాదు. ఎంతో అపురూపమయిన వస్తువు. దాన్నే నాకిచ్చారు ఇది నా అదృష్టంకాక మరేమని అనాలి! పరగడుపుతోనే ఒక చెంచా తేనెను పుచ్చుకోటం అలవాటయిపోయింది. నా ఆరోగ్యానికి ఇదే అమృతమైపోయింది. దీన్నే అంత్యకాలంవరకూ పుచ్చుకొంటినా — జవసత్వాల్లో నా ముసలితనానికూడ ఏమాత్రం మార్పు వుండదు"

నేను పుచ్చుకొన్న మాదిరే అందరూ తేనెను పుచ్చుకొన్నారా ఇక డాక్టర్లు ఎందుకు? ఆస్పత్రులెందుకు? మందులషాపులెందుకు? సులభంగా అందరి ఆరోగ్యం బాగుపడుతుంది అని తనదగ్గిరకు వచ్చే వాళ్లందరికీ సలహా నీయసాగాడు. ప్రక్కవూరి కరణం ఏస్‌పోసిటో తేనెటీగలను పెంచటంలో సమర్థుడు. అతడు తయారుచేసే తేనె చాలమంచిది. దాన్నే పుచ్చుకొమ్మని బెనాటీ చెప్పసాగాడు. కరణం ఏస్‌పోసిటో ఈ సంగతిని గురించి ఏం చెప్పదలచాడో తర్వాత ఆలోచిస్తాం.

## 6

తరువాత జరిగిన కథనుగురించి కొంత చెప్పవలసి వస్తుంది. ఆప్రాంతపు అధికారవర్గంవారు రూట్సుకవిగారి వీలునామాను స్వాధీనం చేసుకున్నారు. దాన్లో ఆయన వెలిబుచ్చిన కోరికల ప్రకారం అన్నిటినీ చక్కగా సర్దేశారు...ఆ ముసలావిడ తనకు చెందిన సొత్తును స్వాధీనంచేసుకొని తాను పుట్టిపెరిగిన లంబార్డీ రాష్ట్రంలోని తన సొంత వూరికే వెళ్ళిపోయి హాయిగా అంత్యదినాలను గడుపుకొంటూ వున్నది. మందు ద్రావకాలతో మృతకళేబరాలను [illegible] కంపెనీ ఏ కారణంవల్లనో దివాలా యెత్తింది. మరికొంత కాలానికి రూట్సుకవి వారసుల్లో ఒకాయన ఈ ప్రాంతానికే వచ్చాడు, ఇతనకు వీలునామా ప్రకారం పోయిన ఆస్తిని స్వాధీనం చేసుకోటానికి కోర్టులకెక్కాడు. ఆ సందర్భాన కవిగారి చరిత్ర పూర్తిగా లోకానికంతా తెలిసిపోయింది. కాని కవిగారి తల ఏమయిపోయింది? దీని సంగతిని ప్రస్తావించినవారెవ్వరూ లేకపోయారు...

కాని ఆ పెట్టె ఏమయిపోయింది? ఇదే క్లిష్ట సమస్య. దాన్ని హాస్యఘట్టమని చెప్పాలా? లేక విషాదఘట్టమని పేర్కొనాలా? ఎవరికైనా బహుమతి కానుకగా చేరివుంటుందా? లేక పోయిన వస్తువులను సేకరించి, వాటి స్వంతదార్లు వచ్చి అడిగినంతవరకూ జాగ్రత్తతో వుంచే అధికారుల వశంలో వుందా మరి? దొరికిన వస్తువుల భోగట్టాను ప్రకటించే అధికారపు జాబితాల్లో దీని విషయం వారింతవరకూ ఎప్పుడూ పేర్కొన్నవారే కారు...లేక అది పొరబాటున ఇతర పెట్టెలతో మారిపోయి మరెవ్వరికయినా చేరివుంటుందా? దీన్నే మనం కొంచెం సూక్ష్మదృష్టితో పరీక్షించాలి...

ఆనాడు ఆ వూరి కరణం ఏస్‌పోసిటో ఆ ప్రాతఃకాలపు పడవలో ప్రయాణమై వెళ్ళదలచి బయలుదేరాడు తాను దిగదలచిన స్టేషన్లో నిద్రమత్తువల్ల దిగటం మరిచేపొయ్యాడు. ప్రక్క స్టేషను వచ్చేటప్పటికి, కూర్చున్న స్థలమంతా చీకటితో నిండివున్నా గబగబ లేచాడు. ప్రక్కనుంచుకొన్న సామాన్లను సర్దుకొని బైటపడ్డాడు. ఆయనదగ్గిరా బెనాటీ తీసుకొని వెళ్లుతూవున్న పెట్టెవంటి పెట్టే—ఆ సైజుదే—అంత తూకం వున్నదే—వుంది. దాన్లో తానెంతో ప్రేమించుతూవున్న ఒక స్త్రీకి, ఆవిడ పుట్టినరోజు పండుగకుగాను స్వయంగా తయారుచేసిన తేనెను బుడ్లలో నింపి ఆమెకు బహుమతిగా ఇవ్వటానికిగాను, చక్కగా ప్యాకుచేసి తీసుకొని పోతున్నాడు.........స్టేషన్నుంచి తిన్నగా ఆవిడ ఇంటికే వెళ్ళటానికి బయలుదేరాడు. దూరాన్నుంచి ఆ యింటినే చూచాడు...ఎవరో ఒకాయన కిటికీ దగ్గిరే నిలుచుని ఆవిడతో సరససల్లాపాలాడటం...ఆ దృశ్యాన్ని చూచేటప్పటికి

మన కరణంగారికి వొడలు మండిపోయింది. తోక తొక్కిన పాములా ఎగిరిపొయ్యాడు. తన్నెంతో ప్రేమించుతున్నదని అనుకొన్న ఈవిడ ఈలా చేస్తున్నదా అని రేగిపోయాడు...చేతిలో వున్న పెట్టెను దారికి ప్రక్కనే వున్న రాళ్లగుట్టలో విసరి వేశాడు... కాళ్లకు బుద్ధిచెప్పి వచ్చినదోవనే తిరిగి వెళ్లనిశ్చయించుకొన్నాడు. వెళ్ళిపోతూ ఒక్కసారి ఆ పెట్టె వంక చూచాడు. ఎంతో కష్టపడి తయారుచేసిన తేనె! దీన్ని ఈలా రాళ్లపాలు చెయ్యటం మంచిదా? దాన్నే అమ్మితే ఎంతో డబ్బును సంపాదించగలడు! ఈ దృశ్యాన్ని ఆ ఇంటి కిటికీదగ్గిర నిలుచుండి వున్న పెద్దమనిషీ చూస్తూనే వున్నాడు. కరణంగారిని చూచినవెంటనే ఆయనా ఒకమూలకు తప్పుకొన్నాడు. కీః మాయబడ్డది...అయితేనేం? ఇది ఆవిడకోసం తెచ్చిన కానుక. తిరిగి ఆ రాళ్ల కుప్పలో నుంచి తీసుకోటం ఏమాత్రం సబబు కాదు! ఇది ఇతర్ల కగపడగూడదు. ప్రక్కనున్న మట్టిని తీసి దాన్ని పూర్తిగా కప్పివేశాడు...

కాలం గబగబా తిరిగిపోతూ వున్నది. ఆ పెట్టె ఆ రాళ్లగుట్టలోనే విశ్రాంతిని పుచ్చుకొంటున్నది. ప్రకృతి దేవత తన జగన్నాటకాన్నే ఇక్కడా కొనసాగించింది. పెట్టెమట్టిలో, రాళ్లల్లో కలిసి పోయినా, దానిచుట్టూ పూలమొక్కలెన్నెన్నో పెరిగాయి. ఈ ఆకులూ, ఈ పూలూ కవి బ్రతికివున్న దినాల్లో తన తోటలో నిరంతరమూ కన్నులార చూస్తూ ఆనందించుతూవున్న మాదిరివే. వీటినే దండలుగా గుచ్చి, తలకు చుట్టుకొనేవాడు. హారాలుగా వేసుకొని తన్మయుడయ్యేవాడు. ప్రకృతి దేవతా నేడూ ఆ పనేచేస్తూ అతని ఆత్మకు అహో రాత్రాలూ శాంతిని ప్రసాదించుతూ వున్నది.

ఎస్టోనియా దేశంలో పుట్టాడు.. ఈ పరాయి దేశంలో కాలగతుడయ్యాడు. ప్రకృతి దేవత అన్ని దేశాలనూ సరిసమానంగానే చూస్తూవున్నది. అన్ని దేశాలవాళ్లను — వాళ్లేజాతివాళ్ళయితేనేం, ఏ భాషను మాట్లాడేవారైతేనేం,—తన స్వంత బిడ్డలుగానే చూచి ఆదరించుతూవున్నది. భాగ్యవంతులూ, బీదలూ, నాథులూ, అనాథులూ, అందరూ ఒక్కటే ఈ తల్లిముందట. ఆ మహాతల్లి రూట్సుకవిని ఆలాగే ఆదరించింది.

మంగలి బెనాటే ఆ పనిని ఆనాడు చేశాడు. వాడానాడు పుచ్చుకొన్న ఆ గ్రహ్నా బ్రాందే వాడు చేయతలచుకొన్న కౌర్యకలాపాన్ని ఇంకో రూపంగా మార్చివేసింది. తరువాత కరణంగారి రగడ దాన్ని మరో దోవకు తెచ్చింది. ఇప్పుడు కవిగారి తల ప్రకృతి దేవత చేతుల్లోకే వచ్చి తన పూర్వగాథలను స్మరించుతూ విశ్రాంతి పుచ్చుకొంటూ వున్నది.

# * తెలుగు చోళరాజులు *

## శ్రీ కొత్త భావయ్య చౌదరి

రేఁడవ కరికాలుని వంశీకులు ఒరయూరు రాజధానిగా గల్గిన చోళదేశమునుండి క్రమముగా ఆంధ్రదేశమునకువచ్చి యటనట నివాసస్థానము లేర్పరచుకొని సామంతులుగా పాలించుచు వచ్చిన నిదర్శనములు కనబడుచున్నవి. దాదాపు వీరి చరిత్ర 550 A.D ప్రాంతమువరకు చక్కగా తెలియుట లేదు. పిమ్మట పల్లవరాజులకు సామంతులుగా వీరు కడపజిల్లాలో పాలించియుండిరి. పుణ్యకుమార చోళుని తామ్రశాసనమునుబట్టి యీ వంశములో నందివర్మ యనునతడు దాదాపు 550 - 75 A.D మధ్య పాలించినట్లు చరిత్రజ్ఞులు నిశ్చయించుచున్నారు. ఆయనకు సింహవిష్ణు, సుందరవర్మ, ధనంజయ వర్మలను కుమాళ్లుండి, తర్వాత పాలనకువచ్చిరి. ధనంజయవర్మ శాసన మొకటి కడపజిల్లాలో కలమళ్లి గ్రామమున లభించెను. సుందరవర్మకు పరిప్రతాప చోళరాజు జనించెను. ఈతనికి మహేంద్ర విక్రమ వర్మ, ముదిత శీలాక్షర, నవరామాది బిరుదము లుండెను ఈతడు దాదాపు 575-600 మధ్య హిరణ్య రాష్ట్రమును పాలించెను. ఈతనికి గుణముదిత, పోర్ముఖవర్మ లేక పుణ్యకుమార చోళులను యిద్దరు సుతు లుదయించిరి. అందు పుణ్యకుమారుడు హిరణ్య రాష్ట్రమును పాలించెను. ఈకాలము 600-625 మధ్య కాల మనవచ్చును —

తర్వాత విక్రమాదిత్య చోడభూపాలుడును, పిమ్మట శక్తికుమార విక్రమాదిత్యుడును, తర్వాత సత్యాదిత్యుడును పాలించియుండిరి. విక్రమాదిత్య చోడుడు తనరాజ్యమును విస్తరించి "చోళమహా రాజాధిరాజ" బిరుదము వహించెను. ఈతడు 625-650 మధ్య పాలించి యుండును.

శక్తికుమార విక్రమాదిత్యుడు 650-75 మధ్య తండ్రి యనంతరము రాజ్యభారమును గైకొనెను. పిమ్మట వచ్చిన సత్యాదిత్యుని కాలమునకు అతడు రేనాటిరాజ్య మేడువేలు గ్రామములు, సిద్ధి వెయ్యి గ్రామములు పాలించుచు వచ్చెను. ఈపాలనము 7వ శతాబ్దాంతమున జరిగెను. అనగ 675 700 మధ్య జరిగెను. ఈయనతర్వాత ఎరికంచోళరాజను నతడు పాలించినట్లు అతని నల్లచెరువులపల్లి శాసనమునుబట్టి చరిత్రకారు లూహించుచున్నారు. ఇతడు 700-725 మధ్య పాలకు డనవచ్చును. ఈ యెనిమిదవ శతాబ్ది మధ్యనే చోళు లింకను రాజ్యమును విస్తరించి యుందురు. చోళిక ముత్తరాజు, ధనుంజయ యెళ చోళరాజనువారలు గాంగ పల్లవరాజులకు సామంతులుగా కండికోట రాజధానిగా నేలినట్లు గ్రైసుకొర వ్రాయుచున్నాడు. ధనంజయ ఎరికచోళు డను నతడు 8వ శతాబ్దిని ఆళ్వాడి 600 గ్రామముల కధిపతిగానున్నట్లు తుంకూరు జిల్లాలోని కొన్ని శాసనములవల్ల తెలియుచున్నది. లోకలు రికార్డులలోని బాపట్ల కయిఫీయతునుబట్టి ఆంధ్రదేశ మధ్యభాగములోని కమ్మనాటియందుకూడ నీచోడ రాజుల పాలనమే ఆరవశతాబ్దిలో కనబడుచున్నది. బాపట్లలోని భావనారాయణస్వామికి భావపట్ల అమువాలపల్లె గ్రామములను 593 A.D. లో వీరప్రతాపచోడు డిచ్చెనట. ఈతడు పైన నుడివిన పరిప్రతాపచోడుడుగా గనబడుచున్నాడు. ఆయన తర్వాత కమ్మనాటిలో శ్రీమికాంత (శ్రీకాంత?) చోడుడు తర్వాత చోడ భూపాల దేవుడును 853 వరకు పాలించినట్లు చెప్పబడినదిగాని మధ్యను కొందరి పేర్లు వదలివేసినట్లు కనబడుచున్నది.

శ్రీకాంతచోళుని శాసన మొకటి యిటీవల లభించినది. దానినిబట్టిచూడగా నవరామ బిరుదాంకితుడగు పరిప్రతాపచోళునితర్వాత వరుసగా ఎరియను, విజయకామ, వీరార్జున, అగ్రణిపెడుగు, కొక్కిలి మహేంద్రవర్మ, ఎళచోళ, నృపకామ, దివాకర, శ్రీ కాంతచోళ యనువారు పాలించినట్లు చెప్పబడినది — వీరిలో కొందరిపేర్లు బిరుదునామములేగాని అసలు పేర్లుగా కనబడవు. శ్రీ కాంతచోడుడు మందరగ్రామమును తన గురువున కర్పించుచు శాసనము వ్రాయించెను ఇతడు దాదాపు 850 ప్రాంతీయు డనవచ్చును. అందుచే పైన నుడివిన పాలకు లందరును 600-850 ప్రాంతీయులై యున్నారు — వేంగి, కమ్మరాష్ట్రములు కుబ్జవిష్ణువర్ధన తూర్పు చాళుక్య చక్రవర్తికి వశమైనపిమ్మట ననగా 615 నుండి యీ తెలుగు చోడరాజులు ఆతని వంశీకులకు సామంతులైపోయినారని చెప్పవచ్చును. పశ్చిమచాళుక్య రాజులక్రింద గూడ కొందరీ చోడ వంశీకులు సామంతులుగా నుండిరిగాని వారి విషయ

ములు 11 వ శతాబ్దివరకు చక్కగా తెలియుటలేదు. 725 *A.D.* ప్రాంతమున నుండిన చోడరాజుల నామములలోని కొక్కిలినామము తూర్పు చాళుక్యరాజగు కొక్కిలి పేరున నేర్పడియుండునని తలంపవచ్చును. ఇంతకుపూర్వమే మంగి యువరాజు *I* క్రింద కరికాలాన్వయ దాసవర్మ వంశములోని అయ్యణ వంశాన్వయ అనఘవర్మ సామంతుడుగా కమ్మరాష్ట్రమున నుండి యనేక యుద్ధములందు పాల్గొనుచు వచ్చెనట. ఈతడు 700 ప్రాంతీయుడు. ఇటీవల 928 ప్రాంతమున పాలించిన బల్లయచోడుని తామ్రశాసనమొకటి దొరకినది. దీనినిబట్టి రేనాటి ప్రాంతమీతడు పాలించినట్లు కనబడును. ఇతని తర్వాత ఉత్తమాదిత్య! రెండవ బల్లిచోడులు పాలించిరి. 971 సం॥ నాటికి వైదుంబరాజగు భువనత్రినేత్రుడచట యధిపతియై తెలుగు చోళులను సామంతులనుగా నుంచియుండును. అందువల్లనే యచట 978 ప్రాంతమునకు జటచోళ నృపాలుని పాలన గానవచ్చుచున్నది. ఈ జటచోళి నృపాలునికిముందే 956 ప్రాంతమున తెలుగు బిజ్జనపాలనము కోడూరు ప్రాంతమున గానవచ్చుచున్నది. ఈతడు మొదట పల్లవరాజులకు, తర్వాత పశ్చిమచాళుక్య రెండవ అరికేసరికిని సామంతుడుగా నుండినట్లు వేములవాడ శాసనము మొదలగువానినిబట్టి తెలియుచున్నది. వైదుంబ రాజులను పశ్చిమ చాళుక్యరాజు జయించియుండును.

జటచోళుని తర్వాత జటచోళ భీమనృపాలుని పాలన 982 ప్రాంతమున గానవచ్చుచున్నది ఈతడు తూర్పు చాళుక్య చక్రవర్తులలోని బాదపరాజునకు బావమరదియై యుండెను. వైదుంబరాజగు సంద్రయ్యను, రాష్ట్రకూట రాజగు కృష్ణనృపాలుని, యితడు యుద్ధములందు జయించి దేశములో మిక్కిలి కీర్తిబడసెను. రేనాడు, పాకనాడులను పాలించుటయే గాక, బాడపుని పక్షమున ఆంధ్రదేశమంతటిని యేలుచుండెను. ఈతడు చివరకు 999 ప్రాంతమున శక్తివర్మచే సంహరింపబడెను.

పశ్చిమచాళుక్య త్రైలోక్యమల్లుని సామంతుడుగా నీతెలుగు చోడులలో పైన నుడివిన అయ్యన వంశాన్వయుడగు శంకరసచోడుడును నిరుగనిచోడుడును త్రిభువనమల్లుని సామంతుడుగా రాజాదిత్యరసచోడుడును, మల్లరసచోడుడును ఉన్నట్లు వారి శాసనముల వల్ల తెలియుచున్నది. వీరందరు మాడిసి, అలంపుర ప్రాంత పాలకులుగా నుండిరి. వీరుగూడ కడపజిల్లా కోడూరునందలి చోడశాఖీయులగుటచే, కోడూర్పుర వరేశ్వర బిరుదమును ధరించిరి. ఈ కోడూరు శాఖీయులలో కొందరు ఎరువప్రాంతమున కేగి యచట పాలకులైరి. ఎరువ తొండయచోడరాజు త్రిభువనమల్ల చక్రవర్తి సామంతుడుగా నుండెను. సిందవాడి రాష్ట్రము చిద్దనచోడుడు త్రైలోక్యమల్లునికి సామంతుడుగా 1053 ప్రాంతమున పాలించెను. పొత్తపి ప్రాంతమునుండి పాలించుచువచ్చిన యీ తెలుగు చోడవంశమునుండి 1078 ప్రాంతమున కమ్మనాటికి కాముచోడుడు వచ్చి పాలించెను. వీరుగూడ దాసవర్మవంశీయులుగానే చెప్పుకొనినారు. కాముచోడుని తర్వాత నీతని కుమారులగు కన్నరదేవ, చోడబల్లి యనువారు కమ్మనాటిలో పాలించిరి. చోడబల్లికి నన్నెచోడ, రెండవ కాముచోడులు జనించిరి. నన్నెచోడుడు కవీశ్వరుడై కుమారసంభవమును రచించి మిక్కిలి పేరొందెను వీరు కమ్మనాటిని తండ్రియనంతరము పాలించిరి. కాముచోడునిభార్య శ్రీమాదేవి తల్లి జటచోడుని మనుమరాలని చెప్పబడినది. పొత్తపిలో సిద్ధచోడుడు 1083 ప్రాంతమున పాలించుచుండెను. ఇతని తర్వాత విమలాదిత్య చోడుడు విక్రమచోళ చక్రవర్తి సామంతుడుగా పాలించెను. చేతిరాజుగూడ కొంత భాగము నేలెను. తర్వాత యీ చోళరాజులలో వయభీమరాజు, నల్లసిద్ధి, యర్రసిద్ధి చోడులపాలనము గానవచ్చుచున్నది యర్రసిద్ధి చోడరాజు నెల్లూరునకు తన రాజధానిని మార్చి రెండవ రాజాధిరాజ చోళునకు సామంతుడయ్యెను. ఇతని సోదరుడగు నల్లసిద్ధి వల్లూరు రాజధానిగా కొంతభాగమును మూడవ కులోత్తుంగ చక్రవర్తికి సామంతుడుగా మహారాజపదియను 7 వేల గ్రామములకు ప్రభుత్వ మొనర్చెను.

యర్రసిద్ధి, అయ్యనసింగు I భుజబలవీర, సాహసోత్తుంగాది బిరుదములు ధరించెను—అయ్యన వంశము తెలుగు చోడులలో మిక్కిలి ప్రసిద్ధివహించెను. అయ్యనసింగు చాల పరాక్రమవంతుడు. అందువల్లనే తెలుగు చోడులలో నీ వంశీయులు అయ్యనసింగు బిరుదము ధరించుచుండిరి.

నల్లసిద్ది *II* లేక మన్మసిద్ధి *I* నెల్లూరునకు 1187 ప్రాంతమున అధిపతియయ్యెను. ఈయన భార్య నూంకమ చాల భక్తురాలు. తమ్ముడు సిద్ధిగూడ యీ నల్లసిద్ధితోబాటు పాలించుచుండెను.

నల్లసిద్ది కుమారుడు తిక్కరాజు *I* తండ్రియనంతరము నెల్లూరుసీమ నేలుచు మూడవ రాజరాజు రాజ్యమును కర్నాట సోమేశ్వర, పాండ్యరాజుల దండయాత్రలలో నిలిపి 'చోళ స్థాపనాచార్య' బిరుదము నొందెను. తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయణమున నీతని విశేషముగ గొనియాడెను. గంగయ సాహిణియను గొప్ప సేనాధి

పతి యీతని కడనుండి తర్వాత గణపతిదేవ చక్రవర్తి యధీనుడయ్యెను—ఈతని తర్వాత రెండవ మనుమ సిద్ధిరాజు పాలనకువచ్చి కవిపోషకుడై తిక్కనచే నిర్వచనోత్తర రామాయణము రచింపజేసి ప్రసిద్ధుడయ్యెను. దానిని కృతినందెను. పాండ్యరాజు నెల్లూరు సీమ నాక్రమింపగా నతడు గణపతి దేవుని శరణుజొచ్చి, ఆయన సహాయమున వానిని జయించి మరల రాజ్యమును గైకొనెను. ఇతడు 1262 వరకు పాలించినటు కనబడుచున్నది—తర్వాత నెల్లూరు సీమను ఇమ్మడి తిక్కరాజు పాలించెను. ఇతడు కాకతీయుల సామంతుడయ్యెను. వెలకొండపల్లి ప్రాంతమును 1125 ప్రాంతమున కందూరి రుద్రయన చోడుడు పాలించెను. తర్వాత వచ్చిన ఉదయ చోడుని కాకతీయ ప్రతాప రుద్రదేవుడు పారద్రోలి వర్ధమానపురమును దహించి, యచట తటాకము త్రవ్వించి, యాతనికుమార్తె పద్మావతిని పెండ్లాడెను.

చక్రనాట్యమండలమున నున్న ధారావర్షుని వద్ద చంద్రాదిత్యచోడుడు సామంతుడుగా 1138 ప్రాంతమున పాలించుచుండెను. వరకూరిమున నితడొక తటాకము, ఆలయమును గట్టించెను.

పశ్చిమచాళుక్య భువనైకమల్లునికి సామంతుడుగా భద్రభూపాలుడు పాలించుచు, సుమతి శతకము, నీతిశాస్త్రముక్తావళి యను గ్రంథముల రచించెను.

కమ్మనాటిలో రెండవ కామచోడుని తర్వాత నతనివానితోగలిసియు కుమారుడగు త్రిభువన మల్లచోడుడు 1156 వరకు పాలించెను. తర్వాత నితని కుమారులు నన్నెచోడుడు, కన్నరదేవచోడుడు, చోడదేవుడు ననువారు మూడవ కులోత్తుంగుని సామంతులుగా పాలించియుండిరి.

వెలనాటిలో కులోత్తుంగ చోడరాజు *I*, గొంకరాజు *II*, రెండవచోడరాజు, మూడవ గొంకరాజు, పృథ్వీశ్వరరాజులు 1076 నుండి - 1210 ప్రాంతము వరకును నామకా చోళ చక్రవర్తులకు ప్రతినిధులై స్వతంత్రత గల్గియుండి, తక్కినసీమలపై నాధిపత్యము గల్గియుండిరి. అందుచే గత తెలుగుచోడులుగూడ వారి చేతిక్రింద నే యున్నట్లు చెప్పవచ్చును.

కాకతి గణపతిదేవ చక్రవర్తి 1210 ప్రాంతమున కమ్మనాటి వెలనాటిరాజులనందరిని జయించుటతోడనే, తెలుగుచోడులుగూడ నా రాజ్యమునకు సామంతులైరి. ఈ గణపతిదేవచక్రవర్తి అయ్యావంశములోని తెలుగు చోడరాజు పిన్నచోడుని కుమార్తెలగు నారమ్మ, పేరమ్మలను వివాహమై, వారి సోదరుడగు జాయపనాయకునకు వెలనాటి ప్రాంతమున అధికారమిచ్చి, తన గజసైన్యమునకు అధిపతిగా నొనర్చెను. ఈతడు కళింగ యుద్ధములందు బాగుగా పనిచేసినందున ఇతడు భూమిఘూర్జరను బిరుదు నొందగల్గెను. 1228 ప్రాంతమున గణపతిదేవుని సైన్యాధికారులలో కమ్మనాటి తెలుగుచోడ రాజులలో మల్లదేవుడును, రెండవ ఓపిలి సిద్ధిచోడుడును గనబడుచున్నారు. సిద్ధిచోడుడొకడు మోటుపల్లి రేవు ప్రాంతపు అధికారిగా నుండెను. తర్వాత 1290 ప్రాంతమున చోడమల్లదేవుడు నెల్లూరు తాలూకాలో ప్రతాపరుద్రదేవుని సామంతుడుగా గనబడుచున్నాడు. ఇదేకాలమున కాంచీపుర పాలకుడుగా మనుమగండ గోపాలుడుండెను. పాండ్యరాజులు కాంచీపురమును ముట్టడించి జయింపగా, మరల రుద్రదేవుడు సైన్యముల బంపి స్వాధీనము గావించుకొనెను.

ఇంతకుపూర్వమే నెల్లూరు మున్నగు సీమలలో పంటకేవ చోళరాజును, చోడదేవ, చోడ, చిక్కచోడులు, హరిదేవచోడుడు, కన్నరదేవచోడుడు మున్నగువారు గణపతిదేవునిసామంతులుగావన్నెకెక్కిరి.

ఏరువనాటిలో పాలించుచుండిన వారిలో కొందరు గోదావరీ ప్రాంతములకు వచ్చిరి. ఏరువ భీముడా వంశమున మిక్కిలి ప్రసిద్ధి జెందినవాడు. ఏరువలో ఇతడు 1200 సం॥ మధ్యను పాలించెను. రెడ్డిరాజుల నెదిర్చి ఏరువ భక్తీశ్వరచోడుడు, అన్నదేవచోడుడు ననువారు 1360'—1417 మధ్య కామపురి రాజధానిగా పాలించిరి. రెండవ భీమరాజు అల్లాడరెడ్డి సైన్యాధికారులలో నొకడయ్యెను. కమ్మనాటిలో ఏరువ కేశవరాజునొకడధికారిగానుండెను.

1426 ప్రాంతమున ఒంగోలు తాలూకాలో నీ తెలుగుచోడులలోని ఆలనుండల నూకయదేవరాజు కొడుకు వీరఅప్పయ భూదేవచోడరాజు, గంగయదేవ చోడరాజుల పాలన గానవచ్చుచున్నది.

ఇట్లే ఆంధ్రరాజ్యములోని యనేక ప్రదేశములలో నీ తెలుగుచోడులు వరుసగా నే సామంతులుగా పాలించుచు, దేశరక్షణయందును, పరిపాలనయందును తమ విస్తృత ధర్మమును నిర్వహించుచు, ఆయా ప్రదేశములను గృహాగ్రామములుగా జేసుకొని, యచటి వారిలో గలిసిపోయినట్లు చరిత్రజ్ఞు లభిప్రాయపడిరి. రెడ్లు, కమ్మవారు, వెలములు, యాదవులు మొదలగు వారిలో నిట్లు కలిసిపోయిరి. కమ్మరాష్ట్రములోని వారు కమ్మవారిలో కలిసిపోయిరి.

కథానిక

# * సంజదీపాలు *

## శ్రీ అనిసెట్టి అప్పారావు

వెంకటేశ్వర్లు చాలా డాంబికుడు. వస్తుతా —డబ్బుదగ్గర తప్ప— చాలా మొగమాటస్తుడు. సిల్కులుతప్ప వేరేవి కట్టడు. గోల్డుఫ్లేకుతప్ప మరొకటి కాల్చడు. వీళ్లపనులు వాళ్లపనులు నెత్తిన వేసుకుని చేస్తాడు.

వెంకటేశ్వర్లు నిజానికి చాలా మంచివాడు. నవనాగరికుడు. అయినా "వెంకటేశ్వర్లు ఏం చేస్తున్నాడు?" అని అడుగుతారు కొందరు. వెం... అద్భుతమైన చాకిరీ చేస్తున్నాడని సమాధానం వస్తుంది. అయితే అతడు చేసేది మనకంటికి కన్పించదు. మన చెవికి విన్పించదు. ఇంతెందుకు; మనకి నచ్చదు—

వెంకటేశ్వర్లు వస్తున్నాడూ అంటే బజారులోని స్నేహితులు పసిపిల్లల్లా అయిపోతారు. వాడితో స్నేహం అంటే వాళ్లకి అదో భాగ్యంగా వుంటుంది. నిజానికి వెం.—కొంచెం ఖర్చుగాడు. కొంచెం ఉన్నవాడు. తన తరపున, భార్య తరపున, పిల్లల్ని మామ తరపున వీళ్లూ వాళ్లూ అనుకున్నంత కాకపోయినా, కొంచెం వున్నవాడే, వాడు.

తెలియనివాళ్లు, "ఎవ్రరా ఆ వెంకటేశ్వర్లు!" అని ఆశ్చర్యపోతారు. వెం.—మితభాషి. ఉదాసీనుడు. నలుగురిలోనూ బాగా మెలగ్గలడు. మెరవగలడు. పెద్ద పెట్టున అవసరసమయాల్లో నవ్వగలడు. అయితే ఏడ్వడం అంటే తెలియదు వాడికి. ఇంకా జీవితస్వారస్యం తెలియలేదు వాడికి.

అన్నీ తెలిసికూడా, "వెంకటేశ్వర్లు ఏం చేస్తున్నాడు?" అని అడుగుతారు కొందరు, పెద్దమనుషులు.

వాడి తిరుగుళ్లేమిటో వాడికే తెలియకపోతే, ఆలోచించుకోడానికి అవకాశం చిక్కకపోతే, వాడేం చేస్తాడు? ఏం చెయ్యాలి? నేను ఫలానాపని చెయ్యాలి అని ఎవరైతేమాత్రం కోరి చెయ్యగలుగుతున్నారా? మనం బయలుదేరేది ఒకచోటికి, చేరేది మరోచోటికి — అన్నీ తెలిసినవాళ్లకు ఇదిమాత్రం తెలియదూ?

* * * *

మామూలు ప్రకారం ఆ రోజున వెంకటేశ్వర్లు బజారుకి వెళ్లాడు. బజారులో వాడికి గడియారాల షాపులో కూర్చోవడం అలవాటు. గడియారాలు షాపులో గోడలకు బరువై, కట్టివేయబడ్డ మనుషుల్లా మూలుగుతుంటాయి. కాలం ట్రాఫిక్కు సరైన జాగా అది. కోడిగుడ్డులో దీపం వెలిగినట్టు వెలుతురు అక్కడ. గడియారాలషాపు గందరగోళానికి చిహ్నం. చిరాకుకి, చిందరవందరగా చిక్కుచెదురుగా పడివున్న కాలానికి, మనోవిహ్వలతకి చిహ్నం.

షాపులో గడియారాల సాయిబు కంటికి అద్దం తగిలించుకుని కాలాన్ని పరామర్శిస్తుంటాడు. కాలానికి చేరిన తుప్పుని విదిలిస్తుంటాడు. నువ్వు ఎప్పుడైనా వెళ్ళు, ఎలాగైనా ఎందుకైనా వెళ్లు; నిరంతరం ఆ సాయిబు గందరగోళాన్నే మరామత్తు చేస్తుంటాడు. ఆ సాయిబు క్లబ్బులో వెం.—కి రెండో చెయ్యి. వెం.—వెళ్లి వా, కాస్సేపు కూర్చున్నా, మాట్లాడతాడేమో నని వేచివున్నా, ఊహూ, ఆ సాయిబు తల ఎత్తి చూస్తాడేమో గాని, మారుపలకడు.

వెంకటేశ్వర్లు ఏమీ పాలుపోక, గడియారాల షాపులోంచి చప్పున బైటపడ్డాడు. బజారులో ఎరిగినవాళ్ళు కొందరు వాళ్ళ బంధువుల యింటికి పోతూ వాణ్ణి చూసి అన్నారు: "పనేమీ లేదుగా. మా వాళ్ళింటి దాకా వెళ్ళొద్దాం రారాదూ?" అని.

అలవాటువల్ల వాడు ఎదురుచెప్పలేదు.

* * * *

ఆ ఇంటివాళ్లు 'కాఫీ తాగి మరీ పొండి' అన్నట్టుగా మాట్లాడితే, అలాగే వాడు వరండా పక్కని గదిలో కిటికీదగ్గర ఒంటరిగా కూర్చుండిపోయాడు.

కిటికీ బైట: ఎడారిలాగ నిశ్శబ్దం. ఒకటే ఎండ. ఎండిన మోడుల్లా మానుల్లా నీచుట్టూ వేయి నాల్కలు సాచే ఎండ. వాడికేమీ పాలుపోవడం లేదు. ఉక్కగా వుంది, లోపల. వెంకటేశ్వర్లు కిలోంచి చూస్తున్నాడు: బైట, రోడ్డులోంచి పసుప్పచ్చని నాల్క సాచుతోంది ఎండ. మరుగుతున్న తారులోంచి, రోడ్డులోంచి, పెరుగుతున్న కొండమెట్లులాగు ఎండ. కాలుతున్న గోలీల్లాగ, చిత్తడబ్బాలాగ, ఖాళీగా సొట్టలుపడ్డ వీధి. ఎండదెబ్బకు భయంతో కంపించి, కంటిముందు ఏదీ

అగపడక దృష్టి చెదరి రెండుగా చీలితే, వీధి చివరి మలుపులో రోడ్డులో దొర్లుకుంటూవచ్చే లాగుడుబండి రెండుగా చీలి ఏది కనపడక, భయపడి, మొత్త కొనుకున్న మనిషి: ఎండ. గోడునులాంటి నీడకింద ఎరుపు పసుపు నీలం రంగుల నత్తగుల్లలాగ ధనికుడి లాగ రోడ్డుమధ్య పెట్రోలు బంకు

ఆ ఇంటివాళ్ల అబ్బాయి గదిలోకి వచ్చి ఒక గ్లాసు మంచినీళ్లు, ఒక పత్రికా బల్లమీద పెట్టి వెళ్ళిపోవడంకూడా చూశేడు తను వెంకటేశ్వర్లుకి ఇవాళ మరీ తోచడంలేదు సగం, మధ్యాహ్నం అలాంటిది.

వాకిలిదగ్గర ఏదో చప్పుడు అయింది. ఇన్నాళ్లూ తమస్సులో జీవిస్తున్న వెం — మనస్సు వెలుగును తాకుతున్నది ఎవరో ముసలివాడు లోనికి రావడానికి అనుమానిస్తున్నట్టుగా అపుపించాడు. ఇన్నాళ్లూ తంద్రావస్థలో పడివున్న వెం. — మనస్సు మేల్కొంటున్నది. వాడిదృష్టి ముందు అతడి చేతుల మీద పడ్డది రెండు వింతవస్తువుల్లా ఆ చేతుల్లో ఏదో విచిత్రమైన ఆకర్షణ వుంది. వెలుగుని దాచుకున్నవవి. ఏదో ప్రత్యేకత. ఏవో వింతకాంతులు చల్లినట్టు అతడి జేగురురంగు ముఖం మిరుమిట్లు గొల్పుతున్నది. ఏదో వెలితీ. గుండ్రటిలావుపాటి పెదవి లాంటి దేదో లోటు. అతడు జాగ్రత్తగా తవుళ్లాడుకుంటూ లోనికి వస్తున్నాడు.

వెంకటేశ్వర్లుకి ఛట్టున స్ఫురించింది: అతడు అంధుడు అని — వాడిమనస్సులో వేళ్లు పెట్టి కలచినట్లయింది. జాలి అనేది లోపలినుంచి పూలమొక్క లోని చెమ్మలాగ తన్నుకువచ్చినట్లయింది. మరీ అలా చూడ్డం తనకే బాగుండక వెంకటేశ్వర్లు పత్రికలో తలదూర్చాడు.

వాకిట్లో అతడి గొంతు విన్పించింది:

"అమ్మాయ్, మన బంధువులు వచ్చినట్టున్నారు."

"అవునండీ. ఇప్పుడే వస్తా. మీరు అలా కూర్చోండి" — ఇంటి ఇల్లాలు.

"నాదేముందిలే అమ్మా రోజు వచ్చే వాణ్నేగా. కాస్సేపు అలా కూర్చుని పోతాలే"

* * *

అతడు వెంకటేశ్వర్లువైపే చూస్తున్నాడు. సరాసరి వచ్చి వాడి ప్రక్కన నిల్చున్నాడు. గదిలో మరోమనిషి వున్నట్టు అతడికి తెలుసులా వుంది. వెంకటేశ్వర్లు తన అంచనాని సవరించుకున్నాడు: అతడికి చత్వారం కామోసని.

దగ్గరగా లేని కుర్చీకోసం అతడు చేతులు చాచుతుంటే: వెం. — అతడి చెయ్యి పట్టుకుని వున్న చోటు చూపించాడు. కూర్చుంటూ, ఆతడు వెం.. — వైపు [illegible] డానికి ప్రయత్నం చేస్తున్నట్టు ఆరి వెలిగే అతడి కళ్లు చెబుతున్నాయి. ఇంతవరకుండు ఎక్కడో దాసిన విషాదాన్ని రుజావు చూసుకోడానికన్నట్టు, నిర్జీవపు అలసు తండ్రో అయిపోతావు — వెలవెలాడి నిరువిడిచె తడిపట్టలా అయిపోతావు.

అనంత రామయ్యగారు వృద్ధుడు. నిస్సారంగా మిణుకు మిణుకు మనే చుక్కలవంక చూస్తూ జీవితపు ఆఖరి గడియలు లెక్కించుకుంటున్నాడు. జీవితంలో ఒక మహాయానం గడిచిన పిమ్మట, కష్టకడపటి సముద్రం దాటినపిమ్మట, అతడీ ప్రపంచపు తీరంచేరి నిశ్చింతగా సేద దీర్చుకుంటున్న మనిషిలా అపుపించాడు

అతడు వెం — వైపు తన చేతులోంచి చూస్తూ అడిగాడు: "మీరేం చేస్తున్నారు?

అలవాటువల్ల —అన్నాడు: "నేను బి. ఏ. ప్యాసయ్యాను"

"ఇంకా ఉద్యోగంలో చేరలేదా?"

బి. ఏ. ప్యాసవడంలో గొప్ప ఏముంది! —

"లేదు. ఇంకా చదవాలనుంది."

"ఇంకా ఏం చదువుతారు?"

అయితే, బి. ఏ. ఫర్వాలేదు!

వెం. — అనుకున్నాడు: అతడు నన్ను నా మాటలగుండా చూస్తున్నాడు — అని —

-అయినా మీ స్థితిగతులు తెలియకుండా మాట్లాడుతున్నానేమో. అయినా కొంత వయసు రాగానే ప్రతిమనిషీ ఏదైనా పనిచేయడం ప్రారంభించాలనుకో —

అతడు తనని వదలేదు.

"ఏదైనా ఉద్యోగం చూడకూడదూ!" ఇంతటితో ముగిస్తే బ్రతికి బైటపడినట్టనుకుని వాడు అన్నాడు: "అలాగేనండీ!"

దృష్టిలేని అతడి కళ్ళని ఆలోచన ఆక్రమించుకుంది. అతడు లేని చూపుని తన చేతులమీదికి ప్రసరిస్తే, కన్నుల్లో వ్యక్తం కావలసిన అతని మనస్సులోని భావాన్ని — అతడు తన చేతుల్లోకి రప్పించుకుంటున్నట్టుగా వున్నాడు. కళ్లు చేయాల్సిన పనిని చేతులు చేస్తున్నవి.

"తప్పకుండా చూడు నాయనా!"

"అలాగేనండీ!"

"మీకు...?"—లోపల ఆతురతగా వేపున్నా మనస్సు నొచ్చుకుంటూ వేమోనవే భయంకొద్దీ వెం.—పూంతం అడగలేకపోయాడు.

అనంతరామయ్యగారు గ్రహించాడు:

"అవును. నాకు చూపు తగ్గిపోయింది. మీకు కన్పించడంలా?"

అవునని అనడానికి తనకి నోరురాలేదు. అనవసరపు వినయాలు చూపడం, ఒట్టి పుణ్యానికే గుండె, కళ్లు మనస్సు నీరైపోవడం ఆ ముసలాడి కాలానికి సంబంధించినవి కావు. అతడు మూడుతరాల మనుష్యుల్ని చూశాడు.

ఇంతసేపూ నిర్ఘాంతపోయిన వెంకటేశ్వర్లు. వాడి అనుమానం తీరిపోయింది గనుక, అనంతరామయ్య ముఖంవంక నిర్భీతిగా చూస్తున్నాడు! అది బడికివెళ్లే కుర్రాడి అమాయకమైన ముఖంలా వుంది. అతడు బళ్ళో ఎప్పుడూ లెఖ్ఖలు తప్పుచేసి వుండడు. ఎప్పుడూ క్లాసులు ఎగగొట్టి వుండడు. తల్లిదండ్రుల్ని ఎన్నడూ కష్టపెట్టి వుండడు. అతడు తల్లీ తండ్రీ ఒప్పుకువచ్చిన సంబంధాన్నే, పిల్లను చూడకుండానే పెళ్లిచేసుకుని వుంటాడు. వీధిలాంతరు కింద చదువుకుని వృద్ధిలోకి వచ్చిన మనిషిలా, కష్టాలను సహనంతో ఎదుర్కొన్న మనిషే అయివుంటాడు. జీవితమంతా నిక్షేపంగా, దిలాసాగా, హాయిగా గడిపివుంటాడు. అతడికి ఈ లోకంలో అవసరాలు లేవు. ఈలోకంలో తన కార్యకలాపాలు ముగించుకున్న మనిషి అతడు.

కోడిగుడ్డులోని చందమామలాగ సూర్యుడు తిరిగిపోతున్న వేళ, అనంతయ్య జీవితవృత్తాంతం వెలుగుని చూస్తున్నది!

నేను చాలా చిన్నవయస్సులోనే సంపాదనలో దిగాను. ఒకచోటంటూ స్తిమితం లేకుండా ఆరేళ్లు అదీ ఇదీ చేస్తూవచ్చాను. చివరికి 1916 లో రైల్వే పార్శెల్ ఆఫుసులో కుదురుకున్నాను. అది చాలా విచిత్రమైన పని. కొన్ని ప్రత్యేకమైన గదుల్లో కాగితాలు దొంతర్లు దొంతర్లుగా గది ఎత్తున పేర్చి వుంటాయి. అక్కడ కాగితాలు లెక్కపెట్టడం నా పని. ఒకొక్కక్క కట్టలోంచి ఒకొక్క ఫారాన్ని తీసి, అన్నీ కలిపి, విడివిడిగా పుస్తకాలుగా పెట్టేవాణ్ణి. మొదట్లో అది అంత మంచిపనిలా అవుపించలేదు. ఏముంది! ప్రొద్దున్న లేచింది మొదలు చీకటిపడేదాకా కాగితాలు లెక్కపెట్టడమేగా! అందులో ఎక్కువ కాలం ఉండలేనేమో ననిపించేది. నాకు స్కూల్లో లెక్కలు మాష్టరుగా పనిచెయ్యాలనిఉండేది, మొదటినుండీ. అయితే మన ఆశలకు హద్దంటూ ఏముంది! ఏ మనిషి ఏ పనిలో అయితే రాణిస్తాడో ఆ పనే దొరకాలని ఎక్కడుంది. అందువల్ల ఎక్కడికక్కడ సరిపెట్టుకోవడమే, తృప్తిపడడమే నేను చెయ్యగలిగిందంతా అనిపించేది.

వెం.—అడిగాడు: "అయితే మన దేవూరండీ?"

"ఒక ఊరని ఏముందినాయనా. మనకి ఎక్కడ జరుగుబాటువుంటే అదే మనఊరు."

ఉద్యోగులకూరు!

అనంతరామయ్య: దేనికైనా ఒకరోజు అంటూ రావాలిగా! ఈ కాగితాలు లెక్కపెట్టడంతోనే జీవితమంతా వెళ్ళిపోతుందనుకున్నా. పాతపడేకొద్దీ ఆపనికి బాగానే అలవాటుపడ్డాను. అనుకోకుండా ఒకరోజున నాకు ప్రమోషను వచ్చింది. ప్రతిఉద్యోగినిగురించికూడా కాన్ఫిడెన్షియల్ రికార్డంటూ ఒకటి ఏర్పరుస్తారని నాకు అంతదాకా తెలిసింది కాదు! నాకంటె ఇద్దరు సీనియర్లువున్నా నాకు ప్రమోషను ఇచ్చారు -ఒకరి నోటిదగ్గరది మరొకరి నోటిదగ్గర పెట్టడం—వాళ్లేవో కొద్దికొద్ది తప్పులు చేశారు. అందరూ చేసేవే. ఏవో పై ఆఫీసరుతో భాగాలు పంచుకోవడంలో తగాదాలు వచ్చాయి వాళ్లకి. తెలివితక్కువవల్ల వాళ్లు బైటపడ్డారనుకో.

అయితే నాకు ప్రమోషనువచ్చిందనేసంతోషం ఎంతోకాలం నిలవలేదు. అంతకు ముందుపనే కొంత మెరుగనిపించింది. లెఖ్కలు, కూడికలు, తీసివేతలు, గుణింతాలు, అన్నీ అంకెలు! బండచాకిరీతప్ప, నీమనస్సు చెయ్యాల్సినపనంటూ ఏమీ లేదు. తలవంచు. అంకెల్లో కళ్లు ఉంచు. కలం కదుపు. అంతే! ఇది నాకు తగినపని కాదేమోననిపించింది. ఉద్యోగానికి రాజీనామాచేద్దాం అనుకునేవాణ్ణి. కానీ మరో ఉద్యోగం మంచిది దొరుకుతుందనేనమ్మకం ఏముంది! దొరికినా అందులోమాత్రం కుదురుగా వుంటామని ఎక్కడవుంది! అందువల్ల చివరిదాకా అదేపనిని అంటిపెట్టుకునివున్నాను.

"అయితే మీకు ఆలోచించేపని కావాలా; పెద్ద హోదా, దర్పం, అధికారం వున్న ఉద్యోగం కావాలా పెదనాన్నగారూ! ఏదో ఒక ఉద్యోగం చేయమన్నారుగా! అయితే ఇలాగే జీవితమంతా మీ కోర్కెలన్నీ తుంచివేసుకుని బ్రతికారా? మీ ఆశలు, ఆశలు, అన్నిటినీ అణగద్రొక్కుకుని, మీజీవితమంతా నిరర్థకం చేసుకున్నారా!"

"అయితే వెంకటేశ్వర్లూ! నువ్వేం చేస్తున్నట్టు! అసలు నువ్వేమైనా చెయ్యగలవా అని—ఐనా నిలువుటద్దం ముందు కూర్చున్నావు గదా! ఐనా నువ్వేం చెయ్యాలో నీకే తెలియదులే ఇంకా! గట్టిగా అంటే

నీ రోజ్గాపం వస్తుంది. కళ్ళ వెంట నీరు పొర్లుతుంది. ఏనా నువ్వేం చెయ్యగలవ్! — అలా ఇరవైయ్యేళ్ళు ఆ ఉద్యోగంలో ఉన్నాను. ఫఢుక్, పోయింది!”

అతడి మాటలు వెంకటేశ్వర్లుకి విమాత్రం బోధపడ్లేదు. కాగా ఆ ముసలాడి నిండుతనాని కవి తీసి కట్టుగా అవుపించాయి. ఎన్నాళ్ళనుంచో మన మధ్య జరుగుతూన్న ఒక సర్వసామాన్య విషయాన్ని మనం తెలుసుకోలేకపోతే, అతను మనకి తెలియ చెప్తూతున్నట్టు — మన బాధలన్నీ క్షణకాలం మరచి, నివారణోపాయంతోచి, ప్రాణానికి కొంతహాయి దొరికి నట్టు, వాన వెలిసినతర్వాతి, అవును, వాన వెలిసినతర్వాత.

అతను మన దీనావస్థని చూసి, జాలిపడితే — అతన్ని చూసి మనం జాలిపడతాము అంది మనస్సు. సహజం అంది మనస్సు.

అనంతయ్య: “అప్పుడు సూర్యాస్తమయం కావస్తున్నది. ఆ ప్రొద్దుకి పుస్తకం దానంతటది మూతపడుతుంది. ఈ బల్లకు సరిపోయేటంత పెద్దది. నాకు తెలియకుండా నే చేతులు పనిచేయడం మానేసేవి. ఆవేళకి పని చాలించి నేను మా అబ్బాయి కోసం ఎదురుచూస్తున్నాను. ఆ ఏడు వాడు ఫోర్తు ఫారంలో ఉన్నాడు. ప్రతి సాయంత్రం బడినుంచి టిఫిను కొరికియడూ, పుస్తకాల సంచీ పట్టుకుని వాడు సరీగ్గా ఆ వేళకి నా ఆఫీసుకి వస్తాడు. అలా అప్పటికి అయిదేళ్లనుంచీ ప్రతి నిత్యం జరుగుతున్నది. మేం ఇద్దరం కలిసి ఇంటికిపోయేవాళ్లం. తల ఎత్తకుండా పద్దులు రాస్తున్న వాడినల్లా, వాడు వాకిట్లో తలుపు పక్కన నాకోసం ఎదురుచూస్తుంటే అలికిడి విని తెలుసుకునేవాణ్ణి: వాడు వచ్చాడని. వాడువస్తే ఇంక పద్దులు రాయడం నావల్ల అయ్యేది కాదు. ఇంక ఇద్దరం కలిసి ఇంటికిపోయేవాళ్లం. దోవలో వాడు ఆరోజు స్కూల్లో ఏయే పాఠాలు చెప్పిందీ, తను ఎన్ని లెఖ్ఖలు రైటు చేసింది చెప్పేవాడు. తెలియనివి నన్ను అడిగి తెలుసుకునేవాడు. దోవలో సింగు దుకాణందగ్గిర వాడికి కొరబ్బాందీ కొనిపెట్టేవాణ్ణి. కోవాబిళ్ళలు కూడా —”

— ఆమాటలు చెబుతుంటే మమతవల్ల, పురాస్మృతులవల్ల పొంగివచ్చిన కన్నీరు ఆయన నేత్రాలను కమ్మివేశాయి. సాధారణ జీవితంలో మాధుర్యం అనేది ఎలాంటిదో, ఎప్పుడు ఎక్కడ దానిని పొందడం జరుగుతుందో ఆయన బాగా తెలుసుకున్నవాడు గనక ఇంత సామాన్యవిషయానికే ఆయన కళ్ళవెంట నీరు కమ్మివుంటుంది. బహుశా వెంకటేశ్వర్లుకిది అర్థమైవుండదు.

“అయినా యంత్రం ను రాలేను. వాడు రాకపోతే నాకు కొంచెం ... అయినా మళ్ళీ పుస్తకం తెరిచి, ... ఎత్తకుండా అలా పద్దులు రాస్తూ అలాగేనుండాల్సి రాస్తూనేవున్నాను. అయితే నిమిష నిమిషం వాడు ఈపాటికి వస్తాండాలి అనిపించేది. ఈపాటికి మెట్లకింద సైకిలు స్టాండు వేసి, పాలు మెలికల్లా తిరిగివచ్చే మెట్లమీద పరిగెత్తుకుంటూ; పుస్తకాలు, సుమాస్తాలు, టైపురైటర్ల మధ్యనుంచి, టిక్కుటిక్కుమంటూ, ఛకరంగా అవుపించే బీరువాల ఇరుకుసన్నమధ్యనుంచి నాదగ్గరికి వస్తాంటాడు అనిపించేది. వచ్చి, తలుపు దగ్గర నేనేమంటానో చూద్దామని దాగివుంటాడని పించేది.

అలా వాడు నన్ను ఆటలు పట్టిస్తుండేవాడు. అయితే ఆవాళ ఎంతసేపటికీ రాలేదు వాడు. విసుగుపుట్టి డభీమని పుస్తకం మూసేశాను. ప్రక్కన అప్పుడే డ్యూటీలోకి వచ్చిన కొత్త గుమస్తా ఉలిక్కిపడి నావైపుచూసి మళ్ళీ తన పనిలో నిమగ్నుడయాడు.

కిటికీలోంచి బైటకి తొంగిచూశా. జేబులోంచి గడియారం బైటకి తీసిచూశా. ఏదో జరిగినట్టు అనిపించింది. చిన్నముల్లు అవుపించలేదు. ఎక్కడ పడిపోయిందో! అంత అజాగ్రత్తగా వుంటే పడిపోక ఏమౌతుంది! అయినా ఎలా పడిపోతుంది! నిజం. చిన్నముల్లు అవుపించడం లేదని గోడగడియారంవంక చూశా. అది ఆరు కొడుతున్నది. మళ్ళీ నా గడియారంవంక చూసుకున్నా. చిన్నముల్లు తల ఉండీ లేనట్టు మసక మసగ్గా లీలగా అవుపించసాగింది. ఏం జరిగింది? ఒక్కసారి వొళ్లంతా ముచ్చెమటలు పోసినై.

“ఫఢుక్! పోయింది!” ఆ భయంలో పెద్దగా అరిచానేమో, ప్రక్కన పనిచేస్తున్న కొత్త గుమస్తా అదిరిపడ్డాడు.

“ఏమయింది? ఏమిటి పోయింది?” నన్ను గట్టిగా పట్టుకుని అడిగాడు.

“కుడి కన్ను. కుడి కన్ను అవుపించడం లేదు. పో, పోయింది పో!” పెద్దగా అరిచానేమో, నా చుట్టూ గుమాస్తాలు చేరారు.

“ఆరోజున ఇంటికి ఎలా చేరానో నాకే తెలియదు. ఇంటికి వెళ్లాలంటే భయం వేసింది. దేవుడా, ఏమిటి, తల్లి లేని బిడ్డకి ఇన్ని తిప్పలు తెచ్చిపెట్టావు, ఇలా చేశావేమిటి అనుకున్నా. ఈ ఉద్యోగం పోతే, కళ్లు పోతే, లోకం ఏముంది, బతికేది ఎలా అని నాలో నేను గుంజాటన పడ్డాను.

తోటివాళ్లు కొందరు పొలం పుట్రా సంపాదించుకున్నారు. కొందరు ఇల్లూ వాకిలీ కట్టుకున్నారు. మొదటినుండీ బల్లకిందచేయిపెట్టకపోవటం నా తత్వానికి గిట్టేదికాదు. స్వచ్ఛత్వం, ఆత్మాభిమానం అడ్డువచ్చేవి. ఎన్నికష్టాలు వచ్చినా మంచివాడికే వస్తాయి నాయనా!"

నదిలో నిశ్చలమైన నీరులాగ అతడిజీవితం ఒడుదుడుకులు లేకుండా నింపాదిగా గడిచిపోయినట్టు అతనిముఖంలో అవుపిస్తుంటే, అతడు కష్టాలతాకిడి తనకి ప్రారంభమైందని చెబుతున్నాడు - ఈ జీవితం తనకి ఏంచేసిందో ఈజీవితంలో తనకి ఏంజరిగిందో చెబుతున్నాడు.

ఇంతలో ఇల్లాలు వచ్చి "కాఫీ తీసుకోండి. చల్లారిపోతుంది" అంది. ఆమె కళ్లు జాలిగా అన్నాయి: "పాపం, ఆయన మిమ్మల్ని విసిగిస్తున్నాడులా వుంది!"

జవాబుగా నెం.—తన కళ్ళతో అన్నాను: "ఫర్వాలేదు. ఆయన జీవితపులోతులు చూసినవాడు" ఆమె కళ్లతోనవ్వి లోపలికి వెళ్లిపోయింది. కాఫీ తాగడం పూర్తయింది.

"సరాసరి నన్ను డాక్టరింటికి తీసుకపోయారు. ఆయన అప్పటి కప్పుడు కంటికి కట్టుకడుతూ ఢిల్లీ వెళ్లమని సలహా యిచ్చాడు. అక్కడ సినా అని పెద్ద డాక్టరున్నాడు. బహుశా శస్త్రచికిత్స చేయాల్సి వుంటుంది. ఆలశ్యంచేస్తే కన్ను సాంతం పోవచ్చునని చెప్పాడు. నేను చాలా అధైర్యపడ్డాను."

"ఈ ప్రపంచంలో తనంతటి దురదృష్టవంతుడు మరొకడు వుండడు! అయినా ఢిల్లీ పోవాలి! ఇహ ఢిల్లీ పోవాలి! తన కంటిని—పోయిన దృష్టిని మరొకసారి తిరిగి తెచ్చుకునేందుకు మరొకసారి కష్టపడి... పనిచేసి...మరొకసారి పోగొట్టుకొనేందుకు!! శెలవు మంజూరు చేయించుకుని, అవును, తప్పదు, తను ఢిల్లీ వెళ్లాలి! మరి తన కన్ను పోతే ఉద్యోగం ఎలా చెయ్యగలడు? తన ఉద్యోగం పోతే తను ఎలా బ్రతగ్గలడు? తన కొడుకు పెద్దవాడై వాడి కాళ్లమీద వాడు నిలబడేదాకానైనా—వాణ్ణి పోషించే బాధ్యత తనదేగా మరి!

—పో, ఢిల్లీ పో!

అందుకే ఆమర్నాడే ఢిల్లీ వెళ్లాడు. ఢిల్లీలో పెద్ద డాక్టరు నీ ఉద్యోగంవల్లనే నీకన్ను పోయిందన్నాడు. "మొదటినుంచీ జాగర్తపడ్లా?" తనని మందలించాడు. తను చిన్నకుర్రాడిలా బావురుమన్నాడు. ఐతే తను వేసిన లెఖలు, తను చేసిన చాకిరీ, తననీ తన సంసారాన్నీ ఇన్నాళ్లూ పెట్టి పోషించిన తన ఉద్యోగమే తన కంటిని పరిహారంగా అపహరించిందన్నమాట! తను డాక్టరు మాటల్ని నమ్మలేకపోయాడు తెలిసికూనా, నమ్మడానికి భయపడ్డాడు. మనిషి తనని తను ఎంతవరకని మోసగించుకోగలడు!

డాక్టరు ఆపరేషను చేసి కట్టు విప్పే రోజున అన్నాడు: "ఈ ఉద్యోగం మానుకో! ఈ రాతకోతల ఉద్యోగం మానుకో!"

"పిల్లలుగలవాణ్ణి! ఎలా మానుకునేది."

"ఏదైనా సూపర్వైజరీ వర్కు చూసుకో."

ఏదైనా తనిఖీ పని!

"ఇంకా కొన్నాళ్లు ఇందులోనే వుంటే రెండో కన్ను కూడా పోవచ్చు!"

"ఐతే ఈ కన్ను పోయినట్టేనా?"

డాక్టర్ని అడిగితే ఆయన మండిపడ్డాడు. తెలివితక్కువ, ఎందుకడిగాను, అనుకున్నాడు అయినా డబ్బు ఇవ్వకుండా; ధర్మానికి చేసున్నాడా ఏం? అనుకోలేదు తను ఏముంద మరి, సవినయం; ఎవరేమాటలన్నా, విని వినవట్టు పడటం సహజమైపోయిన గుమస్తా ప్రాణంకదూ తనది. ప్వతూ మాటలు తుడిచేసుకోడమేగా ఇన్నాళ్లూ తను చేసింది. అంగువల్ల తనకేమీ అనిపించలేదు —

"నెమ్మదిమీద నీకు తిరిగి చూపు వస్తుంది!! నమ్మకంచూపించాడు డాక్టరు. అయితే నయమవుతుందన్నమాట! తను లోలోన ఉబ్బి తబ్బిబ్బైపోయాడు. తనకి పూర్తిగా దృష్టి వస్తుంది! దీపం వెలుగుతుంది!

—నమ్మకం ఒట్టి పిచ్చిది! ఆశ, ఆర్భాటం లాగ నమ్మకం ఒట్టి పిచ్చిది!

*    *    *    *

ఇష్టాయిష్టాలగోడు: చెరువుగట్టున మండూకజనం తెప్పతిరునాళ్ల రోజున ఉత్సవం చేసుకుంటున్నాయి. వెంకటేశ్వర్లు గుండెమీద చెయ్యివేసుకుని చెప్తున్నాడు:

నూరేళ్లు నిండిన ఆ ముసలివాడివంక చూస్తూ, ఆమాటలు వింటుంటే వాటంతటవే తనలో ఎవో అభిప్రాయాలు ఏర్పడుతున్నవి. అతడు ఈప్రపంచపు పర్ణకుటీరంలో, చలివేంద్రంలో చల్లగా సునాయాసంగా కాలం వెళ్ళబుచ్చుతున్న మనిషి.

జరిగిందేదో జరుగుతూవుంటే (పడిపోతూనే లేవడానికి నిరర్థకయత్నంచేసే కాళ్లు పడిపోయిన మనిషిలా) తన మానాన తను సజావుగా సాక్షీగా జీవితాన్ని గడిపేందుకు తను చెయ్యాల్సినదేదో తను చేస్తున్నాడు. ఎన్ని దినగండాలు వచ్చినా పరుల

ప్రసక్తి లేకుండా అతను తన వృత్తాంతాన్ని చెబుతున్నాడంటే తనకి చాలా ఆశ్చర్యం వేసింది! అంత చెక్కు చెదరని ధైర్యం, జీవితంమీద అంత నిష్పక్షపాతదృష్టి, అంత సహనశక్తి ఎలా అలవర్చుకోగలిగాడా అని చాలా విస్మయం కలిగింది. సామాన్యుని జీవితం ఎంత అద్భుతం అనిపించింది!

వెంకటేశ్వర్లులో మానసిక పరివర్తనలను ఉత్పత్తి చేసే యంత్రంలాంటి మనస్సు అంది:

ఇవాళ నువ్వు ఒక కొత్తమనిషిని కలుసుకున్నావు. సామాన్యమైన తన జీవితాన్ని గురించి ఒక ఆత్మీయుడు దృష్టాంతీకరించి చెబుతుంటే విస్తుపోయి, వాస్తవ పరిస్థితులనుంచి అందమైన ఆలోచన పుటలోకి గాలిలోకి ఊహాలోకి అవివేకంలోకి ఎగిరిపోతున్నావు.

వెంకటేశ్వర్లులో సహజప్రవృత్తులను నిర్వచేసే లోయలాంటి గుండె అది:

నిజం. అతను గొప్పవాడు కాడు. నలుగురిచేతా గొప్పవాడనిపించుకోవడ్గ పనులేవీ చేయలేదు. అయితే అతను చెడుపనులేవీ చేయలేదుకూడా. ఇదీ నిజమే. ఇంత సహాయం చేయడం అతని స్థితికి అలవి గాని పని. అతను నిత్యం మన నలుగురిలో తిరిగే మనిషి. మన మధ్య హటాత్తుగ రోజులో క్షణంపాటు కనురెప్పపాటు మెరిసే మనిషి. అతను సామాన్యుడే. సర్వసామాన్యుడే. అయితే అతడు తన కుటుంబంకోసం తన సర్వస్వం ధారపోశాడు. తన కొడుకు సుఖంకోసం మంచి భవిష్యత్తుకోసం తను అనేక బాధలకు లోనయ్యాడు. తనని తను ఈ లోకానికి కానివాడుగా చేసుకున్నాడు.

అయితే ఆ ఒక్క కొడుకునీ ఋజుమార్గంలో నిలిపి, కంటికి రెప్పలా కాపాడి, పెద్దవాణ్ణిచేసి ఒక ఇంటివాణ్ణిచేసి, ఒక మంచివృత్తిలో ప్రవేశపెట్టి, తనకి మల్లేనే తన కొడుకునిగూడా ఈ జీవితపు తుఫానులలో సురక్షితంగా పయనించే ఓడలాగ, హంసలాగ, ఐరావతంలాగ, పంచకల్యాణిలాగ ఈ జీవిత సుఖదుఃఖాలను సమదృష్టితో చూసే తనలాగే తన కొడుకుని గూడ సమాయత్తపరచి వుంటాడు.

అతన్ని చూస్తుంటే, అయ్యో, ఇలాంటివాడికి కళ్లులేవే, ఏమిటీ వైపరీత్యం అనిపిస్తుంది. అవును. అతడికి కళ్లులేవు. కళ్లు ఉన్నవాళ్ళకంటే ఉండి కూడా పోగొట్టుకున్నవాళ్ళకంటే అతడు నయమే.

అయినా...

అవును...

అయినా...

వెంకటేశ్వర్లే నే మాట్లాడుతుంది

అయినా ఎవరిని నిందిస్తావు నువ్వు? అసలు ఎవర్ని నిందించాలి నువ్వు? నాబలు ఒట్టిపోవడం తప్ప, పోరుకో, ఎందుకు నింది_ఫు!

వెంకటేశ్వర్లు మనో ప్రవృత్తి:

కారుణ్యం చిప్పిలే అతడి వదనం, కళ్లులేని అతడి దీనావస్థ, అతడి యథార్థజీవితాన్ని కప్పిపుచ్చుతున్నదేమో. ఏమో, అతను మంచివాడని ఎలా చెప్పగలవు! తనకి కలిగినదానితోనే సంతృప్తి పడుతున్నమాట నిజమే కావచ్చు. అతడి ఎదుట కూర్చుంటే, బౌద్ధభిక్షువులా కన్పిస్తే, అనన్యమైన ఆనందమేదో నీలో పెనుగులాడి పెల్లుబుకవచ్చు. నిన్ను నీవు ఏమరవచ్చు. ఇది నీవు ఇబ్బుతో కొనలేని ఆనందం కావచ్చు. అతడి ముఖంలోని భావశూన్యత నీకు కొత్తగా వింతగా గోచరించవచ్చు. అవును నిజమే; నీకు అతడి ముఖంలో విస్మయం వెల్లువలాగ విహాయసపు వెన్నెల వాగులాగ స్ఫురించవచ్చు. అది భావశూన్యతేమో—అదీ నీకు—నీలో లేనిపోని ఈ విపరీతపు టూహలు కలుగచేస్తున్నదేమో!—ఐతే అతడి ముఖాన్ని, కళ్ళని, చేతుల్ని, మెడని, నీతి చంద్రికలో ఒక పేజీవలె చదవవచ్చు అంటున్నావా. ఆ పేజీ తెల్లటిపేజీ. తేట తెల్లం కాని, గూఢార్థాలు కాని, కారడవిలా అది నల్లటి

—అయితే ఇతర్లని గురించి "సెబాస్, సెబాస్" అనుకోవడం తప్ప; తనకై తను చేసింది, చెప్పుకోదగింది ఏమైనా వుందా? వెంకటేశ్వర్లు కిదో ప్రశ్న.

ప్రశ్నలు వ్యక్తిని లెక్క చెయ్యవు. మనిషిని అర్థం చేసుకోవు! ఎప్పుడూ అంతే! ప్రశ్న లెప్పుడూ మనిషి వ్యక్తిత్వాన్ని చులకనచేస్తాయి! ప్రశ్న లెప్పుడూ అంతే -అనే పెద్దప్రశ్న!

* * *

స్వయం కృతాపరాధియైన వెంకటేశ్వర్లుని ఆలోచనలోంచి తట్టిలేపాడు అనంతరామయ్య:

"మీరు జోడు ఉపయోగిస్తారా?"

"లేదు. నా కళ్లు బాగానే వున్నాయి."

లోపల అభిమానం రగులుకున్న వెంకటేశ్వర్లు; అనంతరామయ్య ముఖంలో మార్పులేదు; అతడు తన కథని ముగించ నారంభించాడు:

"1939 ఆగస్టు ఐదో తేదీన నేను రైల్వే ఉద్యోగం వదిలిపెట్టాను. అంటే రిటైరైనదాకా శలవులో ఉన్నానన్నమాట. ఈలోగా నేను చెయ్యగల ప్రయత్నాలన్నీ చేశాను. ఒక పక్కన మావాడి చదువు పూర్తికావాల్సుంది; మరి అందాకా చేతులు

ముమ్మ చుకు కూర్చుంటే తిండికి గడిచేది ఎలాగ. కానీ రోడ్డు మేస్త్రీ ఉద్యోగం చెయ్యడం అనేసరికి నాకు చాల చిన్నతనం వేసింది. నూరు రూపాయల జీతం తీసినవాడిని ఒక్కసారి ముప్పై రూపాయల నౌకరీ కుదరాలంటే ఎవరికైనా కష్టమే వేస్తుంది. ఐనా ఏం చేస్తాం! ఏదో మావాడు పెరిగి పెద్దవాడై, రెక్కలు వచ్చి, కొంత సంపాదనలో పడ్డదాకా, ఏదో ఒక రకంగా సంసారాన్ని నెట్టుకురావాలి! తప్పుతుందా-

1941 నుంచి 46 దాకా అలాగే రోడ్డు మేస్త్రీ పనిలో అనేక అవస్థలుపడుతూ వచ్చాను. అప్పటికి మావాడు స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాడు. ఒక రోజున నా అవస్థ చూళ్లేక వాడు, "నేను ఇంక ఏదైనా ఉద్యోగంలో చేరతాను నాన్నా" అన్నాడు. ఆ మాటలు వింటుంటే నా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. నీకు అంత కష్టం కలిగించే పని ఏం చేశానని అట్లా అంటావు, లోపల్లోపల తర్కించుకున్నాను. లేదు నాయనా, నువ్వు ఈ గుమస్తా వృత్తికి తట్టుకో లేవు. ఇంకా కొన్నాళ్లు ఓపికపట్టు. నీ కేకష్టం కలక్కుండా నేను చూస్తానుగా. "నువ్వు ఏదైనా టెక్నికల్ కోర్సు చదువుదువు గాని. ఈ గుమస్తా జీవితానికి నువ్వు తట్టుకోలేవు నాయనా అన్నాను—

అయినా వాడికేం తెలుసు. చిన్నతనం. నన్ను కౌగిలించుకుని ఆడపిల్లలా ఏడ్చాడు. నాన్నా, నా కోసం నువ్వు కష్టపడుతుంటే నేను చూళ్లేను నాన్నా, "నా కేదో భయంగా వుంటున్నది." అన్నాడు. వాడి నోటిమీదుగా ఆమాటలు వింటుంటే నా కడుపు తరుక్కుపోయింది. అప్పుడు వాళ్లమ్మ గనక బ్రతికివుంటే ఎలా వుండేదో అనిపించేది. లోపల ఎంత కుమిలిపోతున్నా, తన కొడుకుకూడా ప్రయోజకుడయ్యాడని ఎంతగా సంతోషించేదో అనిపించేది.

అలా వాడిని గురించి రోజు రోజుకీ ఛీతిల్లిపోతుంటే, వాడు నా స్థితిని చూసి రోజురోజుకీ గుండె దిగులు చేసుకుని, వేళకి తిండి లేక, రోజురోజుకీ దిగజారిపోతుంటే నా గుండె లవిసిపోయేవి. నా అసహాయతకీ, చేతగానితనానికి నన్ను నేను నిందించుకున్నాను."

అయితే ఆయన కుడికన్ను మళ్ళ బాగు కాలేదా? వెంకటేశ్వర్లు ప్రశ్న వేసుకున్నాడు. అలవాటువల్ల, అనుభవశూన్యతవల్ల జీవితంలో తనకు తానై జవాబు వెదుక్కోలేని వెంకటేశ్వర్లు తనమీద తను ఎదురు మళ్లా ప్రశ్న వేసుకున్నాడు. ఇప్పుడు అతనికి రెండుకళ్ళూ పోయాయి. ఉన్న రెండుకళ్లూ పోగొట్టుకోడానికే చేతులారా జీవితంలో అతను న్నదంతా. -సామాన్యుడి బ్రతుకు శిబిచక్రవర్తికథ అంటుంది. అందుకన్నే అతడింత సంతోషంగా అవుపిస్తున్నాడు కాబోలు! చేతులారా కళ్ళు లాగి వేసుకుని, ఏ కొంత కష్టంకూడా కలక్కుండా ఇన్నాళ్లూ తను సుఖపడిపోయి అవుపిస్తున్నాడు చూడు

వెంకటేశ్వర్లు అతనిపైపు నోసలుముడిచి నివ్వెరపోయి వింటున్నాడు:

"నేను ఈ ఉద్యోగంలో ఉన్న నాలుగో ఏట అనుకుంటాను, మావాడి చదువు పూర్తయింది. అప్పటి నుండి వాడు విసుగూ విరామం లేకుండా ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నాడు.

నాన్నా, నాకు కొద్దిరోజుల్లో ఉద్యోగం రాబోతూంది. నువ్వు పనిమానెయ్! నువ్వు కష్టపడుతుంటే చూస్తూ నేను ఎలా ఊరుకునేది! అన్నట్టుగా ముఖం పెట్టేవాడు.

అలా ఆరునెల్లు గడిచింది. వాడికి ఉద్యోగమంటూ ఏదీ రాలేదు. ఇంక రాదేమో అని భయం వేసేది నాకు— నేను రాలిపోతే వాడిగతేంకాను అనిపించేది."

—నీదంతా పిచ్చి. వట్టి భ్రమ. కాకపోతే నువ్వు చేస్తున్న ఆపాటి ఉద్యోగం సంపాయించలేడా మీవాడు. నీకంటికి కుర్రాడు వెర్రిబాగుల బ్రతకడం చేతగానివాడిలా అవుపించవచ్చు. ఈ జీవితపుసాములో నీకంటే ఆరితేరినవాడే నీకొడుకు. ఈ జీవితపుస్వారీలో నీకంటే గట్టిగా రాటు తేలగలవాడే నీకొడుకు. అధైర్యపడకు. నీకొడుక్కి మంచి ఉద్యోగం దొరుకుతుంది!—

"అలా నాలో నేను భయపడిన రోజు లవి. నాలో సత్తువ ఉడిగిపోతున్నది. వాడు ఇంట్లోకి ఏదో పెద్ద తప్పిదం చేసినవాడిలా, పిల్లిలా, చప్పుడు గాకుండా, మెల్లగా వచ్చేవాడు. ముఖం చాటు వేసేవాడు. నా ఎదుటకు రావడానికి, నాకు ముఖం చూపించడానికే సిగ్గుపడేవాడు. రోగిలాగ నీరసించిపోయి, ఒత్తిలాగ మంచానికి అంటుకుపోయేవాడు.

అదేమిటి నాయనా, దిగులు పెట్టుకుంటారా. నీ వయస్సులో నేను ఎలా ఉండేవాణ్ణి. ఎంత హుషారుగా ఎంత పుష్టిగావుండేవాణ్ణి. ఉద్యోగం ఇవాళ గాకపోతే రేపొస్తుంది. అంతమాత్రాన బెంబేలు పడతార్రా! ఈమాత్రానికేనా! అనేవాణ్ణి.

—నాకు ఆ భయం ఏమీ లేదు నాన్నా. నాకు తప్పక ఉద్యోగం దొరుకుతుంది. ఇవాళ గాకపోతే రేపైనా సంపాయిస్తాననే ధైర్యంవుంది నాకు.

—ఐతే నేనేమైనా అనుకుంటాననా. నేనేమనుకుంటానురా! ఐతే నన్ను చూసే ... ఇంకా

మా నాన్న నాకోసం ఇంత పెద్దతనంలోగూడా అలివిగాని బరువు మోస్తున్నాడనేనా. నన్ను చూసి భయపడ్డంలేదుగా. నన్ను చూసి భయపడే స్థితికి తెచ్చుకున్నానా నిన్ను నేను—

—లేదు. నీ నౌకరీ ఏ క్షణాన ఊడుతుందోనని మీవాడి భయం. ఇంత పెద్దతనంలో నీ కేదైనా పోనీ, నీ కంటికేదైనా ప్రమాదం జరిగితే...ఏమో, ఎలా చెప్పగలం. నీకు ఉద్యోగం పోనూ పోవచ్చు. మీవాడికి రాకనూపోవచ్చు. ఏదైనా మనకు చెప్పి వస్తుందా!—

“అలా జరుగుతూ వచ్చాయి రోజులు.

నాకు మొదటినుంచీ లైబ్రరీకి వెళ్లే అలవాటు వుంది. ఆ సంవత్సరం ఎక్కడచూసినా గలాటాగా వుండేది. మతోన్మాదం ప్రబలిన రోజులవి. డాక్టరు చెప్పినా అతడి మాటలు ఖాతరు చేయకుండా, నిత్యం నేను పత్రిక చదవడం జరుగుతుండేది. అయితే అది నా ప్రాణం తీస్తుందని, అకస్మాత్తుగా కాకుండా క్రమేణా రోజురోజుకీ నా చూపు క్షీణించిపోతుందని ఎవరైనా ఎలా అనుకోగలరు.

* * *

ఆ ప్రొద్దున నేను మంచంమీదనుంచి నిద్రముఖాన లేచి, సైకిలు తుడుద్దామని గబగబా వరండాలోకి పోతుంటే, ప్రశాంతంగా నిదరిస్తున్న మావాడి ముఖం అవుపించింది నా గుండెలమీదనుంచి పెద్ద బరువు దింపేసినట్లయింది. అప్పుడు ఎందుకో నాకు తటాలున అనిపించింది: ఇవాళ నీకు ఉద్యోగం వస్తుందిరా నాన్నా అని—నోటిదాకా వచ్చాయి మాటలు—నీ కష్టాలు తీరిపోతాయి ఇక హాయిగా సుఖంగా నిర్భయంగా బ్రతుకు. నూరేళ్లు వర్ధిల్లు. నువ్వు ఎదురుచూస్తున్న ఉద్యోగం ఆర్డరు వస్తుంది ఇవాళ—తప్పదు! నీకు ఇంక ఎదురుండదు! ఎక్కడికిపోయినా, ఏపని చేస్తున్నా అవే మాటలు పదేపదే అనిపించసాగాయి నాకు—

—లోపల మరొక గొంతుక అంది: ఇదంతా నీ కోరిక. నువ్వు కోరుకున్నది జరిగితే ఇంక బాధేముంది. ఇదంతా నీ నిష్ఫలమైనకోరిక. నిన్ను క్షణక్షణం హింసించే పాడు పీడకల. ఔన్సుగ్లాసులాగ బ్రద్దలయే పెద్ద పాపిష్టికల!

అనుమానమే. అయినా నేను అలా అనుకోకుండా ఉండలేకపోయాను. నాలో ఎదో ఒకమూల దృఢంగా నమ్మకంగా చెబుతున్నది. ఎవరో దివ్యమైన అమృతమూర్తి నా కళ్లకికట్టినట్టు అవుపిస్తున్నాడు. ఈ మనిషి నా చెవిలో రహస్యం చెబుతున్నాడు: ఈపాటికి నీ కొడుక్కి ఆర్డరు వచ్చివుంటుంది. ఈపాటికి! ఈ వార్తని నీకు ఎం... వేయడం అని తొపాటుర్పాగా జీవితమంతా ఒక్కసారి వెలిగితే, తను ఋణవిముక్తి పొందిన రామదాసులా అయిపోతే, నీ కొడుకు హాయిగా మనసు తేలికపడి, డోలాయమానమై, తెల్లటిమబ్బు పేదులాగా బంగారు పిచ్చుకలాగ తేలిపోతూ ఉంటే ఉంటాడు.

అవును. పోస్టువాడు రోజూ ఒంటిగంటకే వస్తాడు. నిత్యం గడపదాకా వెళ్ళి ఎదురుచూసి వాడు రావడం ఆలస్యమైతే విసుక్కుని; వాడు వస్తే, మీకు ఉత్తరం రాలేదని అంటే, నువ్వు ఎంతసేపటినుండి ఎదురుచూసినా, వాడు సైకిలు బెల్లు మోగించుకుంటూ హుటాహుటిగ వచ్చి నీ ఇంటిముందు ఆగినవాడు ‘ప్చ్! మరిచిపోయాను, లేవు, ఇవాళ మీకేమీ రాలేదు’ అన్నట్టు, తనేమో మహా రోజు కొక జాబు చొప్పున యిస్తున్నట్టు, పల్లెత్తు మాట్లాడకుండా, సైకిలు దిగి పక్కగుమ్మానికి వెళ్ళిపోతుంటే—తనేమీ వాడికోసం ఎదురుచూడ్డం లేదన్నట్టు, అలా అవుపించడానికి ప్రయత్నిస్తే, వాడు చక్కా వెనక్కి తిరిగిపోతుంటే;—

ఆరోజు వాడు నవ్వుతూ ఎదురైతే నీకో సువార్త తెస్తున్నాడని నువ్వు భ్రమపడి, సంకోచిస్తూ చెయి సాచితే, వాడు కట్టలన్నీ కలయతిప్పి, లేదని ముందే చెప్పలా, ఉంటే నేను ఇవ్వనా, మీరు ఎప్పటికప్పుడు ఎదురుచూస్తున్నారని నాకు తెలియదూ అన్నట్టు అవుపిస్తే, ఒక్క క్షణం తను ద్వారపాలకుని శిలాప్రతిమలా అయిపోతే—అయినా ఏ రోజుకైనా రాకపోతుందా అని—అలవాటుగా మారిన ఆశవల్ల తను రోజూ ఎదురుచూస్తున్నా—అవును, ముసలివాడు అన్నీ చూస్తూనే వున్నాడు. అన్నీ చూస్తూనే తనేమీ చెయ్యలేని స్థితిలో; అవును, తన కొడుకు పడుతున్న దురవస్థ, మనోవేదన—అవును, తను అన్నీ చూస్తూనే వున్నాడు.

జీవితంలో తొలిసారిగా ముసలివాడు గొణుక్కోవడం మొదలుపెట్టాడు: ఇవాళ పోస్టువాడు ఆర్డరు తెచ్చేవుంటాడు. ఇవాళ ఆర్డరు వచ్చితీరాలి! ముసలివాడు తనకి తెలియకుండానే పైకి మాట్లాడుతున్నాడు. మాటలనే రెక్కలు వచ్చిన వాంఛల్ని, వాంఛలనే రెక్కలు విరిగిన మాటల్ని పైకి అనేస్తున్నాడు.

అందని ద్రాక్షపండులాంటిది వాంఛ...
తన చెవిలో ఎవరో రహస్యం ఊదుతున్నారు:
‘మీవాడికి ఉద్యోగం అయిందటగా!’
చూడూ, నేను నమ్మలేకపోతున్నాను.

'నిజంగానా?' తనూ రహస్యంగానే, ఆత్రుతగానే.

'ఈ మధ్యాహ్నం ఆర్డరు వచ్చిందటగా. నీకు తెలియకపోవడమేమిటి!'

'నిజంగా!' ఏదీ, నేను ప్రొద్దునగా పనిలోకి వచ్చానా. తెమిలితేనా. ఇంతవరకు ఇంటికే పోక పోతిని. 'ఎవరు చెప్పారు నీకు?'

'స్వయంగా మీవాడే చెప్పాడు, బజారులో అప్పపిస్తే—నిజంగా నీకింకా తెలియనేలేదా?'

'భలేవాడివేలే. నాకు తెలియకుండా ఎలా వుంటుంది!' అలా మాట్లాడతావేం! ఏమిటి నీ ఉద్దేశం!

'నాకు ముందుగానే తెలుసులే!'

'అబ్బే, ఏమీ లేదు. వాడు నీదగ్గరికి రాలేదేమిటా అని.'

'అలాంటిదేమీ లేదులే! ఏదీ, వాడికి తీరిక ఉంటేనా! స్నేహితులతో జల్సాచేస్తూ వుండి వుంటాడు.' లేదులేదు. వాడు నన్నెందుకు మరిచి పోతాడు? నేనంటే వాడు పంచప్రాణాలు విడుస్తాడు సుమా! మా ఇద్దరి సంబంధాలు మీకు అర్థం కావులే! అయినా తండ్రీ కొడుకుల్లో ప్రేమానురాగాలు ఎలా పెనవేసుకుంటాయో మీ కెలా తెలుస్తుంది!

వాడు ఈపాటికి వస్తూవుండాలి. అబ్బ, ఇవాల్టికి నాకు పెద్ద పద తొలగిపోయినట్టుగా హాయిగా వుంది.

'నేను అప్పుడే అనుకున్నానులే. వాడికి ఆర్డరు వచ్చివుండాలి. నాకు ముందే తెలుసును!'

'ఐతే టీపార్టీ ఎప్పుడు మరి?'

'ఏదీ, వాణ్ణి రానీ. నువ్వే అడుగుదువుగాని.'

—చూశావా, నేను చెప్పలా వాడికి ఉద్యోగం అయింది.

—అలాగే కామాలు. ముందుగా మనకేం తెలుసు. ఐనా వస్తే మంచిదేగా. మన కోరికగూడా అదేగా.

—ఇంకా అలాగే మాటలు విరుస్తావేం. వచ్చిందని ఒకపక్క నుంచి చెబుతుంటే!—

మళ్ళీ అతడి లోపలిగొంతుక నోరు విప్పలేదు. అలాగని ఒట్టు వేసుకునుంటుంది!

'అబ్బ! ఎన్నాళ్ళకెన్నాళ్లకి వింటున్నాను!'

*　　*　　*　　*

'వాడు వస్తున్నాడేమోనని చూస్తున్నాను. లోపల ఆశ అలా పీడిస్తున్నది. సాయంత్రం అయ్యేకొద్దీ వాడు రావడం ఆలశ్యమయ్యేకొద్దీ లోపల కలతగా కలకగా భయం పుట్టుకొస్తున్నది. ఆదుర్దాగా ఎప్పుడు వస్తాడా వాడు, వచ్చి ఆ శుభవార్తని నా చెవినిగూడా ఎప్పుడు వేస్తాడా అని నేను ఎదురుచూస్తున్నాను. అయితే వాడు రాలేదు. నాన్న ఇంటికి వస్తాడుగా. వచ్చిన తర్వాత చెప్పొచ్చులే అనుకున్నాడేమో, ఏమో మరి.

అయితే ఇవాళ ఆర్డరు రాలేదూ!

నాకు ఒళ్లంతా ముచ్చెమటలు పోసినై. చేతులు వొణుకుతున్నై.

—వాడు నీదగ్గరికి రాడు. ఎందుకు తెలిసిగూడా నటించడం. ఎందుకు వంచించుకోవడం. నిన్ను నీవు ఎన్నాళ్లని మభ్యపెట్టుకోగలవు.

'నిజం కొన్నాళ్లనుంచి మా ఇద్దరికీ మాటల్లేవు. అలాగని అదేమో హటాత్తుగానూ జరగలేదు. నాకు తెలియనూ తెలియదు. అ· జరుగుతూ వచ్చింది.

నేను మామూలుగా పనిలోకి వెళ్లేసమయానికి వాడు ఇంకా నిద్ర మంచంమీదనుంచి లేచేవాడు కాదు. అదే చదువుకునేరోజుల్లో అయితే వాడు తెల్లారుగట్లే లేచేవాడు. సంవత్సరంనుంచిచూస్తున్నా. ఉహు, వాడు బొత్తిగా మారిపోయాడు. పనిపాటలు లేకపోవడంమూలాన కాబోలు వాడు మరీ బద్ధకస్తుడై పోయాడు. ఇంకా ఏమేం అలవాటు చేసుకున్నాడో మనకేం తెలుస్తుంది! ఇంకా కొన్నాళ్లు ఇలాగే జరిగితే, ఇప్పుడే ఇంత పాలుమాలితే, ఇంక ఏపని చెయ్యడానికి పనికిరాకుండాపోతాడేమోనని నాకు కోపం వచ్చేది. అంతేగాని రాత్రిళ్లు ఆలోచనతో, జిజ్ఞాసతో నిద్రపట్టక రోజురోజుకీ అలాగైపోతున్నాడని నా కెలా తెలుస్తుంది. నేనేం అలాంటివిమాశానా· పెట్టానా!

అంతకుముందెన్నడూ వాడు నన్ను అ·క్కుండా ఇంట్లో దమ్మిడీకూడా ముట్టుకునేవాడు కాదు. వాడు స్టూడెంటుగావున్నరోజుల్లో ప్రతినెలా ఖర్చుకి వాడుకోమని ఐదురూపాయలు ఇచ్చేవాణ్ణి. ఇప్పుడు ఇల్లు గడవడమే కష్టంగావుంటే ఎలా ఇవ్వగలను!

అప్పుడప్పుడు నా జేబులోవి బేడా, పావలా, అర్ధా కనుపించకుండా పోయేవి. మొదట్లో చూసీ చూడనట్టుగా పోయాను. అయినా ఎంతో అవసరం ఉంటేనేతప్ప తీయడు అనుకునేవాణ్ణి. అయినా ఇలాంటి బుద్ధులు అలవర్చుకుంటున్నాడేమిటా అని నాకు కోపంవచ్చేది—అయినా వాడు మనిషయ్యాడు. నలుగురిలో తిరిగాల్సినవాడు. నువ్వు ఖర్చుకి ఇవ్వకపోతే తీసుకోక వాడేం చేస్తాడు. ఖర్చులో ఖర్చు అనుకుంటే వెళ్లి బారిపోయేదిగా—

కొన్నాళ్ళయినతర్వాత ఏమనుకున్నాడో నేను చూడకుండా డబ్బుతీయడం కటిక్కన మానేశాడు. నేను కోటువిప్పి వంకెకి తగిలిస్తే, జేబులో చిల్లర ఎంతవుందో లెక్కపెట్టడం వాడు చూస్తుండేవాడనుకో. అయినా వాడు మానేస్తే నాకు భయం వేసేది! నేను ఎప్పుడూ ఒక్కమాటకూడా అనలేదు వాణ్ణి.

ఒకరోజు ప్రొద్దున నేను పనిలోకి వెళ్లబోతూ జేబులు తడిమిచూసుకున్నా. ఉన్న రెండు రూపాయలనోటు కనపడలేదు. తెచ్చిన డబ్బంతా వాడి ముఖాన పడుతుంటే, వాడి షికార్లకు చాలకపోతే, అవురావురుమని ఇంటికివచ్చే నువ్వు ఇంత పెద్దతనంలో వస్తు ఎం- ఉంటావు! నాకు ఒళ్లు తెలియని కోపం వచ్చింది. వసారాలో వాడు మంచంమీద గోడవైపుకు తిరిగి పడుకునివున్నాడు. వాడు నిద్రపోవడంలేదని నాకు తెలుసు. నా కంటి ముందు లేచి ఆ ఘనకార్యం కొస్తా చక్కబెట్టివుంటాడు. అంత నీచపుపనికి పాల్పడతాడనుకోలేదు నేను. ఎన్ని కష్టాలు వచ్చినా ఎంత పేదరికం అనుభవిస్తున్నా, నా కొడుకై వుండి వాడు దొంగతనం చేస్తాడనుకోలేదు నేను. నా కడుపున చెడబుట్టాడు!

—అయితే తండ్రిజేబులో డబ్బుతీస్తే కొడుకు దొంగ అవుతాడా? నేరం చేసినట్టా?: బ్రతికివుంటే బహుశా వాళ్ళమ్మ ఇలా అనేదేమో!

—ఆర్చే వాగకు. నోరుమూసుకుని నువ్వొక పక్కన పడివుండు! బహుశా 'వాళ్ళమ్మ కిక్కురుమనకుండా ?,కపక్కకి ఒత్తిగిలేదేమో!

నా కోపంలో అన్నాను: 'రెండురూపాయల నోటు తీశావా?'

"ఊఁ..." వాడిలో నిశ్శబ్దం ఎక్కువ.

"ఇచ్చెయ్ ముందు-" వాడిలో మమత, మెత్తదనం, రోషం, ఉగ్రం—వాడిలో మౌనం ఎక్కువ. "ముందు ఇచ్చెయ్యమని..." నా కోపం నన్ను వేధిస్తున్నది. వాడి మౌనం నన్ను కాలుస్తున్నది.

నేనేమన్నానో...వాడేమన్నాడో...వాడు గబగబా రెండు రూపాయల నోటు నామీద పారవేసి దూకుడుగా వెళ్ళిపోయాడు.

లేదు, మెల్లగా వెళ్లిపోయాడు!

ఆ మధ్యాహ్నం కంపెనీలో ఎవరో చెప్పారు నాకు, రైల్వేలో ఖాళీలు ఉన్నట్టు—లైబ్రరీలో ఆ ప్రకటనకోసం వెనకటి పత్రికలు తిరగవేసి అప్పుచేసి రెండు రూపాయలు తీసుకున్నాను. అప్లికేషను ఫారాలు కొని, ఆరోజు కొత్త పెందలకాడే ఇంటికి వెళ్ళాను. అప్పటికి నా కోపమంతా చల్లారిందేమో, లోలోగా నన్ను నేను బాగా తిట్టుకున్నానేమో, అవానే ఏమీ జరగనట్టుగానే అవి వాడికిచ్చి అన్నాను "పూర్తిచేసి పంపించు." ఇవాళే గడువు తేది!

వాడు ప్రొద్దున జరిగినవన్నీ మరిచిపోయినట్టు కళ్లు దించేసుకుని మెల్లగా అన్నాడు: "ఇందుకే నాన్నా. ప్రొద్దున నేను తీసుకుంది." నా గుండె గుబుక్కుమంది. కొలు వేసినట్లయింది. కళ్ల వెంట గిరగిరా నీళ్లు తిరిగాయి. మనం ఇన్నాళ్ళు కలిసివుండి, నీ తండ్రినై వుండి, నీ మనస్సు తెలుసుకోలేకపోయానురా! నాన్నా, నిన్నెంత కష్టపెట్టాను. నా అజ్ఞానం వల్ల నిన్ను ఎన్నెన్ని మాటలన్నాను. నన్ను క్షమించు నాన్నా, లోలోపల అనుకున్నాను—

అంతా తల్లివాటమే! తలుచుకుని తలుచుకుని లోలోపలే కుమిలిపోయాను. నా గుండె ఎప్పుడో చెదిరిపోయింది. నేను అదివరకులా ధైర్యంగా ఉండలేకపోతున్నాను. చిన్నదానికి పెద్దదానికి ప్రతివిషయానికి గజగజలాడిపోతున్నాను. అప్పుడు ముఖం పక్కకి తిప్పుకుని గబగబా వంటింట్లోకి వెళ్ళి నాలో మనసారా తృప్తిగా ఏడ్చానేమో! ఎంత అసహ్యంగా వుంటుంది ఏడుపు! ఈ వయస్సుకి ఏడుపు ఎంత అసహజంగా వుంటుంది! అయినా, ఎంత ఓదార్పునిస్తుంది!

అలా మేం ఇద్దరం దగ్గరిసా జరుగుతూ కూడా, ఒకరి కొకరం అన్యోన్యంగా వుండడానికి ప్రయత్నిస్తూ గూడా, ఒకరి కొకరం ఎడమైపోయాము. అలా తెలిసీ తెలియకుండానే అప్పటినుంచే అనుకుంటూ—మా ఇద్దరికీ మాటల్లేకుండా పోయాయి.

వాడు రాకపోతే రాకపోయాడు. నేనే వాడి దగ్గరికి పోతాను. నిజం. నాకామాత్రం చనువులేదూ; అధికారం, ప్రేమ, వాత్సల్యం హక్కులేదూ! నిజం. నేనే వాడిదగ్గరికి పోతాను—

—ఇంతకుముందువన్నీ తలుచుకుంటేవాడు నీదగ్గరికి రాడు.

—లేదు లేదు. ఇంతకుముందువన్నీ తలుచుకునైనా వాడు నాదగ్గరికి వస్తాడు. ఒకరికోసం ఒకరం లోపల్లోపల ఎంత క్షోభించి పోతున్నామో, ఒక్కసారి గతమంతా మరచిపోయి మళ్ళీ తండ్రీ కొడుకుల్లా, నిండుగా వికసించి ఉల్లాసంగా ఊగిపోయే పూలమొక్కల్లా బ్రతకాలని లోపల్లోపల గుండె ఎంతగా కొట్టుకులాడుతుందో మీకెలా అర్థమౌతుంది! నిజానికి నాకీ ఆలోచనలు అప్పుడు రాలేదు—

అయినా తొందర తొందరగా ఇంటికిపోదామని లోపల ఇంకా ఆశ మిణుకుమిణుకులా జీరాడుతూ వుంది. మసకమసక చీకటి పడుతూవుండగా అలా ఆలోచించుకుంటూ ఆరోజు పని ముగించుకుని లేపూ, ప్లాన్లూ, రికార్డ్లూ, డెయిలీ రిపోర్టూ వొప్పగించిపోదామని కంపెనీకి వెళ్తున్నాను. నాకేమో గుబులుగుబులుగా వుంది. కళ్ళముందు గుబుర్లు గుబుగుబుర్లుగా వుంది. ఒళ్ళంతా కంపర మెత్తుతోంది.

మా కంపెనీ ఆవరణచుట్టూ ఎత్తుగా పెద్ద ముళ్ళకంచెవేసి వుంటుంది. లోపలికి పోవడానికి రెండు పెద్ద ఇనుప గేట్లు వున్నాయి. రోజూ కుడివైపు గేటులోంచి వెళ్ళడం అలవాటు నాకు. ఆరోజు బాగా అలిసిపోయాను — పని ముగించుకుని ఇంటికి పోదామనే తొందరలో ఉన్నాను. అందువల్ల నేను ఎటు పోతున్నదీ నాకే తెలియదు. అలాంటి స్థితిలో నాధ్యాసంతా వాడి మీదేవుంటంవల్ల, ఆ రెండో గేటులోంచి సైకిలు తొక్కుకుంటూ లోపలికి పోతున్నాను. ఆగేటంటే నాకు మొదటినుంచీ భయమే. దాంట్లోనుంచి రోడ్లు బాగుచేసేఇంజన్లు, లాగుడుబళ్లు, మిషన్లు, లారీలు పోతాయి. రోడ్డంతా గుంటలుపడి, తారుమరకలుపడి గలీజుగా వుంటుంది. ఆ గేటుముందు మురికికాల్వమీద నాలుగు పాతచెక్కలు పరిచి నేల మట్టంచేశారు. అవి రోడ్డుమట్టానికన్నా కొంచెం ఎత్తులోఉన్నాయేమో, ఆ చెక్కలు ఇంకా సరిగ్గా పాతక, ఇంకా మేకులు దిగగొట్టకపోవడంవల్ల అవన్నీ నేనుచూసుకోలా—అవన్నీ ముందుగా నాకెలా తెలుస్తాయి! పైగా మసకమసక చీకటి—సైకిలు గేటులోకి పోయేసరికి చేతులు వొణికాయి. సైకిలు కాలవ ఎక్కేసరికి, ఆ చెక్కలు ఎగిరి పైకిలేస్తే నేను హఠాత్తుగా కాలవలో పడ్డాను. కళ్ళు మెకంకమ్మి తల దిమ్మెక్కిపోతే—ఉక్కిరిబిక్కిరైపోతే — నిజానికి ఆ క్షణంలో ఏం జరిగిందో నాకే తెలియదు. స్పృహతప్పి పడిపోయానట. కాళ్లకి చేతులకి బాగా దెబ్బలుతగిలాయి. పదిరోజులేమో ఆస్పత్రిలో వున్నాను. ఐతే ఏముంది, ఏమైంది! అప్పటినుంచి ఈ లోకంలోని ముచ్చట్లనిచూసి ఆనందపడే యోగ్యతని పోగొట్టుకున్నాను. నా కొడుకుని కళ్లారా చూసుకుని మురిసిపోయే భాగ్యంలేదు నాకు. వాడు ఆఫసుకి దర్జాగా ఠీవిగా సంతోషంగా వెళుతుంటే చూడాలని నాకు మొదటినుంచీ కోరిగ్గావుండేది. అయితేనేం, నాకా అదృష్టంలేదు.

చూడు, ఈరోజులు మహా చెడ్డవి. ఇంత కష్టకాలం ఎప్పుడూ ఎరగను నేను. నానా అవస్థలు పడుతూ దేవుడా అని నెత్తీ నోరూ బాదుకుంటున్న వాళ్ళకి—ఒక్క రూపాయిడబ్బులు ఇవ్వగలిగే శక్తి స్తోమతా ఈరోజున ఒక్క కుటుంబానికూడా లేదు.

అయితే మాయందు దేవుడు చల్లటిచూపే చూశాడు. నేను ఈ లోకానికి కానివాణ్ణైపోయాననుకో. అయినా మావాడు ఈమధ్యనే "ఏ. ఎమ్. ఐ. ఇ." కూడా ప్యాసయ్యాడు. ఇంకా ప్రమోషన్ రావడానికి కొద్దికాలం పడుతుందనుకో. వాడు సలక్షణంగా ఇంత సంపాయిస్తున్నాడు. ఇప్పుడు నాకు ఏ దిగులూలేదు. హాయిగా గడుస్తున్నది. దేవుడు నాచూపు తీసుకుపోయాడనుకో. అయినా ఏం చేస్తాం? ఏదైనా మన చేతుల్లో ఏముంది! పేదవాళ్లం! ఏది వచ్చినా భరించాలి! అనుభవించాలి! దానితోనే తృప్తి పడాలి! దాంట్లోనే సుఖపడాలి! ఇప్పుడు నాపనయి పోయింది. ఏదో కాస్సేపు ఈ ఇంటికీ ఆ ఇంటికీ తిరిగి ఏదో ఇలా కాలం వెళ్లబుచ్చుతున్నాను.

గ్లాసులో చల్లని పానీయం అయిపోయి అడుగు అవుపిస్తున్నట్టు ముసలివాడి మాటలు. గౌరవర్ణపుగాలి. నీటి వాసన గాలి, బైట. ఎర్రగులాబి రేకులాగ కరగిపోయే సూర్యుడు.

చలివేంద్రంలోనుంచి బెటకు వచ్చినట్టు అయి, క్షణంపాటు మతిపోయినవాడిలా అయిపోయి, నిర్వీణుడైన వెంకటేశ్వర్లు తేరుకుని, జీవితంలో వేగు చుక్క అవుపిస్తే, మనసంతా ఆలోచనలో నిండిపోతే, ఆ ముసలివాడిదగ్గర సెలవు తీసుకుని ఇంటికి వెళ్లడానికి మనస్కరించక వెంకటేశ్వర్లు పార్కులోకి మూగవోయి స్థాణువులైన ప్రాణుల మధ్యకి చరచరా నడిచిపోయి, ఒకమూల చేరగిలపడితే—

అతని కళ్లముందు అతని గతం అవుపిస్తున్నది. మనసు తేలికపడి అతను ఏంచెయ్యాలో, ఏంచేస్తే ఎలా జగురుతుందో అతని కళ్లముందు అవుపిస్తున్నది..

వాన వెలిసినతర్వాత—అవును—వాన వెలిసిన తర్వాత



# కలగూర గంప

## గురజాడ వారి రచనలు పారనంది వారి విమర్శ

### శ్రీ అవసరాల సూర్యారావు

గురజాడవారి రచనలు, వీరేశలింగం గారిపై దాడి" అనే శీర్షికతో, సెప్టెంబరు నెల, భారతి సంచికలో శ్రీ పారనంది జగన్నాథస్వామి గారు ప్రకటించిన వ్యాసాన్ని చదివాను. 'కావ్యాలలో శృంగారం' అనే తమ వ్యాసంలో శ్రీ గురజాడ అప్పారావు గారు, శ్రీ వీరేశలింగం పంతులు గారిమీద దండెత్తినారని, విమర్శకుల ఆరోపణ. ఇలాగ, శ్రీ గురజాడవారు దండెత్తడానికి "కారణమేమైయుండును, వీరేశలింగం గారిపై అసహ్యము—అగౌరవము కలగాలని గదా గురజాడవారి ప్రయోజనము. కారణము నిరూపించడానికి తగిన ఆనాటి సామగ్రి దొరకలేదు. నా ఊహ, బహుశః వీరేశలింగంగారు, గురజాడ వారి కన్యాశుల్కంపై ఏమైనా ఎక్కడైనా చణికినారేమో." అంటూ శ్రీ పారనందివారు, బట్టతలకూ మోకాలికీ ముడి వేయ ప్రయత్నించారు.

శ్రీ వీరేశలింగం గారి కొన్ని రచనలలో సంప్రదాయసిద్ధంగా వస్తున్న మన ప్రాచీనకవుల శృంగార వర్ణనలు కనిపిస్తున్నవని శ్రీ గురజాడ వారు విమర్శించిన మాట నిజమే. విమర్శించడమంటే, దాడి వెడలమనే దాని అర్థం అని ఊహించుకుంటున్న శ్రీ పారనందివారు అనేక విచిత్రమైన భ్రమలతో తమ వ్యాసాన్ని వ్రాయడం సహజమే. వీరేశలింగం గారి రచనలలో శృంగార వర్ణనల వాసనపోలేదని శ్రీ అప్పారావుగారు కావించిన విమర్శనము సమంజసమో, కాదో పెద్దలైన శ్రీ పారనందివారితో వివాదమునకు దిగుటకు వ్యవధి లేకుండా వున్నా, పాఠకులకు అపార్థం కలిగిస్తూ, వారు మోపెన కొన్ని అభియోగములకు సమాధానమిస్తున్నాను. "వాటిని చూడడానికి చాలా ప్రయత్నించాను. లభించలేదు; గురజాడ వారి నాటి ముద్రణము దొరకలేదు. ఇప్పుడు దొరికే ముద్రణములోని పుటలు పంక్తులు సరిపడలేదు. సత్యము అరయసాధ్యము కాలేదు" అంటూ శ్రీ పారనంది వారు తామేదో సత్యమరసినట్లే పాఠకులను భ్రమింపచూశారు. వీరేశలింగం గారు తమ రచనలలో శృంగారవర్ణనలను చేయలేదని ఒక ప్రక్క వ్రాస్తూనే, "కాని వీరేశలింగం గారు ఈ పదాలను ఈ అసభ్యాలను విడిచివేసివుంటే బాగా ఉండియుండునని మా అభిప్రాయము. వ్యభిచార ప్రసంగం శ్రేయస్కరం కాదు; వీరేశలింగం గారి వంటి పారిశుద్ధ్యావలంబకులకు నచ్చకూడనిది ఆచారాదుల నెక్కిరింతలో ఈ దోషాన్ని దాటేరు కారు. నిజమే" అని శ్రీ పారనందివారు పేర్కొన్నారు. "ఇట్టి గ్రంథరచన లోకానికి హానిచేయును. దీనిని నిలుపవలయునని మా మతము అనే వాక్యాలతో వారి వ్యాసాన్ని చాలించారు గురజాడవారు. పూర్తిగా వారితో ఏకీభవిస్తాము" అని వ్రాసిన శ్రీ పారనందివారు యింత వ్యాసాన్ని ఎందుకు వ్రాసినట్టు ?

సాంఘిక దురాచారాలను ఖండిస్తూ శ్రీ కందుకూరి వీరేశలింగంగారు రచించిన ప్రహసనాలను గురించి వ్రాస్తూ శ్రీ జగన్నాథస్వామిగారు "ఈ గ్రంథాలన్నీ క్షణిక గ్రంథాలు; అనగా రస్కిను అనే ఆంగ్ల విమర్శకుని మాటల ప్రకారము ఆ సమయానికి పుట్టిన గ్రంథాలు." అన్నారు; ఇంకొకచోట "ప్రహసనాలు కావ్యాలా నిజంగా ఆలోచిస్తే" అంటూ శ్రీ వీరేశలింగం గారు కావించిన సాహిత్య సేవను విమర్శకులు క్షణికంగానే పరిగణించి అటు శ్రీ వీరేశలింగం గారికీ, యిటు శ్రీ గురజాడవారికీ తమ వ్యాసరచనలో అపచారం చేసినవారే అయారు.

"పచ్చిశృంగారము రెండురీతులుగా నుండును. రత్యాదివర్ణనము, స్త్రీల అవయవములను వర్ణించుటయు నందొకటి. నిజమయిన పచ్చిశృంగారమన్నది పరకీయ శృంగారము. ఈ శృంగారమే 'అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము'నందు వర్ణింపబడినది"ని పేర్కొంటూ శ్రీ అప్పారావుగారు అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనమునందలి కథా వస్తువును, నిర్వహణపద్ధతిని ఉపహరించారు. "శ్రీ పంతులుగారు భాషాసంస్కరణ కర్తలును సంఘ

సంస్కర్తలునైనను రక్తబలముచేత మన ప్రాచీన కవుల శృంగారము వీరికి ఆమూలాగ్రముగా వచ్చినది. అందుకు నిదర్శనము ప్రథమ సంపుటములో నగ్నా సనమునకు బూనిన అపూర్వ బ్రహ్మచర్యమును ప్రహసనమే" ఇవి శ్రీ అప్పారావుగారు వ్రాసిన వాక్యాలు. అయితే వీటిలోని "రక్తబలముచేత మన ప్రాచీన కవుల శృంగారము వీరికి ఆమూలాగ్రముగా వచ్చినది" అనే వాక్యార్థాన్ని అవగాహన చేసుకోక శ్రీ పారనందివారు వింత వింత సిద్ధాంతాలను కావించారు:" ఇందులో మొదటిదానిలోని 'సంఘసంస్కర్తలైనను' అన్నది, 'రక్తబలముచేత' అన్నది విమర్శన, ఖండనలకంటె ఎక్కువగా ఆగ్రహ ఫలోక్తులు అని నా మనవి. 32 వ యస్సున లేని "రక్తబలము" 44 న వచ్చింది గాబోలు! ఈ రక్తబలానికి ఉపయోగము పచ్చిబూతు శృంగార వర్ణన ద్వారానా!...రక్తబలానికి ఇంత అల్ప సంతుష్టా! అంతేకాకుండా వారిని ఎరిగినవారు ఎవరూ వారికి రక్తబలబాధ ఆరోపించరు. వారు ఎప్పుడూకూడా మంచి ఆరోగ్యస్థితిలో ఉండలేదు. వారి శరీరాన్ని పీడించిన శ్వాసకోశ రోగము లోకవిదితము."

సంప్రదాయ సిద్ధంగా వస్తున్న ప్రాచీన కవుల శృంగార వర్ణనలు శ్రీ వీరేశలింగంగారి రచనలనుండి పోలేదు అనే శ్రీ అప్పారావుగారి వాక్యాల తాత్పర్యం. అంతేనేకాని, శ్రీ వీరేశలింగంగారు రక్తబల బాధతో తమ అసంతృప్తిని తీర్చుకుంటున్నారని అప్పారావుగారు అనలేదు. శ్రీ వీరేశలింగంగారి నైతికప్రవృత్తిని శ్రీ అప్పారావుగారు శంకిస్తున్నట్టూ, వారి నైతికప్రవర్తన తామొక్కరికే తెలిసినట్టూ ఏమేమో ఊహించి "వారు అగ్నిహోత్రమువలె తీక్ష్ణమైన శుద్ధసంస్కారాన్ని నడిపి అత్యంత సన్నిహిత స్నేహితుల విరోధము సంపాదించిన వార"ని శ్రీ పారనందివారు శ్రీ వీరేశలింగం గారిని సమర్థిస్తున్నట్లు వచించబూనుకున్నారు.

శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారంటే శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారికి ఎట్టి గౌరవ భావముండేదో తెలియచేయడానికి శ్రీ అప్పారావు పంతులుగారు, తమ డైరీలలో వ్రాసుకున్న యీ వాక్యాలను ఉదహరిస్తున్నాను: "శ్రీ వీరేశలింగం పంతులుగారు నిశ్చయముగా మహాపురుషులు. సాహిత్యములో వొక శాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంథా లేవదీసినవారు. ఇది ఎంతో కష్టతరమైన పని. తెలుగుదేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము తనలో ప్రవహించుచున్నది కనుకనే, వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడెతవి." శ్రీ గురజాడవారి "కావ్యాలలో శృంగారం" అనే వ్యాసంలోని కొన్ని వాక్యాలను చూసి విపరీతార్థాలను భావించుతున్న శ్రీ జగన్నాథ స్వామిగారు శ్రీ అప్పారావుగారి డైరీలలోని పై వాక్యాలను చిత్తగించితే విషయం అవగతమౌతుంది. శ్రీ వీరేశలింగం పంతులుగారి యెడల శ్రీ అప్పారావుగారి కింతటి గౌరవభావమున్నది కనుకనే, వారి శిష్యులు శ్రీ బుర్రా శేషగిరిరావు పంతులుగారు "అప్పటికి ప్రసిద్ధులైవుండిన ఆంధ్ర ధీరాగ్రేసరులు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవితము కొంతవరకాయనకు మార్గదర్శకమై యుండునని ఊహ. సాహిత్యరచనలో సాంఘిక సేవ చేయడమనేది అప్పారావుగారికి శ్రీ వీరేశలింగంగారి రచనలవల్ల స్ఫురించివుంటుంద"ని అభిప్రాయపడిరి. కాని "నేను ఇద్దరినీ ఎరుగుదున"ని చెప్పుకుంటున్న శ్రీ పారనందివారు మాత్రం, శ్రీ కందుకూరి గురజాడలకు మధ్య ఏనాడూ లేని శత్రుత్వాన్ని వారిద్దరూ కీర్తిశేషులైన యీనాడు కల్పింప సంసిద్ధులవుతున్నారు! కవులను ఎరిగివుండడము వేరు; వారి తత్వమును అవగతము చేసుకోవడము వేరు. కవుల తత్వము ఆకళింపు చేసుకోనపుడు, విమర్శకుల కిట్టి చిక్కులు తటస్థించక తప్పదు.

"బహుశః వీరేశలింగంగారు గురజాడవారి కన్యాశుల్కంపై ఏమైనా ఎక్కడైనా చదికినారేమో" అని శ్రీ పారనందివారి వాక్యం. అలాగున శ్రీ వీరేశలింగంగారు చదికివుంటే బాగుండునని విమర్శకుల కోరిక కాబోలును! కాని ఆ కోరిక ఫలించేదికాదు. యీ దిగువ ఉదహరిస్తున్న వాక్యాలను చిత్తగించండి: "నిన్న నార్తరన్ సర్కార్సు ప్రోగ్రెసీవు యూనియన్ మీటింగు జరిగినది. మీ కన్యాశుల్కంలోని గిరీశంను గూర్చిన కొంత భాగం ఆడినారు. పొట్ట చెక్కలగునట్లు నవ్వనివారు లేరు. అద్భుతముగా నున్నది......కన్యాశుల్కపు కూర్పును నిన్న మెచ్చుకోనివారు లేరు. వీరేశలింగం పంతులుగారు, న్యా. సు; జ. రా గారు మొదలగు వారు మిగుల సంతోషపడిరి" అని పూజ్య శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తమ మిత్రులు శ్రీ అప్పారావు పంతులుగారికి 1912, నవంబరు 24 వ తేదీన వ్రాసిన వొక ఉత్తరములో కలదు.

శ్రీ వీరేశలింగం, అప్పారావుగారలకు గల మిత్రత్వమూ, ఒండొరులపై గల గౌరవభావమూ,

ఇరువురి రచనాపద్ధతుల స్వభావమూ తెలియకచేసే విమర్శనములవలన ఇరువురికీ అపచారం చేసినట్లే అవుతుంది.

"గురజాడవారు సంప్రదాయాతీతులు. కళాప్రియులు. రసికవరులు. శ్రీ ఆనందగజపతి మహారాజులుం - గారి ఆస్థాన సభ్యులలో ఒకరు. ఈ కాలములో విజయనగరం సాహిత్య సంగీత నృత్యాది లలితకళలకు ఆస్థానమైయుండేది. ఈ కళలలో ప్రప్రథమస్థానము ఆక్రమించినది శృంగారాను షంగికము. దీని అనుచరులలో ముఖ్యమైనవారు, నాచ్ గర్ల్సు, డాన్సింగు గర్ల్సు, సానులు, భోగంవారు,...సాయంకాలము కాగానే ఈ కళాప్రియులు ఆ కళావంతుల గృహాలలో చేరి మాటలు, పాటలు, పేకాటలు, నృత్యము, తాంబూలము, పానము మొదలైన వినోదాలద్వారా లాలిత్య కళలను కడుపునిండా హృదయమునిండాను ఆరగించి ఏ పది గంటలకో స్వంతగృహాలు చేరుకునేవారు..." అని శ్రీ పారనందివారు వ్రాస్తూ "ఈ కళావంతుల కళారాధన గురించి మాత్రము గురజాడవారు వీరేశలింగం గారు భిన్నాభిప్రాయము గలవారని ధైర్యముతో చెప్పగలన"ని ప్రకటించుకున్నారు. 'ధైర్యముతో చెప్పక'పోతే మానె, పోనీ అధైర్యముతోనైనా శ్రీ వీరేశలింగం, గురజాడలకుగల భిన్నాభిప్రాయము లేమో శ్రీ పారనందివారు చెప్పేనారు కారు!

కళావంతులు, సానులు, నాచ్ గర్ల్సు, గ్రాస్ గర్ల్సు మాట నాకు తెలియదు కాని, ఆనాడు గురజాడవారి స్నేహితులు, సమకాలికులు గొప్పపండితులు. వివిధశాస్త్రములలో ఆరితేరిన శాస్త్రజ్ఞులు. శ్రీ ఆనంద గజపతి ఆస్థానములో సంస్కృతాంధ్ర ఆంగ్ల సాహిత్య విషయములపై చర్చలు జరుగుతూ ఉండెను. ఈ చర్చలలో శ్రీ అప్పారావుగారు ఎంతో ఆసక్తితో పాల్గొంటూ వుండేవారు. "వివిధ శాస్త్రములలో శ్రీ మదానంద గజపతిమహారాజా వారి ఆస్థానములో యే సాయంకాలము యేమి ప్రశ్న పడి యెట్టి సూక్ష్మమైన శాస్త్రార్థము చేయవలసి వచ్చునో అని హడిలిపోతూ యెప్పటికప్పుడు తమ పాండిత్యమును పదునుపెట్టిన కత్తివలె నిత్యనూతనముగా వుంచుకోవలసినవారైన అప్పారావుగారివంటి ఆనాటి కాలేజీ పండితులు ఎట్లు గ్రంథపరిశీలన చేయుచుండెడివారో, ఎన్నెన్ని గ్రంథములు చదివేవారో, పేరుపడ్డ పండితులతో యెట్లు సంప్రతించుకొనేవారో అప్పారావుగారి డైరీలవల్ల కొంత గోచరింపకుండ"ని శ్రీ బుర్రా శేషగిరిరావు పంతులు గారు వ్రాసిరి. మాటవరసకు ఒకనాటి యిష్టాగోష్ఠిని శ్రీ అప్పారావుగారి డైరీలనుండి పేర్కొంటాను: "జ్ఞానప్రదమైన సాహిత్యము, శక్తివంతమైన సాహిత్యము అనే మామూలు సాహిత్యవిభాగమును గురించి చర్చ జరిగినది." (అక్టోబరు 6, 1887)

మరొకనాటి ఉదంతం: "నిన్నటి సాయంకాలం శ్రీ మహారాజావారు ఇతరుల మనస్సుకు నొప్పి కలిగించకుండా వుండడము గురించిన్ని, ఆగ్రహమును అదుపులో వుంచడము గురించిన్ని చెప్పిరి. దీనికి అవసరం యిట్లు కలిగింది. ఆ తొలిరోజున పిల్లవాళ్లను శ్రీ మహారాజావారి సమక్షములో ప్రశ్నిస్తూ లింగం లక్ష్మాజీ పంతులుగారు "నో ఎనీ" అనే పదబంధం వాడినారట. వెంటనే తన మామూలు ధోరణిలో "శర్మ" ఆయనమీద దండెత్తినట్టు" అది ఆంగ్లములో 'గుప్ప్రయోగ' మని ఆయనను మందలించెనట—అదీ ఆ పిల్లవాళ్లయెదుట!...గత కొన్ని దినములనుంచి రాజావారు అదేపనిగా లెక్కలేనన్ని వ్యాకరణములు తిరగవేసి 'నో ఎనీ' అనే ప్రయోగం తప్పా, అయితే యెందుచేత అనేసంగతిని చూస్తు

న్నారు. మేముకూడా ప్రమాణ గ్రంథములను తిరగవేస్తూ యెక్కడేనా యిట్టి ప్రయోగం దొరుకునా అని వెతికితిమి. ఈ రోజున (జూలై 5, 1895) న్యూమన్‌లోగాని ఫ్రూడ్‌లోగాని ఇట్టి ప్రయోగం దొరకవచ్చునని శ్రీ రాజావారు అప్రయత్నంగా తోచినట్టు అన్నారు. సూర్యనారాయణపంతులు 'న్యూమన్ చరిత్రోపన్యాసములు" మొదటి వాల్యూము పది పేజీలు అలాగ తిరగవేస్తూ వెళ్లేసరికి వింత "హ్వాదర్ ఆర్ నో ఎనీ" అనే ప్రయోగం కంటపడ్డది. అక్కడి కావివాదం ఫైసలయిపోయింది."

సాహిత్య చర్చలతోను, గోష్ఠులతోను, వివిధ విషయ పరిశీలనలతోను, సాంఘిక సంస్కరణోద్యమ వెల్లువలతోను, నిండిన నాటి శ్రీ అప్పారాయకవి సమకాలిక జీవితంలోవుండే వెలుతురు చూడలేక, కేవలము ఆయన "పేకాటలు, నృత్యము, తాంబూలము, పానము మొదలైన వినోదాలద్వారా లాలిత్య కళలను కడుపునిండా, హృదయమునిండాను ఆరగించి"నట్లు ధ్వనింపచేస్తూ శ్రీ పారనందివారు 'అప్పారావుగారికి పచ్చిశృంగారము ఇష్టాపత్తేమో అని తోచకమానదు. అట్టిదానిని కళగా తలచి అనింన్యముగా దానిని పోషించినట్లు గ్రీకుదేశపు నగ్న విగ్రహాలను, పాశ్చాత్య సంప్రదాయమైన నృత్య వేషాలను, బొకాచియో మొదలైన నాగరిక గ్రంథాలను సంస్కృతాంధ్ర మహాకవుల వర్ణనలను ఉదహరించిన వ్యాసభాగాన్ని తర్కిస్తే ఆ అభిప్రాయము బలపడగలదు" అంటూ వ్రాయడము అక్రమము.

"బహుశః ఆ దృష్టిలో వ్రాయబడిందా కన్యాశుల్కం, లేదా విజయనగర లలితకళా వాతావరణము లోనిదా?" అని సందిగ్ధ మనస్కులౌతున్న శ్రీ పారనందివారికి, గురజాడవారి వాక్యాలనే చదివి వినిపిస్తాను: "కన్యాశుల్కము నాటకం పిలవని పేరంటానికి 'మా అప్ప పట్టుచీర కట్టుకొస్తానని' బయలుదేరి యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కాని, మహత్తరమైన నైతిక ప్రయోజన మొకటి దానికివుంది. మానవ జీవితంతో నేను చెలగాటం ఆడ్డం లేనేలేదని యీ నాటకం చదివితే నీకు తెలుస్తుంది. ఎట్టి తృణీకార భావమూ లేకుండా, మానవజీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి ఈ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను."

"వారి కన్యాశుల్కంలో ఒక్కమారే వీరేశలింగంగారి నామము ఉచ్చరింపబడినది. అది కూడా అంత ఆమోదప్రదసందర్భంలో పడలేదు. రాజమహేంద్రవరంలోని వారి వితంతు శరణాలయం పేరుకు బదులుగా ఒక నామములేని వితంతు మఠం స్ఫురింపబడింద"నే నిరాధారమైన వ్రాతలతో అభాండమును మోప ప్రయత్నించారు విమర్శకులు.

లేనిపోని ఊహాలతో, పాఠకులకు అపోహాలు కలిగించ ప్రయత్నించి, శ్రీ వీరేశలింగం, శ్రీ గురజాడలకు అపచారంచేసే యిట్టి వ్రాతలవల్ల సాహిత్యమునకు ఎట్టి ప్రయోజనమూ కలుగదు.

# గ్రంథ విమర్శనము

## భాషాచారిత్రక వ్యాసములు

రచయిత: శ్రీ కోరాడ రామకృష్ణయ్య ప్రచురణ: కోరాడ పబ్లిషింగ్ హౌస్, 33, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్, మద్రాసు - 5. వెల 2 రూ 0.

భాషాచరిత్రకు సంబంధించిన యీ వ్యాసము లన్నియు నిదివరకు "భారతి" మొదలగు పత్రికలలో ప్రకటింపబడినవే. కాని యవి యన్నియు ఇప్పుడొక్క సంపుటిగా యీ గ్రంథములో చేర్చబడినవి. దీనిలో ప్రకటింపబడిన వ్యాసములు ఆరు కలవు. (1) భాషాశాస్త్రము-దాని క్రమాభివృద్ధి (2) ఆంధ్ర భాషాభ్యుదయము (3) ఆంధ్ర దేశ్యము-అన్య దేశ్యము (4) ద్రావిడభాషల పరస్పర సంబంధము (5) అరవము, తెలుగు — వాని ప్రాచీనత (6) భాషా కుటుంబములు.

"తెలుగుభాష" యొక్క పుట్టు పూర్వోత్తరములను చర్చించుటకు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు రచించి ప్రకటించిన యీ గ్రంథము అట్టి జిజ్ఞాసగలవారికి అట్టి పరిశోధన చేసెడివారికి కంచు కాగడా వంటిది. ఆంధ్రభాషలోనున్న పదముల నన్నింటిని లెక్కించి జనాభా లెక్కలు తయారు చేసినవిధముగా స్థూలపరిశీలన చేసెడివారికి కోరాడ రామకృష్ణయ్యగారు సూచించిన యీ క్రింది విషయము ముఖ్యముగా గమనింపదగి యున్నది.

"శబ్దరత్నాకరమందలి పదములు చూడగా, దేశ్యపదములు 12,337 అయియుండగా, సంస్కృత సమములు 14,814 ను, తద్భవములు 2,000 ను ఉన్నట్లు తెలియుచున్నది. ఇట్లు తెలుగులోని సంస్కృతపదములు, దేశ్యపదములకంటె, నెక్కుడుగా గన్పడుటచే, తెలుగు సంస్కృతము నుండి వచ్చినదిగనే కన్పడును. కావుననే సంస్కృత భాషాపండితులై, దానియందు విశేషాభిమానముగల ప్రాచీనాంధ్ర వైయాకరణులందరు నిది సంస్కృతము నుండి పుట్టిన భాషయే యని చెప్పుటకూడ తటస్థించినది. సంస్కృత పదములేగాక, యింక ననేక భాషలనుండి యనేక పదములు తెలుగులో వచ్చి చేరినవి...అయితే, యింతమాత్రమున వాఙ్మయ కర్తలు చెప్పినట్లు,—"నూటికి 50 కంటె అధికముగ తత్సమపదములు, నూటికి 15 వంతున తద్భవములు, నూటికి 10 వంతున వైకృతములు, 4 వంతున తురకపదములు, 5 వంతున నాంగ్ల పదములు— యీవిధముగ దీసివేసికొనుచు వచ్చుచున్నయెడల తెలుగుభాషయే శూన్యమగును. కాని యీ భయ మెంతమాత్రమును మనము పడవలసిన యవసరము లేదు."

క్రీస్తు పుట్టక పూర్వము రమారమి 5,000 సం॥ల క్రిందట సింధు నదీప్రాంతములో కొన్ని మహానగరములు వెలసియుండెను. ఆ సింధునదీ ప్రాంతములోని భూగర్భమునుండి ఆ నగరము లిప్పుడు బయటపడినవి. మొహింజొదారో అను పట్టణమున్ను హారప్ప అను పట్టణమున్ను యిప్పటికి 7 వేల సంవత్సరముల నాటివి ఆ నగరములను పరిశీలించి చూడగా, రెండంతస్తుల మేడలు, విశాలమైన వీథులు, రస్తాలప్రక్కను మురుగుకాల్వలు, జలక్రీడలకు తగిన తటాకములు కోనేరులు మొదలైనవి కన్పించుచున్నవి. 7 వేల సంవత్సరముల క్రిందట అత్యంత నాగరికతావికాసము గల జాతివారు యీ పటణములను నిర్మించిరని విదితమగుచున్నది. ఆనాటి నాగరికతావికాసమునకు "సైంధవ నాగరికత" అని నామకరణము చేయబడినది. ఈ పురాతననగరములలో లభించిన నాణెములు, మొదలైన వస్తువులమీద ఒక విధమైన లిపి కన్పించుచున్నది. అది సంస్కృతము కాదు - అది అత్యంత ప్రాచీనమైన ద్రావిడభాష యని పరిశోధకులు నిర్ణయించియున్నారు.

ఇది ఇట్లుండగా, బెలూచిస్థానప్రాంతమందు "బ్రాహూయీ" అను భాషయొకటి కన్పించుచున్నది. ఈ భాష సంస్కృతము మొదలైన ఆర్య భాషలవంటిది కాదు. తెలుగు అరవము మొదలైన ద్రావిడ భాషలలోని పదములకు ప్రతిబింబములు ఈ బ్రాహూయీ భాషలో కన్పించుచున్నవి.

ఆర్యులు భారతదేశంలో ప్రవేశించినప్పుడు వారితో వచ్చినది సంస్కృతభాష. ఆర్యులకంటె పూర్వము యీ దేశమునకు సుమేరియను తెగలవారైన ద్రావిడులు ప్రవేశించినట్లుగా మొహింజొదారో నగర శిథిలములున్ను సైంధవ నాగరికతా విశేషములున్ను విదితము చేయుచున్నవి. ద్రావిడులు యీ దేశములో ప్రవేశించి ప్రబలులై పట్టణములను నగరములను నిర్మించుకొని విస్తరించిన కొన్ని శతాబ్దముల

అనంతరము ఆర్యులు యీ దేశములోనికి ప్రవేశించిరని చరిత్రకారులు నిరూపించి నిర్ణయించక తప్పదు. పశ్చిమోత్తర ప్రాంతములనుండి ఆర్యులు ప్రవేశించినప్పుడు ద్రావిడులతో సంఘర్షించియుండిరి. ద్రావిడులు ఉత్తర ప్రాంతములనుండి మధ్య భారత ప్రాంతమునకును, అచటనుండి దక్షిణ హిందూస్థానమునకును కాందిశీకులై వలసపోయిరి. చిట్టచివరకు ద్రావిడులకు దక్షిణ భారత దేశము స్థిరావాసమైనది.

కాని, ద్రావిడులు, యీ దేశములో ప్రవేశించక పూర్వము యీ దేశములో ఆదిమనివాసులుగా గోండులు, భాండాలు, ముండాలు మొదలైన జాతులవారు కొందరు నివసించుచుండిరని చరిత్రకారులు సిద్ధాంతీకరించియుండిరి. ఈ ఆదిమ ఆటవిక జాతులవారితో ద్రావిడులకు సంపర్కము, సంఘర్షణ, సహజముగా సంభవించి యుండవచ్చును.

పైన చెప్పబడిన వరుస క్రమముగా ఆదిమ ఆటవిక జాతులతో ద్రావిడులకు సంపర్కసమావేశములు కలిగినప్పుడు యీ ఆదిమజాతుల భాషవల్ల ద్రావిడుల భాషాపదజాలము కొంత మార్పును చేర్పును కలదై యుండును. అటువంటి ద్రావిడభాషను ఉపయోగించెడి ద్రావిడులతో ఆర్యులకు సంపర్కము కలిగినప్పుడు ఆర్యభాషయందు పై జెప్పిన ద్రావిడభాషా ప్రభావము గాని, ప్రయోగములు గాని, పదజాలము గాని సహజ సంసర్గకారణముచేత కన్పించవచ్చును. కనుక, సంస్కృతభాషకంటె పూర్వము ద్రావిడభాష, దానికంటె పూర్వము ఆదిమజాతుల భాష యీ దేశములో వర్తించుచుండెననుట మున్ముందుగా అంగీకరించవలసిన సిద్ధాంతము.

ఈ సిద్ధాంతమును అంగీకరించినయెడల తెలుగు, అరవము, కన్నడము, మళయాళము మొదలైన ద్రావిడభాషలకన్నింటికి తల్లిభాష సంస్కృతమని వాదించుటకు వీలులేదు. ఈ దేశములోనికి సంస్కృతము రాకపూర్వమే ద్రావిడభాష యనునది ఒకటి ఉన్నదని అంగీకరించవలసిన అగత్యము ఏర్పడుచున్నది.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సంస్కృతమువల్ల తెనుగు బహుముఖవికాసము చెందినదనే విషయమును అంగీకరించెదరు. కాని, తెనుగు అనునది ఒక ప్రత్యేకమైన అనాదిసిద్ధమైన భాష కాదనెడివారి వాదనను అంగీకరించరు. తెనుగు అనునది అనాదిసిద్ధమైన ద్రావిడభాషాకుటుంబమునకు చెందినదని నిరూపించుటకు వీరు చేసిన పరిశోధన రాగద్వేషరహితమైనది. వారు వెల్లడించిన యీ క్రింది అభిప్రాయము గమనింపదగియున్నది.

"ద్రావిడభాషా కుటుంబములో మొదటినుండియు దక్షిణ హిందూదేశమున వ్యవహరింపబడు భాష లన్నింటితోపాటు తెలుగుభాషయు జేరియున్నది....అయితే యివన్నియు నొక కుటుంబమునకు జెందినవని జెప్పినంతమాత్రమున ఒకటి రెండవదానికంటె ప్రాచీనమని గాని ఒకదానికొకటి తల్లివంటిదని గాని చెప్పినట్లు కాదు...ఇవన్నియు ప్రాచీనంబగు మఱియొక భాషనుండి వచ్చిన సోదరీభావమునే వహించి యుండవచ్చును. అయినను వేళ ప్రాచీనతరంబగు వాఙ్మయము గాని, ప్రాచీన భాషాలక్షణములు గాని తక్కినవానికంటే నెక్కుడుగానున్నను అది తక్కినవానికి తల్లిభాష కానేరదు. ఇండో-యూరోపియన్ భాషా కుటుంబము విషయమున జరిగిన యపారంబగు భాషాపరిశ్రమ యీ దక్షిణదేశ భాషలవిషయమున జరుగలేదు. కనుక యట్లు జరిగినచో నీ (దక్షిణదేశ) భాష లన్నిటికి మాతృభాష, యేదో, యెట్టి స్వరూపము కలదో నిరూపించి వీనిలోవీనికి గల పరస్పరసంబంధ మిది యని మనము నిరూపింపగలిగియే యుందుము. కావున మాతృభాషాభిమాను లందఱు దీని విషయమున దగిన పరిశ్రమను చేయుదురు గాక!"

## త్యాగమూర్తి

పద్యకావ్యం: కీ. శే. పొట్టి శ్రీరాములు గారి సంగ్రహం: రచన: కోట సోదరకవులు ప్రాప్తిస్థానం: కవిచంద్ర గ్రంథమాల, కనిగిరి: నెల్లూరు జిల్లా; వెల 0-8 0.

## సగ్రహ రాఘవేశ శతకము

రచన: శ్రీ కంభాలూరి నరసింహశర్మ: యాడికి; అనంతపురం జిల్లా; వెల 0.5-0.

## పరిణామవాదం

రచన: శ్రీ చేఃసానివాసుదేవరావు; విశాలాంధ్ర ప్రచురణ: విజయవాడ 2; వెల 0-12-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.



# నే నెప్పుడూ వండనంత అమిత రుచైన ఆహారము . . . అదెందువల్లో మొట్టమొదట నాకు తెలియదు!

ఒకనాడు భోజనాల వేళ మామూలులాగానే ఉండింది. మా ఆయన ఎప్పటిలాగ ఆలశ్యమే రావడానికి. పిల్లలు చేతులు కడుక్కోడానికి దెబ్బలాడుచుండిరి. పాపాయి నిద్రనుండి లేచి ఏడ్చుచుయుండినది. ఆఖరుకు అంతా కూర్చున్నారు. అన్నం వడ్డించాను. అప్పుడు ఏం జరిగిందంటే! అసలు మొదటి ముద్దనుంచీ అల్లరి లేదు. పోటీలోలాగ మెదలకుండా తినేశారు. ఆ కుటుంబమేనా? అని ఆశ్చర్యపడ్డాను. ఏమి వర్గ్గా చేశాను?

మా ఆయనకెప్పుడూ అసంతృప్తే అహార విషయంలో. పిల్లలూ తండ్రితోపాటు అల్లరే! భోజనానంతరం కూర్చుని ఆలోచించాను. అనాడు వుదయం ఏం కొన్నానో బజార్లో! కాయగూరలా?....మార్పేమి లేదు. మాంసం, చేపలా? ... మామూలువే. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. అదీ అసలైన మార్పు వంటలో! ఆనాడు, డాల్డా వనస్పతి డబ్బాను కొని వండి చూడాలని నిర్ణయించుకొన్నాను. మా దుకాణాదారుడు అది వేపుడుకు, కాల్చుటకు, మిఠాయికి శ్రేష్టమైన వంట క్రొవ్వుపదార్థమని సలహా ఇచ్చాడు. అతడు గాలి చొరని సీలు డబ్బాను నా చేతి కందిస్తూ, "ఇది ఆహారానికి కలిగించే సహజ రుచులను మీ కుటుంబం మెచ్చుకొంటారు" అని అన్నాడు.

అంతే! డాల్డా వనస్పతే తగిన మార్పును కలిగించింది. అది అన్ని వంటలకూ దివ్యమైనది. ఆహారానికి సహజ రుచులు కలిగిస్తుంది. వంటకు క్రొవ్వుపదార్థాన్ని విడిగా బజార్లో కొనుట వల్ల మీ ఆరోగ్యానికి ప్రమాదమున్నదని జ్ఞాపకముంచుకొనండి. ఎక్కువ ఖరీదైన క్రొవ్వుపదార్థములు కూడ కల్తీ చేయబడవచ్చును. లేదా? ఈగలు, దుమ్ము వల్ల చెడిపోతాయి. గాలిచొరని సీలు డబ్బాలోని డాల్డా వనస్పతి ఎల్లప్పుడూ తాజాది; పరిశుద్ధమైనది; ఆరోగ్యకరమైనది. మీరు మళ్లీ బజారుకు వెళ్లినపుడు కొనే సరకుల్లో డాల్డా ముఖ్యమైనదిగా నిర్ణయించుకొనండి. అందువల్ల ఎంత ఖర్చు తక్కువో!

10 పౌనులు, 5 పౌనులు, 2 పౌనులు, 1 పౌను మరియు ½ పౌను డబ్బాలలో దొరకుతుంది. డాల్డాలో ఇప్పుడు విటమినులు ఎ, డి వున్నాయి.

ఏది మీ కుటుంబానికి పుష్టికర ఆహారము?
ఉచిత సలహాకు ఇవ్వాళే క్రింది అడ్రసుకు వ్రాయండి:
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్, పోస్టుబాక్సు నంబరు 353, బొంబాయి 1



చెట్టుతోనున్న డబ్బానే చూడండి

డా వనస్పతి
వంటకు దివ్యమైనది—ఖర్చు తక్కువ

HVM. 218-X52 TL